# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెంబరు 19౫౫

సంపుటము 32 : సంచిక 12

విడిపత్రిక వెల ఒక రూపాయి

# భారతి ముప్పది రెండవ సంపుటము

## అకారాది విషయ సూచిక

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1955

ద్విశక్తిగల



# మోబిల్‌గ్యాస్ వాడి

## ప్రతి గాలనుకు అత్యధిక మైలేజీ పొందండి

నేడు దొరకుతున్న పెట్రోలులలో ఏది అత్యధిక మైలేజీని యిస్తుంది? గమనీయముగ, మీ కారు ఇంజనును అత్యంత సామర్థ్యముతో పనిచేసేలా ఉంచేదే. ఆ పెట్రోలే ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్ —ఎందుకంటె అది మీరు కొనగలిగే ఏ యితర పెట్రోలుకన్న ఎక్కువ ఇంజను బాధలను సరిచేయును.

కనుక మీ కారు ఇంజను అధిక శక్తిని యిస్తుంది, ఎక్కువ పొదుపుగా పనిచేస్తుంది. మీ కారు లేక లారీ అది యివ్వాలన్నంత సున్నితము, శక్తివంతమైన పనిని మీరు పొందుదురు.

ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్ వాడుట నేడే ప్రారంభించండి. ఈ పెట్రోలులో మాత్రమే మోబిల్ పవర్ కాంపౌండ్ కలదు. ఈ కాంపౌండ్ ఏ పెట్రోలులోనూ యిప్పటివరకు చేరని అడిటివ్‌ల అత్యధిక శక్తిగల మిశ్రమము. మోబిల్‌గ్యాస్ వాడుట లాభము. యిది మీ డబ్బుకి అధిక విలువ నిచ్చును.

ఎగురుచున్న
ఎఱ్ఱని గుఱ్ఱపు
చిహ్నముగల చోటే
—ఇంకెక్కడా
దొరకదు!





ఎక్కడెక్కడ ఉన్న లారీ డ్రైవర్లు ద్విశక్తిగల మోబిల్‌గ్యాస్‌నే మెచ్చుకుంటారు—దీనిని వాడితే పూర్తిగా శక్తి, అధిక పొదుపు లభించుట వారు గమనిస్తారు!

స్టాండర్డ్-వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము)

V. 1777



సంస్కృత విశ్వపరిషత్ మహాసభ, తిరుపతి.

వేదికపైనున్నవారు (ఎడమనుంచి) : ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, పరిషత్ అధ్యక్షులు శ్రీ కె. యం. మున్షీ, శ్రీమతి కుసుమ్ త్రివేది, మహాసభాధ్యక్షులు రాష్ట్రపతి శ్రీ బాబు రాజేంద్రప్రసాద్, ఆంధ్రగవర్నర్ శ్రీ సి. యం. త్రివేది, శ్రీ హరేకృష్ణ మెహతాబ్, శ్రీ కల్లూరి చంద్రమౌళి ప్రభృతులు.

# సుప్రభాతము

దాశరథి

తెలుగు ఇక్ష్వాకులలో తొలిరాజు శాంతమూలుడు, తన ప్రియాంగన యగు కుసుమలతను ఒకనాటి ఉదయమున నిద్ర లేపి ఆమెకు గల లక్షహాలదాన సంకల్పము నెరుగుట :

[గత సంచిక తరువాయి]

ఏదో స్వప్నము గాంచినావట వె సీ వింకన్ ప్రపంచమ్మునన్
పాదమ్మానని యట్లుగా కనబడున్ కన్నుల్ నిమీలించుటన్;
స్వాదు స్వప్నవనాంత కల్పఫలమాస్వాదించుచున్నట్టి నిన్
చేదుల్ గారెడి శుష్కలోకమునకున్ మేల్కొల్పి రాపించితిన్

నిద్రా ముద్రిత తావక
భద్ర ముఖాంభోజశోభ బహుభంగులుగా
ముద్రించె నా మనమ్మున
నిద్రా సౌందర్య లోకనిష్ఠ సుఖములన్.

కలకల్ల యంద్రడు, దానికి
గల విలువ లెరుంగ బోరు గాదే లోకుల్
కలలోగల మాధుర్య
మ్మిలలో నెందైన దొరుకునే లోలాక్షీ !

అనుటయు కుసుమలతా సతి
కను దమ్ములు విరియ ననిమె; కల నిజమగు న
ట్లొనరింతు వె? ఇక్ష్వాకు కు
ల నిశాకర ! శాంతమూల రాజలలామా !

కలను నిజము చేయగలవాడు కనరాడు
కలలు అలలవోలె కరగిపోవు
కలను తెలసి చేయగలరేమి రాజుకు
గాని, సార్వభౌములైనగాని.

# భారతి

అనుటయు రా జిట్లను నీ
కనిన కలయె నిజముగాక కల్లయయినచో
తెనుగు ధర నొక్క ఛత్ర
మ్మున పాలించుటయు కలయె బో నా కింకన్.

కలలో నెయ్యది నీవు గాంచితివొ నే కల్పింతు నీ భూమి మం
డల మందొక్క దినమ్మునందు; వచియించన్ బూను మింకన్ నిశా
లలనా నీల శిరోజ బంధనమునన్ రాణించు నక్షత్ర పం
క్తులతో చంద్రునిగూడ కోసికొని తెత్తున్ పుష్పగుచ్ఛమ్మటుల్.

రాజు మాట చెవికి రవ్వల కమ్మయై
కాంతి సూప రాజకాంత మెరసె;
ఆమె మనసులోని ఆ వర్తముల నెల్ల
నొక్కటొక్కటిట్లు లుచ్చరించె.

అటులైనన్ విను; కృష్ణవేణి తట మందాశ్చర్యమున్ గూర్చు నం
తటి దృశ్యమ్మును గాంచి నానదె అరణ్యగ్రావ సంఘాతముల్
త్రుటిలో జీర్ణములైచనన్ మరకతప్రోద్భాసి కేదారముల్
నటనమ్మున్ బొనరించె కర్షకుల కాంతల్ పాటలన్ పాడగన్.

ఈ మహావృక్షమ్ము లేవి కానగరావు
నీలాల పైరు పందిళ్లెగాని,
ఈ శైల శిఖరమ్ము లేవి కన్పడబోవు
చక్కని ఎత్తు మంచములెగాని,
ఈ ముండ్ల పొదరిండ్ల నేను చూడగలేదు
గుమురైన పూవుటీరములెగాని,
ఈ భల్లుకమ్ము లవేవి కానగరావు
కాపుకన్నియల మొగాలెగాని,

ఇన్ని యోజనముల నేల ఏకరీతి
శాద్వలాంబరమును కట్టి సంభ్రమించె,
అన్నమో రామచంద్రా యటన్నవాడు
కానరాడయ్యె విజయపురాన నాకు.

# సుప్రభాతము

ప్రతి కుటుంబి కొక్క బంగారు నాగలి
నీవు దాన మిచ్చు టనుగంటి,
దాని తోడు పండదగిన నాల్గెకరాల
నేల నొసగ చూడ జాలినాను.

ఇట్లు లక్షమంది ఏకక్షణమ్మున
దానములను గొంట నేను జూచి
బుద్ధ చైత్యములకు బోలెడు మాగాణి
నేను గూడ దాన మిచ్చినాను.

నీ దానమ్మును చూచి మెచ్చుకొనగా నీహారశైలాధి రా
ట్పాదోపాంతములన్ వసించెడు ఋషివ్రాతంబు లేతెంచె; నా
మోదంబందెను కర్షకప్రజల సమ్ముగ్ధాంతరంగంబు లా
శా దీపంబులు వెల్గె నాంధ్ర జనతా సౌభాగ్య గేహమ్ములన్

బుద్ధమూర్తి తాను పున్నాగ పూవులు
పరచియున్న దివ్య సరణి వచ్చి
మన గృహమ్ము మ్రోల కనుపించె తేజమ్ము
వలయమై శిరాన వెలయుచుండ.



# సంస్కృత విశ్వపరిషత్సభలు

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

తిరుపతిలో జరిగిన సంస్కృత విశ్వ పరిషత్సభలు అఖండ విజయోపేతముగా ముగిసిన వని ప్రత్యక్షముగా జూచినవారికిని, పత్రికాముఖమున తత్కార్యరూపముల నెరిగినవారికిని కూడ ఒకే అభిప్రాయము కలిగినది. 1951 మే నెలలో 'సోమనాథ్—ప్రభాస' పట్టణములో సోమనాథాలయ పునఃప్రతిష్ఠతోపాటుగా స్థాపితమైన సంస్కృత విశ్వపరిషత్తు 1952 నవంబరులో కాశీలో ద్వితీయ వార్షికోత్సవమును 1954 ఏప్రిల్ నెలలో నాగపూరులో తృతీయ వార్షికోత్సవమును జరుపుకొని, తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి పాదసన్నిధిని ఇటీవల తన చతుర్థ వార్షికోత్సవమును అపూర్వవైభవముతో జరుపుకొన్నది. ఒక సంస్కృత విద్వాంసుడు చమత్కరించినట్లు దివిజగంగ మొదట విష్ణుపాదోద్భవయై పిమ్మట శివునిశిరస్సు నధిరోహింపగా, ఈ పరిషద్గంగ శివుని సన్నిధిని తొలుత అవతరించి నేడు విష్ణుపాదముల నాశ్రయించినది. తొలి మూడు వార్షిక సభలను సందర్శించినవారు సర్వవిధముల తిరుపతి సభలు వెనుకటి సభల నతిశయించి జరిగినవని ఏకగ్రీవముగా అంగీకరించినారు.

సంస్కృతభాషాధ్యయనము పట్ల భారతదేశములోనేకాక ప్రపంచములోనే ఇతోఽధికమైన ఆసక్తిని, ఆదరమును ప్రేరేపించుట విశ్వపరిషత్తు ప్రముఖ లక్ష్యము. సంస్కృతము పేరెత్తినచో ఛాందసుడనీ, అభ్యుదయ నిరోధకుడనీ నిరసింతురని భయపడు కాలమున ఆవిర్భవించిన ఈసంస్థ యింత అనతికాలములో పలువురు రాజ్యపాలుర(గవర్నర్లు)ను, ముఖ్యమంత్రులను, విద్యామంత్రులను, న్యాయమూర్తులను, విశ్వవిద్యాలయోపాధ్యక్షులను సంస్కృత భాషానుకూలురనుగా చేసికొనగలుగుటేకాక, దేశములోని వివిధ ప్రాంతాలనుండి 1300 మంది సంస్కృత విద్వాంసులను, సంస్కృతప్రియులను ప్రతినిధులుగా ఆకర్షింపగలుగుట, ప్రజానీకములో సంస్కృత భాషాధ్యయనముపట్ల అపూర్వోత్సాహమును రేకెత్తింప గలుగుట నిజముగా ఘన విజయములే!

## తెలుగుల కార్యదీక్ష : సేవాదక్షత

నవంబరు 10 వ తేదీరాత్రి, 11 వ తేదీ ఉదయము తిరుపతివచ్చే రైళ్లు, బస్సులు, ఇతర మార్గాలు పరిషత్ ప్రతినిధులతోను, ఉత్సవ సందర్శనార్థమై వచ్చే ప్రేక్షకులతోను కిటకిటలాడిపోయినవి. రైలుమార్గమున వచ్చే ప్రతినిధులకు రేణిగుంటవద్దనే స్వాగతమిచ్చి ఆహ్వానసంఘమువారు బస్సులలో సాదరముగ వారిని ప్రతినిధుల బసలకు చేర్చినారు. వందలాది ప్రతినిధులకు బసలు కేటాయించుటలో ఎట్టి విలంబము జరుగుటకు వీలులేని ఆ ఏర్పాట్లు, భోజన, అల్పాహారాదులు సకాలములో ఔత్తరాహులకు దాక్షిణాత్యులకు వారి వారి అభిమతభక్ష్యములతో సహా - వడ్డన జరుగునట్లు చూచిన కంజాయింపు ఆహ్వాన సంఘము వారి దూరదృష్టిని, కార్యదక్షతను వ్యక్తముచేసినవి. వాలంటీర్లుగా పనిచేసిన విద్యార్థులు, విద్యార్థినులు అడుగడుగున ప్రదర్శించిన ఓర్పు, సేవాభావము ఆంధ్రేతర ప్రతినిధులకు తెలుగువారి సౌజన్యమును వేనోళ్ళ చాటినవి. పరిషదధ్యక్షులు శ్రీ మున్షీ తమ ఉపసంహారోపన్యాసములో "నేను వెనుకనే ఏదో గ్రంథములో భారతదేశములోని ఆర్య, ద్రావిడ, సంస్కృతులను సమన్వయపరచిన ఘనత ఆంధ్రులకే దక్కవలసి యున్నదని ఆంధ్రులను ప్రశంసించియున్నాను. చాల కాలము క్రితమే నేనది వ్రాసినాను గనుక నేటి మీ ఆతిథ్యమునకు పరవశుడనై మిమ్మ మెచ్చుకొన్నానని నన్నెవ్వరు నిందింపలేరు" అని చమత్కరించెను. ఆ మాట అన్న వెంటనే శ్రీ అనంతశయనం. గారులేచి "మున్షీగారు ఆంధ్రులలో కలసిపోయినారు అందుచేత వారు ఆంధ్రులనుగూర్చి చేసిన ప్రశంసలన్నీ వారికికూడా చెందగలవు" అని జవాబు చెప్పినారు. మున్షీగారిలోనేకాక తెలుగుదేశమునకు, తెలుగు ప్రభు

# సంస్కృత విశ్వపరిషత్సభలు

త్సవమునకు అతిథులుగా వచ్చిన రాష్ట్రేతరులైన మహామహు లందరిలోను ఆహ్వానసంఘమువారి ఆతిథ్యము విషయములో 'తృప్తాస్స్మః' యను భావమే వ్యక్తమైనది. నూతనముగా వెలసిన ఆంధ్రరాష్ట్రమునకు నిజముగా ఇది శుభోదర్కమైన విషయము.

## ఏకసంస్కృతికి వారసులు

ప్రతినిధులుగా వచ్చిన 1300 మందిలోను, ఆంధ్రులే అధికసంఖ్యాకులైనను, జమ్ము-కాశ్మీర్, అస్సామ్, బొంబాయి, పంజాబ్ మొదలైన సుదూర రాష్ట్రాలనుంచి కూడా చాలమంది ప్రతినిధులు వచ్చినారు. వివిధ రాష్ట్ర ప్రతినిధుల కందరకు ఒకేచోట బస ఏర్పాటు చేయక మద్రాసు ప్రతినిధుల కొక భవనములోను, కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాల ప్రతినిధుల కొక భవనములోను, రాయలసీమ ప్రతినిధుల కొక భవనములోను, ఔత్తరాహ ప్రతినిధులకు ఇంకొక భవనములోను, మహిళా ప్రతినిధుల కొక భవనములోను ఈ విధముగా మొత్తము ఆరు క్యాంపులుగా బసలు ఏర్పాటు చేసినారు. అందువల్ల వివిధ రాష్ట్రప్రతినిధుల మధ్య అన్యోన్య పరిచయాలకు, సౌహార్ద వినిమయానికీ విశేషావకాశము లేకపోయినది. కాని, భోజనాల వద్దను, సభా మండపములోను వివిధ రాష్ట్రాల ప్రతినిధులు కలసి మెలసి తిరుగుచు ఏకసంస్కృతికి వారసుల మను భావముతో ప్రవర్తించుట నేత్రోత్సవము కావించినది. సభా ప్రారంభమునకు ముందు సభా మండపములో ఎక్కడ చూచినను "కుత ఆగతా భవన్తః?", "భవతాం శుభనామ కిమ్?" "కీదృశీ స్థితిః సంస్కృత భాషాయాః భవతాం ప్రాన్తే?" ఇత్యాది పరామర్శలే వినిపించినవి. అక్కడక్కడ ఆంగ్లసంభాషణలు కూడా వినిపించినను, భిన్నభాషాభాషులైన ప్రతినిధులమధ్య సంభాషణలు అధిక భాగము సంస్కృతములోనే నడచినవి. సభా కార్యక్రమములేని సమయాలలో ప్రతినిధులు తమ బసలలో జట్లు జట్లుగా చేరి వివిధ ప్రముఖ సమస్యలను గూర్చి చర్చలు సాగించినారు. తమిళ, మళయాళ ప్రతినిధులు ప్రత్యేక సమావేశాలు జరుపుకొని సంస్కృత భాషా ప్రచారము విషయములో తాము ఎదుర్కొనవలసి యున్న సమస్యలను గూర్చి చర్చించినట్లు నేను విన్నాను. ఈ మూడురోజులు ప్రతినిధుల బసలలోను సభామండపమును నిర్మించిన విశ్వవిద్యాలయ భవనావరణములోను అపూర్వోత్సాహము వెల్లి విరిసినది. ఆహ్వానసంఘమువారు ఆంగ్లములోను, చిత్తూరు సంస్కృతప్రచారిణీ సభవారు తెలుగులోను ప్రచురించిన ప్రత్యేక సంచికలు, జాగృతి మొదలైన కొన్ని తెలుగు పత్రికల ప్రత్యేక సంచికలు, వివిధ సంస్కృత గ్రంథ ప్రచురణ సంస్థల ప్రకటన పత్రములు ప్రతినిధుల చేతులలో ఎక్కువగా కనిపించినవి.

## సభా కార్యక్రమ విశేషములు

మూడురోజుల సభలలోను తొలినాటి సాయంత్రము శ్రీ రాజేంద్రప్రసాద్ అధ్యక్షతను జరిగిన పరిషత్తు ప్రారంభ సమావేశమునకే ఎక్కువమంది జనులు వచ్చినారు. ప్రతినిధులకు, ప్రత్యేకాహ్వానితులకు, ఇతరులకు వేరువేరు అరలుగా సభామండపమును విభజించిన పద్ధతి, సభావేదికాలంకరణమూ అత్యంత ప్రశంసనీయములుగా నిర్వహింపబడినవి. వేదపఠనముతో శుభోదర్కముగా ఆరంభమై, అన్వర్థ నామధేయ అయిన చంద్రలేఖ నాట్యప్రదర్శనతోను, శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారి వాయులీన వాద్యముతోను ముగిసిన ఆ ప్రారంభసభాదృశ్యములు సులభముగా మరపునకు వచ్చునవి కావు. భారతదేశ మకుటస్థానీయుడైన రాష్ట్రపతి, నలుగురు రాజ్యపాలురు, ముగ్గురు ముఖ్యమంత్రులు, పలువురుమంత్రులు, పలువురు న్యాయమూర్తులు, ఎఱ్ఱని, పచ్చని శాలువలు ధరించిన పలువురు వేదపండితులు, అందరి వెనుక పైన శ్రీ వేంకటాచలస్వామి చిత్తరువు కలిగి సభావేదిక కలకలలాడినది. కొన్ని శతాబ్దాలుగా ప్రభుత్వాదరణ కోల్పోయి, వసివాడివున్న సంస్కృత భాషా వల్లరికి ఆలంబనభూతులై అందరు ఉన్నత ప్రభుత్వనేతలు ఆ వల్లరిని పునఃపుష్పితను, పునఃఫలితను జేయ బద్ధకంకణులైన ఆ సన్నివేశము సంస్కృత విద్వాంసులను, సంస్కృతి ప్రేమికులను హర్షాశ్రుపూరితలోచనులను చేసినది. ఆ రాజకీయ నేతల ప్రసంగాలలో స్వాతంత్ర్య సంగ్రామదినముల నాటి ఉత్సాహము, దీక్ష, ఆవేశము ధ్వనించినవి. "సంస్కృతము రానివాడు భారతీయుడు కాడు," "సంస్కృతభాషా నిక్షిప్తమై యున్న భారతీయ సంస్కృతి నిధిని, భారతీయ సంప్రదాయతంతులను అన్వేషించుకొననిచో భారతీయునకు విశ్వపరిషత్తులలో గౌరవప్రదమైన స్థానము లభింపజాలదు"—ఇట్టి ప్రక



సంస్కృతపరిషత్ మహాసభలలో పాల్గొన్న పలువురు రాజకీయవేత్తలు. (ఎడమనుంచి) ఆంధ్రప్రభుత్వ 'ప్లానింగ్' శాఖమంత్రి శ్రీ కళా వెంకటరావు, మైసూరు ముఖ్యమంత్రి శ్రీ కె. హనుమంతయ్య, హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు, ఆంధ్ర ఉపముఖ్యమంత్రి శ్రీ నీలంసంజీవరెడ్డి, మద్రాసుఆర్థికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యాం.

టనలు శ్రోతలను పులకితగాత్రులను చేసినవి. ఆనాడు రాజకీయ స్వాతంత్ర్యరథమునకు గాంధీ, నెహ్రూ, పటేల్ ప్రభృతులు చోదకులై నడిపినట్లు యీనాడు ఈ సాంస్కృతిక స్వాతంత్ర్యయాత్రకు రాజేంద్ర బాబు, మున్షీ ప్రభృతులు నేతృత్వమువహించి నడుపు చున్నట్లు తోచినది. నాటిసభలో ఆంగ్లము, హిందీ, తెలుగుభాషలలో చేయబడిన ప్రసంగాలకు పరిష త్సహాయ కార్యదర్శి శ్రీ టి. ఎల్. వేంకటేశ్వర దీక్షితర్ చేసిన సంస్కృతానువాదాలు కొన్ని స్థలా లలో మూలముకన్న మిన్నగా అనిపించి ఇతరభాషల కన్న సంస్కృతము ఎంత ఎక్కువ పటిష్ఠమైనదో స్పష్టము చేసినవి.

## సంస్కృత విశ్వపరిషత్తు ఆంధ్రశాఖ

తిరుపతి సంస్కృత కళాశాల భవనములో నాటి మధ్యాహ్నము జరిగిన తెలుగు ప్రతినిధుల సమావేశ ములో సంస్కృత విశ్వపరిషత్తుకు ఆంధ్రశాఖ స్థాపిత మైనది. ఆ సభకూడ అతి రసవంతముగ జరిగినది. "భగవంతుడు పాశ్చాత్యదేశాలకు తన దూతనుమాత్రమే పంపినాడు. భారతదేశములో తాను స్వయముగా పది పర్యాయములు అవతరించినాడు. అట్టి భారతదేశ సంస్కృతి, ఆ సంస్కృతి నిక్షిప్తమైయున్న సంస్కృతభాష ప్రపంచమునకే శిరోధార్యములు కావా?" అన్న శ్రీ అనంతశయనముగారి గర్జనలు, "ఎంతటి ప్రాతికూల్యమునైనా ఎదిర్చి సంస్కృత

# సంస్కృత విశ్వపరిషత్సభలు



ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు మహాసభకు దయచేసిన ప్రతినిధులకు స్వాగతం చెబుతున్న దృశ్యం

భాష ఇక వర్ధిల్లితీరును. సంస్కృతభాషా ప్రచారోద్యమమును ఇక ఎవ్వరును నిరోధింపజాలరు" అన్న శ్రీ చంద్రమౌళి పలుకులలోని దృఢ దీక్ష ఆంధ్ర సంస్కృత విద్వాంసుల ఆత్మ న్యూనతాభావమును దూరముచేయుటే కాక, వారిలో అచంచలమైన ఆత్మ విశ్వాసమును కూడ రేకెత్తించినవి.

## సంస్కృత ప్రసంగములు

రెండవనాడు పరిషత్తు కార్య నిర్వాహకవర్గము వారు, విషయ నిర్ణయ సంఘమువారు కలసి తయారు చేసిన తీర్మానాలను శ్రీ హరేకృష్ణ మెహతాబ్ సభలో ప్రతిపాదించినారు. శ్రీ అనంతశయనంగారు బలపగచిన తరువాత బొంబాయి ప్రతినిధి పండిత నిర్మలా దేవి, ఒకరిద్దరు మంత్రులూ ప్రసంగించిన వెంటనే శ్రీమున్షీ తీర్మానమును వోటుకుపెట్టి ఏకగ్రీవముగా ఆమోదితమైనట్లు ప్రకటించుట జరిగినది. అటుతరువాత దేశములోని వివిధప్రాంతాలనుంచి ప్రతినిధులుగావచ్చిన విద్వాంసులు తీర్మానాలమీద మాట్లాడుటకవకాశమిచ్చినారు. తీర్మానాలు ఆమోదితములైనట్లు ప్రకటించిన తరువాత చర్చజరిపిన పద్ధతి కొంత విచిత్రముగా కనిపించినను, ఇంచుమించు ఆ తీర్మానాలకు విప్రతిపన్నులు ప్రతినిధులలో ఎవ్వరును లేరుగనుక, దానిని వారు అంతగా పట్టించుకొనలేదు. కాని, కొందరు ప్రతినిధుల ప్రసంగాల ధోరణినిబట్టి-ఆ తీర్మానములు ఇంకా తీవ్రములుగా ఉండవలసి ఉన్నదనీ, చాలా ముఖ్య విషయాలపై కొన్ని అనధికార తీర్మానాలు కొందరు ప్రతిపాదించదలుచుకొన్నను, అట్టి అవకాశ మీయబడలేదనీ ప్రతినిధులలో కొందరు భావించినట్లు స్పష్టమైనది.

'మధురవాణి' సంస్కృత మాసపత్రికా సంపాదకుడు కర్నాటక ప్రతినిధి శ్రీ పంఢరినాథ్, ఒరిస్సా ప్రతినిధి శ్రీ అనంత త్రిపాఠీ ముఖ్యముగా ఈ విధముగా పరిషదధికార వర్గమును విమర్శించుచు ప్రసంగించినారు. "'భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజ శ్రీః' అని ఆశలు పెట్టుకొన్న సంస్కృత పండితులకు స్వాతంత్ర్య సంపాదనానంతరము కూడా ఎట్టి ఆదరణా లభించలేదు. ఈ పరిషత్తు స్థాపితమై అయిదేళ్ళయినను, ఇంతవరకూ సభలు, ఉపన్యాసాలు, రాజకీయ నాయకుల ఆర్భాటాలు తప్ప సాధించిన దేమున్నది? సంస్కృత భాషోద్ధరణ బాధ్యత రాష్ట్రాలదని కేంద్ర ప్రభుత్వమూ కేంద్రానిదని రాష్ట్ర ప్రభుత్వాలూ తప్పించుకొనుట జరుగుచూ వచ్చినదేకాని, విస్పష్ట ఫలితము నాకేమీ కనిపించుట లేదు" అని పరిషత్తును, ప్రస్తుత రాజకీయ నాయకులను తీవ్రముగా ఆయన విమర్శించారు. ఆయన ప్రకటించిన అభిప్రాయాలు ఎట్లున్నను, ఆయన వక్తృత్వధార, సంస్కృత భాషపై ఆయనకుగల అధికారము ఆయన విమర్శలకు గురి అయిన మున్షీ, గోపాలరెడ్డి ప్రభృతులనుగూడ ఆనంద పరవశులను జేసినవి. శ్రీ త్రిపాఠీ ప్రసంగము సంస్కృత భాష పార్లమెంటరీ కార్యనిర్వహణకు ఎంత పటిష్ఠమైన భాషో రుజువు చేసినది. కాలేజీలలోను, హైస్కూళ్ళలోను సంస్కృత పండితులను 'ఎం. ఎ' ప్యాసైన

లెక్చరర్లకంటె హీనముగా చూచుచున్న ప్రస్తుత విధానమును ఆయన నిశితముగాను, నిపుణముగాను విమర్శించెను. అప్పుడు అధ్యక్ష స్థానములో ఉన్న అనంతశయనంగారు ఆయన ధారను అడ్డగింప జూచి నప్పుడు ప్రతినిధులలో చాలమంది త్రిపాఠీని సమర్థించి ఆయనకు మరికొంత అవకాశ మియ్య వలె నని పట్టుబట్టినారు.



పరిషత్ అధ్యక్షులు శ్రీ కె. యం. మున్షీ గారు

రాజేంద్రప్రసాద్, అనంతశయనం గార్లను ముటతోనే తమ ప్రసంగాలు ముగించినారు.

## వ్యావహారిక సంస్కృతము

ద్వితీయ తృతీయ దినములలో మొత్తము పన్నెండుగంటలసేపు జరిగిన చర్చలో దేశములోని వివిధప్రాంతాలనుంచి వచ్చిన విద్వాంసులు సుమారు 40 మంది పాల్గొన్నారు. వీరిలో ఇంచుమించు సగము మంది తెలుగువారు. కాని, కాశ్మీర్, ఒరిస్సా, అస్సామ్, పంజాబ్, బొంబాయి, మధ్యప్రదేశ్ మొదలైన సర్వరాష్ట్రాల ప్రతినిధులూ కూడా ప్రసంగించినారు. బెంగాలువంటి యే వొకటి రెండు రాష్ట్రాల ప్రతినిధులో మాత్రమే చర్చలో పాల్గొన్నట్టులేదు. ప్రసంగించిన వారిలో తీర్మానాలను గూర్చి కాక, తమతమ ప్రాంతాలలో సంస్కృత భాషా ప్రచారోద్యమ పరిస్థితులు వివిధముగావున్నవో చెప్పినవారే ఎక్కువమంది. కొందరు కేవలము మున్షీ,



భారత దేశం వివిధప్రాంతాలనుంచీ సభలకు విచ్చేసిన ప్రతినిధులు

# సంస్కృత విశ్వపరిషత్సభలు

చర్చలో పాల్గొన్న 40 మంది విద్వాంసుల లోను తెలుగులో ప్రసంగించిన 5, 6 గురిని వదలి వేసినచో మిగిలినవారిలో ఒక డజనుమంది పండితులైనా సంస్కృతములో అత్యద్భుతమైన వక్తృత్వ నైపుణిని ప్రదర్శించినవారున్నారు. శ్రీ కాశీ కృష్ణాచార్య, శ్రీమాన్ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యస్వామి, పండరీనాథ్, వసంత గాడ్గిల్, పండిత నిర్మలాదేవి, ఎస్. టి. జి. వరదాచార్య, జమ్ములమడక మాధవరామశర్మ, అనంతత్రిపాఠీ, బెంగుళూరుప్రతినిధి శ్రీనివాసఅయ్యంగార్ మొదలైనవారు అట్టివారు. వీరందరూ నిర్దుష్టమైన భాష మాట్లాడుటే కాక అతి పటిష్ఠమైన అలంకారయుతమైన భాష అప్రయత్నసిద్ధముగా మాట్లాడినారు. వీరిలో మిగిలినవారి అందరి ప్రసంగములు ఒక ఎత్తు; పూనా యువకుడు వసంత గాడ్గిల్ ప్రసంగమొక్కటీ ఒక ఎత్తు. సంస్కృతభాష ఏదో ఉదాత్తమైన సాంస్కృతిక విషయాల వ్యక్తీకరణకు తప్ప, ఈనాటి జీవితమును, ఈనాటి రాజకీయ భావములను వ్యక్తముచేయుటకు పనికిరాదని భావించువారికి అది సమాధానము. అమిత వేగము, ప్రయత్న లేశముకూడ లేకపోవుట, అయినను నిర్దుష్టమైన భాషను మాట్లాడుట అతని ప్రసంగములోని విశిష్ట గుణములు. పూనాలో తిలక్ స్థాపించిన ప్రాద్య విద్యాపరిశోధకసంస్థ కార్యకలాపాలను గూర్చి, విదేశాలనుంచి సంస్కృతభాషలో పరిశోధనలు చేయుటకువచ్చి ప్రస్తుతము పూనాలోఉన్న కొందరు పాశ్చాత్య సంస్కృత విద్వాంసులనుగూర్చి అతను అతి సుగమముగాను, అతి రంజకముగాను ప్రసంగించినాడు. స్త్రీ ప్రతినిధులలో పండిత నిర్మలాదేవి ప్రసంగము శ్రీ కాశీ కృష్ణాచార్య, అణ్ణంగరాచార్యస్వామి మున్నగువారి ప్రశంసలందుకొన్నది. ఆమె ప్రసంగములో తర్కశాస్త్ర నైపుణ్యము వెల్లివిరిసినను, ఉచ్చారణాదికములోని కృతికత్వమువలన సభను ఎక్కువగా రంజింపచేయలేక పోయినది.

## తెలుగుల సంస్కృత ప్రతిభ

తెలుగు ప్రతినిధుల ప్రసంగాలలో శ్రీ కాశీ కృష్ణాచార్య, జమ్ములమడక మాధవరామశర్మగార్ల ప్రసంగాలు ప్రత్యేకముగా చెప్పదగినవి. కాశీ కృష్ణాచార్యులగారి కంఠమాధుర్యముతో కూడిన శ్లోక పఠనమూ, ఋషివంటి ఆయన స్వరూపమూ, సరళమైన ఆయన సంస్కృతభాషా ప్రౌఢిమ ప్రతినిధులను ముగ్ధులను చేసినవి. మాధవరామశర్మగారు 'సంస్కృతభాషైషా న జటిలా నచ కుటిలా,' 'రస్కిన్, పుష్కిన్ ఇత్యాదయో యే పాశ్చాత్య వేత్తారో విద్యంతే' ఇట్టి శబ్దాలంకారమయమైన భాషతోను, వాచికాంగికాద్యభినయ నైపుణితోను సభ్యులను పరవశులను చేసినారు.

తెలుగువారి సంస్కృతోచ్చారణ ఇతర ప్రాంతీయులను విశేషముగా ఆకర్షించినది. వేదపండితులు బ్రహ్మశ్రీ సుబ్బావధానిగారు ప్రవరాఖ్యునివలె అలేఖ్యతనూవిలాసుడై ఆకృతి దాల్చిన వేదమువలె శబ్దవిస్తరణ యంత్రముముందు ఆసీనుడై ఒకే మంత్రమునకు అనులోమ, విలోమాది వివిధ విన్యాసాలలో చేసినగానము శ్రోతలను వివశులను చేసినది. ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసములో శ్రీ చంద్రమౌళి—

"Even to day, if one traverses the length and breadth of Bharath it is mostly Andhras, Particularly the Kona Seema Pandits of Gouthami Theera, that could recite the sacred Vedas not only most melodiously and sweetly, but also in its proper Ghana, Jata, Krama and Pada forms."

(ఈ నాటికి—భారత దేశము మొత్తముమీద ఆంధ్రులే,—అందును ముఖ్యముగా గౌతమీ తీర వాసులగు కోనసీమ పండితులే—వేదమును అత్యంత మధురముగా 'ఘన', 'జట', 'క్రమ', 'పద' సక్రమ విన్యాసముతో గానము చేయగలవారు).

అనువాక్యము చదివినప్పుడు సభ నలుమూలల నుండి హర్షామోద ధ్వనులు వెల్లి విరిసినవి.

## కృతము—కర్తవ్యము

కడచిన నాలుగేళ్ళలో ఈ పరిషత్తు సాధించిన విస్పష్టఫలితము లేమి అని ప్రశ్నించువారున్నారు. శతాబ్దాలపాటు రాజాదరణ కోల్పోయి, మృత భాషఅని, జటిలమైనభాషఅనీ దుష్ప్రచారములపాలైన సంస్కృతమును ఒక్కమారుగ పునరుజ్జీవిత మొనర్చుట సాధ్యముకాని పనిగదా! కాని, ఈ అల్పకాల వ్యవధి

ధిలో ప్రభుత్వాలకు, ప్రజలకు సంస్కృతభాషా ప్రాముఖ్యమును గూర్చి నచ్చజెప్పుటలో పరిషత్తు అనల్ప విజయమే సాధించినదని చెప్పవలెను. ముఖ్యముగా వార్షికసభలు జరిగిన ప్రాంతాలలోని ప్రజలలో రాజేంద్రబాబువంటి ప్రముఖుల ప్రబోధాలతో సంస్కృతాధ్యయనముపట్ల అపూర్వోత్సాహము రేకెత్తినది. కాశీసభల సందర్భములో యు. పి. ప్రభుత్వము, మరికొందరు దాతలు పరిషత్తు ప్రచారకోపన్యాసకులను పోషించుటకుగాను విరాళాలు ప్రకటించినారు. నాగపూరుసభల సందర్భములో మధ్యప్రదేశ్‌లోని ఒక పలుకుబడిగల మహంతు ఒక మహా సంస్కృత విద్యాలయము స్థాపించునిమిత్తమై ఒక పెద్దమొత్తమును విరాళముగా ప్రకటించెను. అట్లే ఆంధ్ర ప్రభుత్వముకూడ సంస్కృత పరీక్షలు ప్యాసైన తెలుగు పండితులకు మూడు ఇంక్రిమెంట్లు ఇచ్చుటే కాక, సంస్కృతమును అవశ్యపాఠ్యముగ చేయుటకు, సంస్కృతములో ఆనర్సు తరగతులను ప్రారంభించుటకు కూడ పూనుకొనుచున్నది. పరిషత్తుకృషికి ఫలితముగానే పంజాబు ప్రభుత్వము కురుక్షేత్రమువద్ద ఒక సంస్కృత విశ్వవిద్యాలయము స్థాపింపనున్నది. యు. పి. ప్రభుత్వము కాశీలో ఒక సంస్కృత విశ్వవిద్యాలయమును స్థాపించుటకు ఏర్పాట్లుకూడ చాల వరకు పూర్తి చేసినది.

అయినను సంస్కృత ప్రియులు చాలమందిలో ఒక తీవ్రమైన అసంతృప్తి ఉన్నది. హిందీ రాష్ట్రభాషగా ఉండగా సంస్కృతముపై గౌరవము కలిగించి దానిని భారతదేశ సాంస్కృతిక భాషగా చేయగలుగుట అసంభవమని వారివిశ్వాసము. రాజ్యాంగములో హిందీని రాష్ట్రభాషగా పేర్కొన్నది మొదలు హిందీ వ్యాప్తి ఉద్యమమునకు అభిముఖ్యముకన్న ప్రాతికూల్యమే ఎక్కువగా ఎదురగుచున్నది. అందుచేత సంస్కృతమే భారత రాష్ట్రభాషగా ఉండవలెనను వాదమును పునరుద్ధరించుటకు ఇది తగిన తరుణమని వారి ఆశయము. సంస్కృత విశ్వపరిషత్తు ఈ విషయమై ఇంకను ఒక నిర్ణయమునకు వచ్చినట్లు లేదు. మొన్నటి వార్షికసభలో రాష్ట్రభాషాసంఘము జారీచేసిన ప్రశ్నావళికి సమాధాన మిచ్చుటకు ఒక ఉపసంఘము నియమింపబడినది. బహుశః—ఆ ఉపసంఘము రాష్ట్రభాష విషయమై విశ్వపరిషత్తు వైఖరిని స్పష్టముచేయగలదు. ఒక భాషను ఎవరుగాని బలవంతముగా రాష్ట్రభాషగా చేయగలుగుదుమనుకొనుట భ్రమ. స్వశక్తివల్లనే దేశములోని సర్వభాషా భాషుల సౌహార్దము విలుచుకొని ఒక భాష రాష్ట్రభాషా సింహపీఠి నధిరోహించగలదు. హిందీభాషకు అట్టి శక్తిలేదని ఋజువగుచో, సంస్కృతభాష ఆ పదవి నధిరోహించుట ఎట్లును తప్పదు.

పరిషత్కార్యవర్గములో సన్నిహిత సంబంధము గల ఒక ఔత్తరాహ ప్రతినిధి నాతో "పరిషత్తు మార్గ మింకను సుగమము కాలేదు. పాశ్చాత్య నాగరికతా వ్యామోహితులు పలువుర కింకను పరిషత్కార్యకలాపములన్నను, సంస్కృత భాషోద్ధరణమన్నను భయాందోళన లున్నవి. "నెహ్రూ, ఆజాద్, మున్నగు అగ్రనాయకులకే పరిషత్తుపట్ల పూర్తి ఆదరము లేదు" అనెను. దానికి నేను "పరిషత్కార్యకర్తలందరూ కాంగ్రెసు వారేగదా, హిందూమహాసభ మొదలైన మతసంస్థలు లేవదీసిన ఉద్యమము కాదుగదా ఇది!" అని బదులు చెప్పినాను. మరొక విషయమును కూడ, నేనాయనదృష్టికి తెచ్చినాను; "పరిషత్తు ఇంకను తన కౌగిలిలోని కాకర్షించుకోవలసియున్నది పాశ్చాత్య నాగరికతా వ్యామోహితులను మాత్రమే కాదు; అగ్రశ్రేణికి చెందిన సంస్కృత విద్వాంసులకు కూడ పరిషత్తుపట్ల సంశయము లున్నట్లు కనబడుచున్నది వారెక్కువగా ఈ సభలకు రాలేదు—చూచితిరా?" ఆయన సాలోచనముగ తలయూచి "ఔను. ఆ బాధ్యతకూడ పరిషత్తుమీద ఉన్నది" అనెను. వార్షికసభలలో విద్వద్గోష్ఠులు గాని, శాస్త్రీయ చర్చలు గాని లేక, కేవలము ప్రచారోపన్యాసములే సాగుట ప్రతినిధులుగావచ్చిన కొందరు పండితులకు విసుగనిపించినది. రెండవనాడు సాయంత్రము 'వాక్యార్థము' జరుగునని కార్యక్రమములో ప్రకటించి కూడ ఆ అంశము నెందుకో జారవిడిచినారు. గత వార్షికసభలలో అట్టి వాక్యార్థములు జరిగినవట!

మొత్తముమీద సంస్కృత విశ్వపరిషత్తు చతుర్థ వార్షికోత్సవసభలు తిరుపతిలో అత్యంత వైభవోపేతముగా జరిగినవి. ఆ మూడు రోజులూ తిరుపతి పరిసరాలలో బ్రహ్మోత్సవమును మించిన సందడి, సంరంభము, ఉత్సవకళ తాండవించినవి. ఉత్సవ దిదృక్షువులైవచ్చిన వేలాది జనములో ఎవరిముఖములో చూచినను భారతీయ సంస్కృతి పునరుద్ధరణకు అంకురార్పణ జరిగినదన్న సంతృప్తి, కొన్ని వందల ఏళ్లు పరదాస్యములో మ్రగ్గిన భారతజాతి తిరిగి ఈనాటికి స్వస్వరూపము గుర్తెరుగుటకు చేయుచున్న

సఫలమై తీరుననే ఆశాభావము ప్రకాశించినవి

# కపిలవస్తు

హారీత శివశర్మ

## పాత్రలు

| | | |
|---|---|---|
| శుద్ధోదనుడు | చెన్నుడు | గౌతమి |
| బుద్ధుడు | దేవదత్తుడు | యశోధర |
| రాహులుడు | సారిపుత్రుడు | సుందరి |

కొంతమంది భిక్షువులు

౧

[భిక్షువులు]

బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి!—
దిక్కుల నాలుగు చెరగుల ధర్మం
నిండెను నిండెను కాంతులతో
కాంతులతో రవి కాంతులతో విధు
కాంతులతో స్నిగ్ధ కాంతులతో
అంతము చెందిన దుఃఖముతో
పంతము డిందిన రంతులతో
శాంతి వహించెను, దాంతి వ
లంచెను, భ్రాంతి నడంచెను లోకమహా!-
బుద్ధం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!

ఒక భిక్షువు

మారుడు చిమ్మిన చీకటులో
ఆరడి తెచ్చిన కాటుకలో
నేరమి నెరుగని ప్రాణులలో
గారియపెట్టెను దుఃఖముతో
అంతా దుఃఖం, అంతా దుఃఖం,
అంతా దుఃఖం, అంతా దుఃఖం
మారుడు పన్నిన ఉచ్చులలో.

(అంతా)

బుద్ధం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!

రెండో

వుంది వుంది అవిద్య బృహత్తు
జసిర జసిర సంసార మసత్తు
వుంది వుంది విజ్ఞాన మహత్తు
కనర కనర బహురూప జగత్తు

అంతా శర్మం, అంతా దుఃఖం
మారుడు పన్నిన ఉచ్చులలో—
(అంతా)
బుద్ధం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!

మూడో భిక్షువు

నామమూలమై షష్టాయతనం
ఆయతనంతో రసగంధమ్ములు, స్పర్శలు
స్పర్శలతో వేదన, వేదనతో తృష్ణ
అందులోంచి ఉపాదానం
అందులోంచి భవం, ఇహసంసారం
అంతా దుఃఖం, అంతా దుఃఖం.
(అంతా)
బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి!

నాల్గో భిక్షువు

భవకారణముగ జన్మకల్గునో
జన్మకారణమొ భవసంగతికిని
జరయో, మృత్యువో, శోకమోహములో
చిత్తవికారమొ చిత్తఖేదమో
అంతా దుఃఖం, అంతా దుఃఖం.
(అంతా)
బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!
ధర్మం శరణం గచ్ఛామి!

ఐదో భిక్షువు

విరాగం వహిస్తే ఆతిథ్యము నశిస్తే
సంస్కారం విజ్ఞానం
ఆస్కారం లేకుండా
నశిస్తయ్! నశిస్తయ్!
నశిస్తుంది నామం
నశిస్తుంది రూపం
నామంతో రూపంతో
నశించిన ఆ యావనం
మసిచేసిన స్పర్శలతో
వేదనలకు తృష్ణలకును
ఆదరువులు వేదుర్లై
నశిస్తయ్! నశిస్తయ్!

ఆరో భిక్షువు

నశిస్తే ఉపాదానం భవపాశం తెగుతుందో
భవపాశం తెగిపోతే జాతి బాధ విడుతుందో

ఏడో భిక్షువు

విడిపోతే విడిపోతే విడిపోతే ఇట్టి జరా
విడిపోతే విడిపోతే విడిపోతే ఇక మరణం
విడిపోతే విడిపోతే విడిపోతే మనః ఖేదం
విడిపోతే విడిపోతే సర్వమైన ఈ దుఃఖం
(అంతా)
నిర్వాణం నిర్వాణం అష్టాంగిక మార్గంలో,
నిర్వాణం నిర్వాణం ఆర్యసత్య మార్గంలో,
నిర్వాణం నిర్వాణం ఆర్య బౌద్ధ ధర్మంలో
బుద్ధం శరణం గచ్ఛామి!
సంఘం శరణం గచ్ఛామి!
ం శరణం గచ్ఛామి!

౨

[శుద్ధోదనుడు— చెన్నుడు]

శుద్ధోద: చెన్నా! చెన్నా! ఏమిరా ఆ కలకలం
చెన్ను: భగవంతుడు వేంచేశారండి
శుద్ధోద: సిద్ధార్థుడు కపిలవస్తు వచ్చాడా చెన్నా! నాయన ఎట్లావున్నాడురా?

చెన్న (మాట్లాడడు)

శుద్ధో మాట్లాడవేమిరా! చెన్నా!

చెన్న ఏమి మాట్లాడాలి! ప్రభు!

శుద్ధో సిద్ధార్థుడు కపిలవస్తు వచ్చాడా, అన్నాను.

చెన్న సిద్ధార్థుడు కాదండిస్వామీ! వచ్చింది.

శుద్ధో సరే తథాగతుడు, శాక్యపుత్రీయశ్రమణకుడు, వచ్చాడు! సరా!

చెన్న : తథాగతుడు లోకసంగ్రహంకోసం మహాధర్మాన్ని సాక్షాత్కరింపజేసుకొని దాన్ని బోధిస్తూ వుంటే మీరు ఆనందించరేమి? ప్రభూ!

శుద్ధో : ఆనందం! చెన్నడా! అంతా ఆనందంగానే వుంది. నందుని సంగతి చూచావుగా!

చెన్న : చూచాను, కాని,

శుద్ధో : కాని ఏమిటి? ఈయన వచ్చి ఏమి దుఃఖాన్ని పోగొడుతున్నాడు! తాను ఇంట్లోనుంచి వెళ్ళి నన్ను దుఃఖపెట్టాడు. శాక్యరాజపుత్రులను బలవంతంగా ఈ ధర్మంలోకి ఈడుస్తూ గౌతమ గోత్రజులయిన వృద్ధులనందరిని దుఃఖపెడుతున్నాడు. నందునికి ఇచ్చిన ధర్మదీక్ష సాక్షాత్తూ రాక్షసంగా పోతును పెంటిని విడదీసినట్లువుతుంది. ఏమి దుఃఖనిస్తారకమైన ధర్మాన్ని తెచ్చాడయ్యా ఈయన!

చెన్న : మీకు మనస్సును ఖేదపెట్టుకొని తథాగతుని ధర్మాన్ని దుర్వ్యాఖ్యానాల పాలు చేస్తున్నారు, ప్రభూ!

శుద్ధో అవును. మంగలి ఉపాలికి అర్థమయ్యే ధర్మం నా కెట్లా అర్థమవుతుంది.

చెన్న : ప్రభూ మీ వేదన నేను చూడలేకుండా, వినలేకుండా వున్నాను.

శుద్ధో : రేపు రాహులుణ్ణి గూడా తల గొరిగించి కూర్చోపెట్టినప్పుడు చూద్దువుగాని; వింటువుగాని—

[వాకిట్లో భవతి భిక్షాం దేహి అని కేక]

విన్నావా ఆ కంఠం చెన్నా! అది నా సిద్ధార్థుడికంఠం. నాయనా సిద్ధార్థా! రావయ్యా! ల వంగడంలో వెలలేని దీపానివి నువ్వు. శుద్ధోదనుని హృదయంలో చీకటులను త్రోలిపోదువుగాని; చెన్నడా! ఆసనం వెయ్యి! వధువు యశోధరను తీసుకురా! రాహులుడు ఎక్కడ! చెన్నడా నువ్వు ఇంకా కదల్లేదు. మధ్యాహ్నం మండుతున్న సూర్యుని వేడి కిరణాలు మాడ్చిన నేల కాళలకు నాయన పాదాలు పొక్కుతాయి. ఎవడురా! అక్కడ! సిద్ధార్థుణ్ణి లోపలికి రమ్మను, నువ్వు రమ్మనడం ఏమిటి? నే నేపోయి తీసుకువస్తాను; చెన్నా చెన్నడు వెళ్ళాడు. వధువు యశోధరను తీసుకువస్తాడు. ఏమి విచిత్రమైన కుటుంబం నాది; మాయా! మాయా! నీవు నోచుకో లేదు ఈ భాగధేయాన్ని పంచుకోడానికి – ఎవరు వస్తున్నది!

[గౌతమి ప్రవేశించి]

గౌత : ప్రభూ! నేను. నేను గౌతమిని.

శుద్ధో : ఆ! సమయానికివచ్చావు. నందుడి విషయం ఇంకా మనసు పచ్చి ఆరలేదేమో నని కబురు పంపలేదు. చూచావా సిద్ధార్థుడు భిక్షార్థియై తండ్రి యింటికి వచ్చాడు. నీకు తెలియదా! నేను పిచ్చివాడిని. ఇది మొదటిసారి కాదుగదా! ·

[ తెరలో భవతి భిక్షాం దేహి]

గౌత : స్వామి! ఆలస్యం అవుతున్నది. తథాగతుడు మూడు పిలుపులు పిలిచి ఇక ఆగడు. స్వామీ! వెళ్ళండి. వెళ్ళి ప్రత్యుద్ధానంచేసి భగవంతుణ్ణి తీసుకురండి. ఆతిథ్యం ఇద్దాం.

శుద్ధో : ఓసి! ఓసి! గౌతమి! నీవు మాయకన్నా గడుసుదానివి. నీ కడుపునపుట్టిన నందుని సంగతి పట్టదు నీకు; పెంచిన సిద్ధార్థుని యందు మమకారం వదులుకోలేకుండా వున్నావు.

గౌత : స్వామీ! ఆలస్యం అవుతున్నది.

శుద్ధో : గౌతమీ! గౌతమీ! నా దుఃఖం అర్థంకాదు నీకు. నేను మహారాజునుగదా! ఈ సిద్ధార్థుడు నా కొడుకుగదా! తనకు ఈ చిన్న వయస్సులో ఈ పరివ్రాజనం ఏమిటి? ఈ భిక్షం

ఎత్తుకోవడం ఏమిటి? గౌతమి! గౌతమీ!! ఇది నాకు తల కొట్టినట్లుగా వుంది!

గౌత : స్వామీ! మీరు ఇంకా సంగభావం వదులుకోలేక ఇట్లా అంటున్నారు. తథాగతుడు మహాధర్మాన్ని దర్శించాడు. ఆర్యసత్యాలను సాక్షాత్కరింప జేసుకున్నాడు. దుఃఖాన్ని నిస్తరిస్తున్నాడు. అర్థం చేసుకోండి, అంతా అవగతమౌతుంది.

శుద్ధో బలవంతంగా నందుణ్ణి ముండిని చేసినప్పుడే గ్రహించా ఈ ధర్మం సంగతంతా. తక్కిన శాక్యకుమారులకూ ఇప్పించడాదీక్ష! అప్పుడు మరీ గ్రహిస్తా! గౌతమి! ఇక మాట్లాడకు! చూడు! చెబుతున్నాను. ఈ శాక్య రాజ్య నాశనానికివచ్చింది ఇదింతా. నా కొడుకు సర్వంసహాచక్రవర్తి కావాలనుకున్నా. అది జరగలేదు. సరే ఎవరో ఒకరు ఈ రాజ్యాన్ని నిల్పే వాళ్లు వుండక పోతారా అనుకున్నా. ఆ ఆశకూడా ఇప్పుడు అంతరించిపోతోంది. గౌతమీ! గౌతమీ! నేను ఒక్క రోజున ఎప్పుడో కళ్లు మూసి వేస్తాను. ఆ అనంతరం ఈ శాక్య రాజ్యంకూడా అంతరించిపోతుంది. అంతా నాకళ్లకు కనిపిస్తూనేవుంది. సరే! ఎందుకులే ఇప్పుడు ఇదంతా. అంతా నువ్వేచూస్తావు. అదుగో ఆ ఆసనం సర్దు. ఆ బంగారపుపళ్లెం తెప్పించు. తథాగతుడికి పిండపాతం నిమిత్తం అన్ని సంభారాలు సిద్ధంచేయించు. నేను పోయి తీసుకువస్తాను ఆయన్ను.

[ తెరలో భవతి భిక్షాం దేహి ]

గౌత : స్వామి! అదిగో తథాగతుడు మూడవసారి కూడా కేక వేశాడు. ఏమి! ఇది ఇట్లా చేశారు. ఇది ఇక్ష్వాకుల మర్యాదయా! స్వామి! ఏమయింది!

శుద్ధో : గౌతమి! నువ్వు వట్టి గోలవిలా గావున్నావు. చూస్తూవుండు భగీరథుడు గంగను తెచ్చినట్లు తీసుకువస్తాను గౌతముణ్ణి.

(నిష్క్రమణ).

[రాజవీధి. ముందు బుద్ధుడు: వెనుక శుద్ధోదనుడు; వీధికి ఇటూ అటూ అంతా జనం]

శుద్ధో తథాగతుడా! క్షమించు! ఆలస్యం అయింది. పిలుపు విన్పించక కాదు. విన్పించింది. నేను ముసలివాణ్ణి. దుఃఖంలో వున్నవాణ్ణి. ఈమధ్య నేకదా యావరాజ్య పదవీస్థితుడు కాబోతున్న నందుడికి ఉపసంపద ఇప్పించావు. అదే ఆలోచనలోవుండి మనస్సును జాగరితం చెయ్యలేకపోయాను. ముసలివాణ్ణి, దయదాల్చు; కరుణించు; ఏం! నా యిచ్చే పిండపాతం స్వీకరించు.

బుద్ధు : (మౌనంగా నడుస్తూవుంటాడు)

శుద్ధో : తథాగతుడా! అట్లా పోతావేమయ్యా! ఏనాం పూర్వాశ్రమంలో తండ్రిని గదా అని అయినా నన్ను మన్నించవచ్చునే! వృద్ధుణ్ణి కదా అని కరుణించవచ్చునే! ఆగు! భగవన్! ఆగు ఇంకా అపరాహ్ణం కాలేదు! ఇంకా భిక్షుకు కాలం అతీతం కాలేదు. నా ఆతిథ్యం స్వీకరించకుండా పోదామనా! నన్ను నల్గురిలోను అవమానం చేద్దామనా! బుద్ధుడా! భగవంతుడా! తథాగతుడా! నన్ను కరుణించవయ్యా! ఏదీ ఆ పాత్ర ఇటు తే! ఆ చీవారం ఇట్లా ఇయ్యి. ఇటు తిరుగు. ఇంటివద్ద గౌతమి సర్వసంభారాలతో వేచివుంటుంది నీకోసం, అది నిన్ను పెంచింది. దాన్ని కష్టపెట్టకు. ఒకళ్ళని కష్టపెట్టడం నీ ధర్మమా! దుఃఖనిస్తారకమైన నీ ధర్మంలో పెంచిన తల్లిని, కన్న తండ్రిని వేపుకు తినమని వున్నదా? విను! స్వామీ! నా మాట విను! ముసలిని కరుణించు. (బుద్ధుని చేతిలో పాత్ర తీసుకుంటాడు. బుద్ధుడు మౌనంగా రాజువెంట నడుస్తూ వుంటాడు.)

శుద్ధో : భంతే!

బుద్ధు : గౌతమా!

శుద్ధో : నందుడు కుశలమా?

బుద్ధు : (మౌనం)

: నందునికి క్షేమమా?

బుద్ధు : (మౌనం).

శుద్ధో : నందుడు ఎక్కడ వున్నాడు!

బుద్ధు : శ్రావస్తిలో.

శుద్ధో : అనాథపిండకుని ఆ రామంలో నేనా.

బుద్ధు : అవును.

శుద్ధో : సుందరి వేదనను మేము చూడలేకుండా వున్నాము.

బుద్ధు : అనిత్యమైన కామావాసురలలో విశ్వాసం పెట్టుకొని భగిని పూరికే పరిదేవిస్తున్నది.

శుద్ధో : భంతే:

బుద్ధు : గౌతమ్!

శుద్ధో : శాక్య రాజ్యం ఏమవుతుందంటావు!

బుద్ధు : గౌతమ్! రాజ్యం అనిత్యమైంది. ధర్మం శాశ్వతమైంది. నిర్వాణం పరమైంది. బుద్ధుడు సర్వాతీతుడు.

శుద్ధో : అంతేనంటావా!

బుద్ధు : (మౌనం).

శుద్ధో : భంతే! అయితే శాక్యుల కందరికి ఉపసంపద ఇచ్చి సర్వశాక్య నిర్వాణానికి ప్రోది చెయ్యరాదా!

బుద్ధు : (మౌనం).

శుద్ధో : దేశంలో మాగధులు, కోసలులు, వైశాలులు, లిచ్ఛవులు, వజ్జీలు, కోలీయులు, ఎంతో మంది రాజులు వున్నారు. అందరు చక్రవర్తి పథంకోసం సాధనలు చేస్తున్నారు. నీ ధర్మాన్ని మన్నిస్తున్నారు. కాదనను. నేనూ గౌరవిస్తాను. ధర్మాన్ని ఎవ్వరు గౌరవించరు! ఇన్ని రాజ్యాలను నీవు అరాజకం చెయ్యడంలేదు. శాక్యాన్ని చేస్తున్నావు, నా తర్వాత ఈ శాక్యం ఏమవుతుంది?

బుద్ధు (మౌనం).

శుద్ధో : వృద్ధాప్యంలో కూడా రాజ్యాన్ని గూర్చిన చింత వదల్లేదేమని ఈ ముసలివాడి మీద కినుస్తున్నావల్లేవుంది. అదికాదు. ఒక్క విషయం వుంది. ఏ ధర్మం నిరాలంబంగా వుండదు. ఎవడో ఒక రాజు దాన్ని పోషించాలి. ఏదో ఒక ప్రజ దాన్ని అవలంబించాలి. దండంలేక రాజ్యంలేదు. రాజ్యంలేక ప్రజలేరు, రాజులేక రాజ్యం వుండదు. ఈ శాక్యాన్ని, ఇక్ష్వాకు రాజ్య పీఠాన్ని, నువ్వు, ఎందుకు వుండిపోయిందా అని లేకుండా చేస్తున్నావు. శాక్యులను భిక్షువులను చేస్తున్నావు. ఈ విషయం కొంచెం ఆలోచించవలసిందని అభ్యర్థిస్తున్నాను. దూరం ఆలోచించవలసిందని కోరుతున్నాను.

బుద్ధు (మౌనం)

శుద్ధో సరే! సరే! అయ్యేది ఎట్లాగూ కాకమానదు. సరే! సరే! నేను బ్రతికివుండేనుగదా అంతదాకా.

* రాజమందిరం; అతిథిగృహం. పిండపాతానికి అంతా సిద్ధంగా వుంటుంది. గౌతమి ఒకవంక, యశోధర ఒకవంక నుంచుని వుంటారు. యశోధర కాషాయ వస్త్రాలు ధరించింది. గౌతమి కూడా అంతే. శుద్ధోదనుడు, బుద్ధుడు మందిరంలో ప్రవేశించగానే గౌతమి గబగబా ముందుకు వెడుతుంది. వెళ్ళి ఆగుతుంది. వెనక్కి తిరుగుతుంది. యశోధర అవనత దృక్కులతో బుద్ధుడి పాదాలవంక చూస్తూవుంటుంది. బుద్ధుడికి శుద్ధోదనుడు ఆసనం చూపిస్తాడు.

శుద్ధో భగవన్! ఇట్లా ఈ ఆసనం స్వీకరించు. చెన్నా! చెన్ను ఏడీ? రాహులుడేడీ?

యశో : రాహులుడు నందుడుగారి యింటికి పోయినాడని చెన్నుణ్ణి అక్కడికి పంపించాను.

శుద్ధో వాడుకూడా రానీయండి అప్పు[illegible] కొనిద్దాం.

[రాహులుడు చెన్నుడు ప్ర

రాహు వచ్చా! తాతయ్యా!

శుద్ధో : వచ్చావూ! రా! ఇల్లా నా ప్రక్కనుంచో. గౌతమీ! ఏది పాద్యం! రాహులా! ఆ నీళ్లు ఇట్లా పొయ్యి—తథాగతుడా! ఆ పాదాలు ఇట్లా పెట్టు, ఇదిగో ఈ బంగారుపళ్లెంలో.

నేను మాయను పెండ్లి యాడినప్పుడు సిద్ధార్థుని తాతగారు ఇచ్చింది గౌతమి! నువ్వు అప్పుడు ఎంత దానివి. నీ అక్క అచ్చు నీకు మల్లేనే వుండేది. సిద్ధార్థుడు అంతే! అమ్మా! యశోధరా చూస్తావేం! వడ్డించు. ఏదీ ఆ పాయసం. అది మా సిద్ధార్థుడికి చాలా ఇష్టం. తథాగతుడా! నీ యీ ధర్మం కాదుగాని శాక్యరాజ్యం అరక్షితమై పోతోంది. శాక్యులు భిక్షకులై పోతున్నారు.

బుద్ధు : గౌతమ్! భిక్షువులు ఎప్పుడూ కుశలులే. వారు నిర్ద్వంద్వులు.

: అవును! అవును! లేత వయస్సులో సుఖాల మత్తు వదలకముందు అంతా నిర్ద్వంద్వులు కావడం ఈ ధర్మంలో నేటికి చూస్తున్నాం.

రాహు : అవును తాతగారూ! శాక్యశ్రమణుని ఛాయ సోకినంత మాత్రంచేతనే ఏదో సుఖాన్ని అనుభవిస్తున్నట్లు వుంది.

శుద్ధో : ఇన్నాళ్ళకు తండ్రిని చూసిన ఆనందం అట్లాగే అవభాసిస్తుంది నాయనా! యశోధర! ఏమంటావు?

: తాత: నేను అనేది ఏమి వుంది? ఆర్యపుత్ర!

శుద్ధో : ఆర్యపుత్ర! విస్మరిస్తున్నావు తల్లీ! ఇక్కడ కూర్చున్నది సిద్ధార్థుడు కాదు. తథాగతుడు. ఆయన్ను అట్లా సంబోధించు.

: తథాగత! మీతో సుందరి విషయం ప్రస్తావిద్దామనుకుంటున్నాను.

బుద్ధు : భగినీ! ఇది ధర్మం. రాజకీయం కాదు. ఇందులో ప్రస్తావనకు తావెక్కడ?

యశో : సుందరి హృదయం దుఃఖంతో మహా అరడి పడిపోతున్నది.

శుద్ధో : నీ సాహచర్యం లభించీ కూడా తగ్గడంలేదా!

బుద్ధు : గౌతమ్! ఈ ప్రపంచమే దుఃఖమయం. దుఃఖం ఒక ఆర్యసత్యం. దుఃఖ సముదయం ఇంకో ఆర్యసత్యం. దుఃఖ నిరోధం ఒక ఆర్యసత్యం. దుఃఖ నిరోధగామినీ ప్రతిపదం ఇంకో ఆర్యసత్యం. ఈ నాల్గు సత్యాలు తప్ప మరో సత్యంలేదు. ఈ మహా సత్యార్థాన్ని గ్రహించినప్పుడే జ్ఞానం సాక్షాత్కరిస్తుంది. ఆ జ్ఞానదర్శనం అయ్యేదాకా మనుష్యులు దుఃఖంలోనే బాధలు పడుతూ వుంటారు.

శుద్ధో అయితే యశోధరకు, సుందరికీ, కూడా ఈ ధర్మాన్ని ఇప్పించి, వారి దుఃఖాన్ని నిస్తరించరాదు? విప్రయోగం చేత వీరంతా మహా తపించిపోతున్నారు!

బుద్ధు (మౌనం).

శుద్ధో ఏమి! శ్రమణుడా! మౌనం వహించావు? ఆడవాళ్లు ధర్మంలో చేరి, భిక్షుణిలు కారాదా యేమి?

బుద్ధు ఉపాసికలుగా వుండవచ్చు.

శుద్ధో గౌతమి మనస్సు అట్లా లేదు.

బుద్ధు ఆమెకు ధర్మం సరిగ్గా అవగతం కాలేదు.

శుద్ధో అవును; ఆమె ఎరిగిన ధర్మం, నేను ఎరిగిన ధర్మం సర్వశాక్యకులం ఎరిగిన ధర్మం ఒకటి వుంది. అది ఇక్ష్వాకుల ధర్మం. ఇక్ష్వాకులు శైశవంలో విద్య నేరుస్తారు. యౌవనంలో విషయసుఖాలనుభవిస్తారు. వార్ధక్యంలో మునివృత్తిని వహిస్తారు. అంతంలో యోగాన్నవలంబించి తనువులు త్యజిస్తారు. నీ ధర్మం ఈ ధర్మానికి విరోధంగా వుంది. పూర్వం విశ్వామిత్రుడు త్రిశంకుణ్ణి శీర్షాసన నిత్యయోగిగా ఆకాశంలో నిలిపివేశాట్ట. ఇప్పుడు నువ్వు ధర్మంచేతనే శీర్షాసనం వేయిస్తున్నావు. నీ ధర్మంలో ఆదిలో సన్యాసం; అంతంలో ఏమౌతుందో! సరే! సరే! లే! తాత! రాహుళ! చేతులు కడుక్కోనేందుకు నీళ్లు తీసుకురా!

[బుద్ధుడు, శుద్ధోదనుడు, రాహులుడు నిష్క్రమణ; తిరిగి అంతిలో ప్రవేశం]

శుద్ధో చిన్నా! ఆ కావిశాటులు ఇట్లా తీసుకురా! తథాగతుడా! అట్లా ఆసనంమీద కూర్చో! ఇదిగో! ఇది పుచ్చుకో. తాతా! రాహుళ! తల్లీ! యశోధరా! మీరు లోపలికి వెళ్లండి;

నేను, గౌతమి తథాగతుణ్ణి సాగనంపివస్తాను. చెన్నా నువుకూడా రా!

[యశోధర, రాహులుడు తప్ప తక్కిన అందరు నిష్క్రమిస్తారు.]

యశో  రాహులా!

రాహు  అమ్మా!

యశో  ఆయన మీ తండ్రి.

రాహు  అవును తల్లీ!

యశో  ఆయన న్యగ్రోధారామంలో వుంటారు.

రాహు  నాకు తెలుసునమ్మా!

యశో  పోయి ఆశీర్వాదం పొందిరా నాయనా!

రాహు  అట్లాగేనమ్మా.

యశో  తాతగారితో చెప్పిపో!

రాహు  సరేనమ్మా.

యశో  సుందరి ఎట్లావుంది?

రాహు  బాగా చిక్కిపోయింది. మన యింటికి వస్తానన్నది.

యశో  చెన్నుణ్ణి పంపిస్తాను.

రాహు  అట్లాగేనమ్మా.

యశో  తాతగారు వాళ్లూ వస్తున్నట్లుంది. నేను లోపలికి పోతాను. (నిష్క్రమణ)

[శుద్ధోదనుడు, గౌతమి, చెన్నుడు ప్రవేశం]

శుద్ధో  ఏమోయ్! రాహులా ఏదో ప్రయాణ సన్నాహంమీద వున్నట్లు వున్నావు?

రాహు  అవును తాతగారు! న్యగ్రోధారామానికి వెడుతున్నాను.

గౌతమి : ఆ! తాత!

శుద్ధో : సరే! కానీ...

❀

* * న్యగ్రోధారామానికి పోయేదారి ప్రవేశం రాహులుడు.

రాహు : దట్టంగా గుబురులు కట్టిన తలలతో, దిగిన ఊడలతో, వ్యాప్తిచెందిన కొమ్మలతో కొమ్మలు చిమ్మిన నీడలతో విస్తరించిన ధర్మంలాగా వుంటుంది ఈ న్యగ్రోధారామం. ఒకొక్క చెట్టు ఒకొక్క ఏనుగులాగా దూరంనుంచి చూస్తే కనిపిస్తుంది. మొన్న మా తాతయ్యకొన్న ఏనుగు తొండంలాగా వుంటాయి ఆ వూడలు. గుఱ్ఱాన్ని వేసుకొని ఆ జీబుల్లో తిరుగుతూవుంటే ఎంతో హాయిగా వుంటుంది. వాసభ ఈ ఆరామానికి వెడదాం రమ్మని ఎంతో బలవంతం చేసింది. తెలిస్తే ఏమవుతుందోనని రానన్నాను. ఇట్టి ఒక చెట్టుక్రిందనే మా నాన్నకు ధర్మం సాక్షాత్కరించిందని మా అమ్మ చెప్పింది. ఈ ధర్మంగాలి సోకేనేమో నా హృదయం నేడు చల్లగా వుంది. నాన్నను చూట్టం చేతనని తాతయ్య అన్నాడు. తాతయ్య మాటలన్నీ చిత్రంగా వుంటాయి ధర్మంచేత శీర్షాసనం వెయ్యించడమేమిటి? అదేమన్నా మనిషా! మా కపిలవస్తులో చాలామందిని చూచాను శీర్షాసనం వేసే వాళ్ళని. ధర్మంకూడా అంతేగావుల్ను. తల క్రిందికి, కాళ్లు పైకి. అప్పుడు వాళ్ళ ముఖాలవంక చూస్తేనే బలే బాగుంటుంది. మొన్న తాతయ్య మంచి గుఱ్ఱాన్ని తెప్పించాడు. రథంలాగావుంది. దాన్ని ఎక్కివస్తే పోయేది. ఎవరుతోడు లేకుండా ఇంత దూరం నడవడం కష్టంగావుంది. ఎవరన్నా కనిపిస్తే బాగుండును. ఇదిగో ఇటు రోహిణీ నది వైపునుంచి ఎవరో వస్తున్నట్లు వున్నారు. ఎవరు! ఆఁ ఆయనే. ఆ దేవదత్తుడు. ఎప్పుడూ తిరుగుతూనే వుంటాడు. ఈయన్ను మా నాన్న మతంలో చేరిస్తే కపిలవస్తుకు సగం పీడ వదులుతుంది.

[దేవదత్తుడు ప్రవేశం]

దేవ : ఏమోయ్! రాహులా! ఎక్కడికి ప్రయాణం.

రాహు : న్యగ్రోధారామానికి, నువ్వుగూడా వస్తావా?

దేవ : అక్కడేమన్నా కోతులాడుతున్నాయా!

రాహు : కొదమ్మా మా నాన్న వచ్చాడు. మా అమ్మ వెళ్ళి ఆశీర్వాదంపొంది రమ్మంది. పోతున్నాను.

దేవ  అమ్మ వెళ్ళమందీ! నువ్వు వెడుతున్నావూ! బాగానేవుంది. నందుడికి సావాసం కుదురుతుందన్నమాట.

రాహు : అంటే.

దేవ : ఏమీ లేదులే. సరేగాని, నాతో రారాదు, చక్కగా గుఱ్ఱాలెక్కి అట్లా అట్లా వెళ్ళి వద్దాం.

రాహు : అమ్మ కేక లేస్తుంది.

దేవ : తర్వాత! తర్వాత దుఃఖిస్తుంది.

రాహు : అంటే—

దేవ : రాహుళ! నీకు ఈ రాహులుడన్న పేరు ఎట్లా వచ్చిందో తెలుసా!

రాహు : ఎట్లా వచ్చిం దేమిటి?

దేవ : అట్లా అడుగు, చెబుతాను.

రాహు : సరే చెప్పు. చూద్దాం.

దేవ : నువ్వు పుట్టినప్పుడు, మీ తాతయ్య మీ నాన్నదగ్గరకు వెళ్లి "తాత! సిద్ధార్థ! నీకో కొడుకు పుట్టాడోయ్" అన్నాడు. అ నేప్పటికి మీ నాన్న ఏమన్నాడో తెలుసా?

రాహు : నువ్వే చెప్పు.

దేవ : చెప్పుతూనే వున్నాగా. సరే అప్పుడు మీ నాన్న "ఇదో ఆటంకమూ" అన్నాడు. అప్పుడు మీ తాతయ్య నీకు రాహులుడని పేరు పిట్టాడు. రాహువంటే తెలుసుగా!

రాహు : హూఁ! అదే తెలియదు. సూర్యుణ్ణి చంద్రుణ్ణి మింగి గ్రహణాలు తెస్తాడు వాడు. వాడు రాక్షసుడు లే. మా తాతయ్య చెప్పాడు.

దేవ : చెప్పాడూ! ఇంకా ఏం! ఇవ్వాళ్లే ఆ రాహువు పనిగూడా పట్టేస్తాడన్నది.

రాహు : ఏ రాహువు పని? ఎవరు పడతారు?

దేవ : ఏదోలే! వూరికే అన్నాను. మాట్లాడుతూ మాట్లాడుతూ, న్యగ్రోధారామం దగ్గరకు వచ్చేశాం. సరే నువ్వు వెళ్లు. నేను వెడతా.

రాహు : ఇక్కడదాకా వచ్చావుగదా! లోపలికి రారాదా. మళ్లీ ఇద్దరం కలిసి పోదాం. అప్పుడు గుఱ్ఱాలు ఎక్కి తిరుగుదాం తెలుసుగా మా తాతయ్య రథంలాంటి గుఱ్ఱాన్ని తెప్పించాడు.

దేవ : నే నెందుకులే! నువ్వెళ్లు. మీ నాన్నకు నే నంటే గిట్టదు.

రాహు : పో! నువ్వు అంతా ఇదిగా మాట్లాడుతావు! సరే! నేను పోతా! గుఱ్ఱాల సంగతి మరచి పోమాక. (నిష్క్రమణ.)

దేవ : క్రిందటిసారి కపిలవస్తుకు బుద్ధుడు వచ్చాడంటే, నందుణ్ణి మఠంలో కలిపివేశాడు. ఈసారి ఈ రాహులుణ్ని కలుపుతాడు. మళ్ళీ వస్తాడు మళ్ళీ ఎవరినో చేరుస్తాడు. ఆ వరస తెలుస్తూనే వుంది. మగధనుంచి వస్తున్న వార్తలు వింటున్నాంగా! పిల్లల్ని గూడా బలవంతంగా చేర్చివేస్తున్నాట్ట! అక్కడ నానాగోలగాను వుందంటున్నారు. అది నా కెందుకు గాని, ఇప్పుడు ఇక్కడ గోహిణికి అవల కోళీయులు కొంచెం దూకుడుగా వుండగా ముసలివాణ్ణి ఇట్లా బాధపెడతాడు ఎందుకా అని? అదే పట్టింది నాకు. ఇందులో ఏదో వుంది. ఏమి వుందిలే. శుద్ధోదనుడికి కడుపుమంట తెచ్చి పెట్టడం తప్ప. పోయి ముసలివాణ్ని పలకరించి పోతాను. (నిష్క్రమణ)

[రాజమందిరం—శుద్ధోదనుడు; చెన్నుడు.]

శుద్ధో : చెన్నా! చెన్న! రాహులుడు వెళ్ళి తడవైంది. ఇంకా రాలేదేమిరా!

చెన్న : ఇప్పుడేకదా వెళ్ళింది ప్రభూ! వెళ్ళిరావాలి కదా!

శుద్ధో : ఛ! ఛ! వట్టి మందమతివి. నిన్ను వెంట పంపినా బాగుండేది.

చెన్న : ఎందుకు ప్రభు! అంత తహతహ చెందుతారు.

శుద్ధో : నా బాధ నీకు తెలియదురా చెన్నా! ఎవరు ఆ వచ్చేది?

చెన్న : సుందరి! ప్రభు!

[సుందరి ప్రవేశం]

శుద్ధో : ఏం! తల్లీ ఇట్లా వచ్చావు!

సుందరి : కుమార రాహులుడు వచ్చాడా! అక్క అడిగి రమ్మన్నది?

శుద్ధో : నేనూ చెన్నుణ్ణి అదే అడుగుతున్నాను.

సుందరి : అయితే సరే!

శుద్ధో : అంటే ఏమిటి తల్లీ!

చెన్న : ఆమె అర్థం ఏమో నాకు తెలిసింది.

సుందరి : తెలియక ఏమి చేస్తుంది. బుద్ధుని కరుణ అంత అతి వ్యాప్తంగా వున్నప్పుడు!

శుద్ధో : సుందరీ! సుందరీ! సిద్ధార్థుడు రాహులుణ్ణి కూడా సన్యాసిని చేస్తాడంటావా?

[సుందరి మాట్లాడదు. నిష్క్రమిస్తుంది]

చెన్నా! పదరా! మనం కూడా న్యగ్రోధారామానికి పోదాం.

చెన్న : అట్లాగే! ప్రభూ!

శుద్ధో : బయలు దేరు.

[దేవదత్తుడు ప్రవేశిస్తాడు]

నువ్వు ఎదురువచ్చావు!

దేవ : ఏం! తాత! అట్లా అన్నారు!

శుద్ధో : ఏమీ లేదులే! పద! ఏదో పనిమీద వచ్చినట్లున్నావు. తర్వాత మాట్లాడుకుందాం. ఇప్పుడు పనిమీద పోతున్నాము.

దేవ న్యగ్రోధారామానికేనా! నేను అటునుంచే వసున్నాను.

శుద్ధో నాయనా! మా రాహులుడు కన్పించాడా!

దేవ ఆ సంగతే చెబుదామని వచ్చాను.

శుద్ధో నువ్వు శకునివి. ఆదినుంచీ అంతా నీవల్లనే వచ్చింది.

దేవ అయితే వెళుతున్నాను. (నిష్క్రమించును)

శుద్ధో చెన్నడా! వీడు దుర్మార్గుడు. ఆదిలో సిద్ధార్థునికళ్యాణంఅప్పుడు ఎదురువచ్చాడు. ప్రతిదానిలోను సిద్ధార్థుడితో పోటీ పెట్టుకునేవాడు. నాయనకు సగం విరాగం కలగడానికి వీడే కారణం. వీడు ఇప్పుడు నాకు యెదురైనాడు. అంతా అపసవ్యంగా ఎదురౌతోంది. ఎందుకు ఈ ఆలోచన. పోదాం పద.

* న్యగ్రోధారామం- -బుద్ధుడు: సారిపుత్రుడు, ఇతర భిక్షువులు, ఎదురుగా రాహులుడు.

బుద్ధుడు : సారిపుత్ర! భిక్షువులు! ఒక వ్యక్తిని ఎట్లా ప్రవ్రజితుణ్ణి చెయ్యాలో చెబుతున్నాను. శరణ గమనంచేత ఒకవ్యక్తిని ప్రవ్రజితుణ్ణి చెయ్యవచ్చు. అందుకు అనుజ్ఞ ఇస్తున్నాను. ముందు అతణ్ణి ముండితుణ్ణి చెయ్యాలి. తరువాత కాషాయాంబరాలు యివ్వాలి. భిక్షువులకు అతనిచేత పాదాభివందనం చేయించాలి. వారి పాదాలవద్ద కూర్చోపెట్టాలి. అప్పుడు ఆ వ్యక్తి చేతులు జోడించి త్రిశరణాలను పఠించాలి. బుద్ధునికి శరణు అనాలి. సంఘానికి శరణు అనాలి. ధర్మానికి శరణు అనాలి. ఆవిధంగా రాహులుణ్ణి ప్రవ్రజితుణ్ణి చెయ్యాలి!

సారి : రా! ఆయుష్మన్ రాహుళ! అతిలోకమైన మహాధర్మపథంలో నేడు నీవు కూడా ఒక పథికుడవు అవుదువుగాని.

రాహు : మా అమ్మ మా నాన్న ఆశీర్వాదాన్ని పొంది రమ్మంది.

సారి : ఇంతకన్నా విశేషమైన ఆశీర్వాదం ఇంకా ఏమివుంది. (ఒక భిక్షువుని చూచి) ఆయుష్మన్! రాహులుణ్ణి ముండిని చెయ్యి!

రాహు : మా తాతయ్య కేకలేస్తాడు. నా తల గొరక్కండి.

సారి : రాహుళ! మరి భగవంతుని ఆశీర్వాదం వద్దుటయ్యా! ఏదీ అను! బుద్ధం శరణం గచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి! ధర్మం శరణం గచ్ఛామి!

రాహు : (ఏడుస్తూ; జుట్టుపోయినందుకు తల తడుముకుంటూ) బుద్ధం శరణం గచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి! ధర్మం శరణం గచ్ఛామి!

[శుద్ధోదనుడు; చెన్నడు ప్రవేశం]

శుద్ధో : ఆ! ఆ! అనుకున్నంత పనీ అయిపోయింది. తాత! రాహుళ! ఎక్కడ! నాయనా! ఎంత చేసాడయ్యా తథాగతుడు. సిద్ధార్థా! నన్ను ఒక్కసారిగా చంపివేయరాదటయ్యా!

బుద్ధు : గౌతమ్!

శుద్ధో : గౌతమ్! గౌతమ్! గౌతమ్! ఎవడు కాదు గౌతముడు. నువ్వూ గౌతముడివే. నేనూ గౌతముణ్ణే. కాని నీ చేతమాత్రం ఈ గౌతమ గోత్రం అతి విచిత్రంగా పునీతం అవుతున్నది. చెన్నా! చెన్నా! ఇట్లారా! చూడు! ఈ సిద్ధార్థుని చేష్టితం!

చెన్న : శాంతించండి! మహాప్రభూ! శాంతించండి.

శుద్ధో : శాంతి! శాంతించక చేసేదిఏమిటి? తపస్సు చేసి, తపస్సుచేసి దేవతల వరంకొద్దీ

సిద్ధార్థుణ్ణి కన్నాను. అతడు సన్యాసి కాగా చూచాను. శాంతించాను. మళ్ళీ శాక్యుల వంగడంలో ఒక్క శిశువుపుట్టగా చూచాను. సంతోషించాను. ఆ శిశువును ప్రవ్రజితుణ్ణిచేయగా చూస్తున్నాను. శాంతిస్తున్నాను. బుద్ధుడా! ముక్కుపచ్చలన్నా ఆరనక్కరలేదటయ్యా ప్రవ్రజితుణ్ణి చేయడానికి కుఱ్ఱవాణ్ణి. ఎన్నో యుద్ధాలు చేసి నేను బాధపడలేదు. ఇప్పుడు బాధపడుతున్నాను. దుఃఖనిస్తారకము ధర్మం అనిగదా అంటున్నావు! ఇందులో ఏదీ ఆ నిస్తరణం! ఇది [ఈ ఒక్క శుద్ధోదనుడితో పోతుందా? ఎంతమంది తల్లి దండ్రులను ఇట్లా ఏడిపిస్తున్నావో? ఇదిగో! ఇట్లా చూడు! ఒక్క వరం అడుగుతాను ప్రసాదించు. అందువల్ల లోకానికన్నా కొంత శాంతి కల్గుతుంది.

చెన్న : శాంతించండి. మహారాజా!

శుద్ధో ఒరేయి చెన్నుడా! నువ్వు చెప్పరా? ఈ సిద్ధార్థుడు వింటాడు. ఆ ఒక్క వరం ఇయ్యమనరా! నేను ఇక మాట్లాడను.

బుద్ధు గౌతమ్! తథాగతుడు వరాలు ఇచ్చేవాడు కాదు.

శుద్ధో : ఇదేనటయ్యా! నీ కరుణ! నాకోర్కె ఏమీ అనార్యమైంది కాదయ్యా! అధర్మజుష్టం కాదయ్యా! శ్రమణ! గౌతమ! ముసలిని, తండ్రిని. నా యీ ఒక్కకోరికా మన్నించవయ్యా!

బుద్ధు : ఏమిటో చెప్పు! వింటాను.

శుద్ధో : అదీ! అదీ! ఒక్కటే కోరిక. అంతే. దానితో శుద్ధోదనుని పని తీరిపోతుంది. సుగత! తథాగత! నీకు పూర్వాశ్రమంలో తండ్రిని. అప్పుడు తుష్టిని. ఇప్పుడు అవునో కాదో చెప్పలేను. చేతికి వచ్చిన ఇద్దరు కొడుకులు సన్యాసులు కాగా చూచి దుఃఖించాను. ఇప్పుడు ఇక్ష్వాకువంశ శాక్య బలవంతంగా ప్రవ్రజితుడు చేయబడగా చూచి దుఃఖిస్తున్నాను. ఇక ఇప్పుడు ఈ శాక్యరాజ్యం, ఈ కపిలవస్తు ఏమైపోతుందా అని దుఃఖిస్తున్నాను. శాక్యాన్ని మ్రింగివేద్దామని కోఅంటే కోటిమంది రాజులు కూర్చున్నారు. అది వదిలివెయ్యి. అది నా దుఃఖం. ఇది, బలవంతంగా ముక్కుపచ్చలు ఆరని పిల్లలను ప్రవ్రజితులను చేయడం లోకం దుఃఖం. దాన్ని నిస్తరించవలసిందిగా కోరుతున్నాను. తల్లిదండ్రుల అనుమతి లేకుండా కుఱ్ఱవాండ్రను భిక్షువులను చేయవద్దని అర్థిస్తున్నాను నా కోర్కె సరియైనదేనా! నన్ను మన్నిస్తావా!

బుద్ధు (కొంచెం ఆలోచించి) సరే! గౌతమ! నువ్వు చెప్పినట్లే చేస్తాను. తథాగతుడు నిన్ను అనుగ్రహిస్తున్నాడు.

శుద్ధో ఇప్పుడు అనుగ్రహించడమేమి! ఈ ధర్మం ఇంకా పుడుతుండగానే అనుగ్రహించాడు.

బుద్ధు ఇక మేము లేస్తాం. అనుష్ఠానాలకు వేళయింది.

[బుద్ధుడు, "రాహులు నితోసహా నిష్క్రమిస్తారు. అప్పుడు తెరలోంచి భిక్షువులు పాడగా 'దిక్కుల నాలుగు చెరగుల ధర్మం' అన్న పాట వినవస్తూ, క్రమంగా దూరమౌతుంది.]

శుద్ధో చెన్నుడా! విన్నావా! చూశావా!

చెన్న ప్రభు! చూశాను! విన్నాను!

శుద్ధో ఏమి! చూశావు? ఏమి విన్నావు?

చెన్న బుద్ధుణ్ణి చూచాను. ధర్మాన్ని విన్నాను.

శుద్ధో తెలివిగల పని చేశావు.

చెన్న నాకు అర్థం కాలేదు ప్రభూ! మీరు ఏమి చూశారు? ఏమి విన్నారు.

శుద్ధో నేను బుద్ధుని ఈ ధర్మంలో రక్తాన్ని చూచాను. బుద్ధుని సంఘంలో కామినీ కలకలం విన్నాను. [తెర

# డాక్టర్ కార్ల్ యూంగ్

## మానసిక శాస్త్రంలో అధునాతన పరిణామాలు

శ్రీ బి. వి. సింగరాచార్య

ఆధునిక మానవుడు అపారవిజ్ఞాన తృష్ణతో అద్భుత పరిశోధనలు సాధిస్తున్నాడు. ముఖ్యంగా, అతడు అగాధమైన తన మనస్సుయొక్క లోతులను తరచి తత్స్వరూప స్వభావాలను గ్రహించడానికి, స్వాత్మజ్ఞాన సముపార్జనకు, తనలోని అవ్యక్తశక్తుల వశీకరణకు గాను సాగిస్తూన్న కృషి మహత్తరమైనది. మనస్తత్త్వ శాస్త్రం (Psychology) అనే పేరుతో వ్యవహరింపబడుతూన్న ఈ విజ్ఞానరాశికి మూల పురుషులుగా పేర్కొనదగినవారు: ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ పండితులు. మనస్తత్త్వ శాస్త్రకర్తలలో అగ్రగణ్యులైన ఈ త్రిమూర్తులు చేసిన సిద్ధాంతాలతో, నిబంధించిన సూత్రాలతో ఈ విజ్ఞానం ఈ ఇరవయ్యవ శతాబ్దిలో సువిస్తృత మహాశాస్త్రంగా రూపొందింది. ఆదిలో వైద్యాలయాలలో మనోవికారాలకు చికిత్స చేసే సందర్భంలో మాత్రమే ఉపయోగపడుతూ వచ్చిన ఈ శాస్త్రం నేడు విశేషంగా విస్తరిల్లి మానవజీవన రంగమంతటినీ-ప్రణయం, యంత్రనిర్మాణం, రాజకీయాలు, కళ, నీతినియమాలు, కడకు భగవద్భక్తి మున్నగు సర్వవిషయాలను - పరామర్శిస్తూన్నది. చరిత్రలో ఈ మనస్తత్త్వశాస్త్ర యుగానికి ఆది పురుషులైన ఈ మూర్తిత్రయంలో ఫ్రాయిడ్, ఆడ్లర్ అస్తమించారు. మూడవవాడు కార్ల్ గస్టావ్ యూంగ్. ఈయన నేటికీ ఎనభైఏళ్ల వృద్ధాప్యంలో కూడా అనంతమైన ఈ మనస్తత్త్వ శాస్త్రజగత్తులో అవిరళాన్వేషణ సాగిస్తున్నారు.

అసంఖ్యాకంగా పెరిగిపోతున్న మనస్తత్త్వశాస్త్ర పారిభాషిక శబ్దసముచ్చయానికి తోడు 'అంతర్ముఖత' (Introvert), 'బహిర్ముఖత' (Extravert), 'అపోహ' (Complex) మొదలైన జటిలార్థ బంధురములైన అనేక నూతన సాంకేతిక శబ్దాలను సృజించిన యూంగ్ తన సిద్ధాంతాలను ఇతరులకు సుబోధకంగా వివరించడానికి తాను చాలా ప్రయాసపడవలసి వస్తూందంటాడు. భారతీయుల యోగశాస్త్రం, పాశ్చాత్యుల రసవాదం (Alchemy) ప్రక్రియలు, దేవతలగాథలు, ప్యూబ్లో ఇండియన్లనే ఆదివాసుల ఆచారవ్యవహారాలు, కర్మకాండలు, జర్మన్ తత్త్వవేత్తల సిద్ధాంతాలు, జెన్‌బౌద్ధమతం, అతీంద్రియదృష్టి (Extra-sensory perception), చరిత్ర పూర్వయుగానికి చెందిన శిలాశాసనాలు, చిత్రవిచిత్రములైన లక్ష స్వప్నాలను ఆయన శ్రద్ధగా పరిశోధించాడు. ఆయన సిద్ధాంతాలు సామాన్యంగా సుబోధకాలు గాలేకపోవడానికి బహుశః ఇదే కారణమేమో! యూంగ్ క్రమంగా మనోవ్యాధి చికిత్సాభ్యాసంగానికి తిలోదకాలిచ్చి, అధ్యాత్మతత్త్వ విచారంలో పడ్డాడని కొందరాయనను విమర్శించారు. మనోవ్యాధి చికిత్సలకు మానవజీవితానుభవాలన్నింటినీ,- స్థూలలౌకిక విషయాలు మొదలుకొని, సూక్ష్మాతిసూక్ష్మమైన ఆధ్యాత్మిక రహస్యాలవరకు-అవగాహన చేసుకొని ఉండడం అవసరమని ఆ విమర్శలకు ఆయన జవాబుచెప్పాడు.

యూంగ్ భావాలలో సూక్ష్మతర విషయాలు అస్పష్టంగా కనుపించవచ్చు. కాని, మానవుడు తన అజ్ఞాత మనస్సు (unconscious)తో సామరస్యం సాధించుకొని ప్రశాంత జీవితం గడపగలగడానికి తోడుపడవలెననే-ఆయన లక్ష్యంమాత్రం విస్పష్టంగానే కనిపిస్తుంది. నిజానికి ఇతర "గూఢ మనస్తత్త్వ వేత్తల" (Depth psychologists) లక్ష్యంకూడా ఇదేనని చెప్పవచ్చు. కాని, యూంగ్ సిద్ధాంతాలు విలక్షణమైనవి. వాస్తవానికి, డార్విన్ స్వాభావిక పరిణామ సిద్ధాంతం చేసిన నాటినుండీ, శాస్త్రవేత్తలు కనుగొన్న ఇతర విషయాలన్నింటిలో యూంగ్ గురువైన సిగ్మండ్ ఫ్రాయిడ్ బోధనలే మానవుని స్వస్వరూపజ్ఞానంలో అత్యంత విప్లవాత్మకమైన పరిణామం

కలిగించినవి. కాని, యూంగ్ తన గురువుగారి సిద్ధాంతాలను ఖండించి, నూతన సిద్ధాంతాలు చేశాడు.

## ఫ్రాయిడ్ మతం

క్రైస్తవ శకారంభంనుంచి ఇంచుమించు సదా, మనోవ్యాధుల చికిత్స ఆధ్యాత్మిక సంబంధమైన ప్రక్రియ అనే అభిప్రాయమే ప్రచలితమై ఉంటూ వచ్చింది. శాస్త్రవిజ్ఞానం వృద్ధిఅయిన కొలది, క్రమంగా ఈ ఆధ్యాత్మిక విశ్వాసాలు సన్నగిలిపోయినవి. వాని స్థానే హేతువాదం వెలిసింది. ఈ హేతువాదానికి మానవుని మనస్సులో వేరుకొని ఉన్న సహజ ప్రవృత్తు (Instincts) లే ఆధారం.

ఫ్రాయిడ్ చిన్నతనంలో మనోవ్యాధుల చికిత్సావిధానాలలో శాస్త్రీయవిచారణ (Scientific enquiry)కు, భౌతికశాస్త్ర పద్ధతుల (material scientism)కు ప్రముఖస్థానం వుండేది. మనోవికారాలకు మనస్తత్వశాస్త్ర సంబంధమైన హేతువులను అన్వేషించడమే నాటి పరిశోధనల లక్ష్యం. ఆస్థితిలో మనస్సులో అజ్ఞాత మనస్సు (Unconscious) అనే అర ఉన్నదనీ, సంకుచితమైన కార్యకారణ ప్రణాళికతో సమన్వయంకాని మానవ మనోవికారాలకు అదే జన్మస్థానమనీ, ఫ్రాయిడ్ చేసిన సిద్ధాంతమే ఆయన కనుగొన్న మహత్తర సత్యం.

అయినా ఫ్రాయిడ్ కూడా ఆనాడు ప్రాచుర్యం కలిగిఉన్న యాంత్రిక భౌతిక శాస్త్ర విధానాలను వదిలిపెట్టలేదు. మనస్సుకి నవీనమైన, సాంగోపాంగమైన యాంత్రిక ప్రణాళికను ఆయన తయారు చేశాడు. ఈ యంత్రాన్ని పనిచేసేటట్టు చేసేశక్తిని లైంగికశక్తి (Sexual energy) లేక విషయ వాసన (Libido) అని ఆయన పేర్కొన్నాడు. అజ్ఞాత మనస్సు (unconscious) అంత నానా ఉద్రేకాలతో గజిబిజిగా ఉంటుందనీ, ఈ ఉద్రేకాలను పూర్వమెన్నడో విస్మరించామని ఎవరికి వారు భావిస్తున్నా, వాస్తవంగా అవి లైంగిక ప్రేరణల (Sex powered drives)కు, సభ్యతను గురించిన వ్యక్తిగత సాంఘిక ప్రమాణాలకు నడుమ కలిగే సంఘర్షణవలన కేవలం అజ్ఞాత మనస్సులోనికి అణగద్రొక్కబడి అక్కడే గుప్తంగా పొంచిఉంటాయనీ ఫ్రాయిడ్ మతం. మనోవికార రోగాల (neuroses)ను నివారణ చేసేటప్పుడు ఈ గుప్తోద్రేకాలను త్రవ్వి పైకి తీసి, జ్ఞాతమనస్సు (conscious)ను శాసితం చేయవలసిన అగత్యం ఏర్పడింది. అని కూడా ఆయన అంటాడు. విషయ వాసన (Libido)ను గురించి ఫ్రాయిడ్ చేసిన నిర్వచనం క్రమంగా విస్తృతం చేయబడి ప్రేమను, సుహృద్భావాన్ని, అమూర్తభావాల పట్లగల గాఢ విశ్వాసాలనుకూడా కాని ఆవరణములోనే చేర్చివేశారు. బాల్యంలోఉండే మాతాపితృ ద్రోహచింత, మాతాపితృగమనేచ్ఛ (infantile Parricide and incest) మానవుల మనస్తత్వంలో అత్యంత ప్రధానమైన అంశంగా ఫ్రాయిడ్ పరిగణించాడు. ఈ భావానికే ఆయన "ఓడిపస్ దుర్భావం" (Oedipus complex) అని నామకరణం చేశాడు యూంగ్ విమర్శించినట్లు, "ఫ్రాయిడ్ మనస్సును లైంగిక గ్రంథులకు అనుబంధాంగంగా పరిగణించాడు."

అయితే అచిరకాలంలోనే ఫ్రాయిడ్ ఆదిమ శిష్యులలో ఒకడయిన అల్‌ఫ్రెడ్ ఆడ్లర్ (వియన్నా) "సర్వం విషయవాసనాత్మక" మన్న ఈ వాదాన్ని ఖండించి వేసి మానవు లంతా సహజంగా ఆత్మన్యూనతా భయోపహతులని, (inferiority complex) కనుక అధికారతృష్ణే వారి మనః ప్రవృత్తులకు మూలప్రేరణశక్తి అనీ నూతన సిద్ధాంతం చేశాడు. కాని, ఫ్రాయిడ్ భావనాజగత్తులో మానవుడు ఏకాకిగా కనిపిస్తాడు; అతడు తన వశంలో లేని వింతవింత ప్రేరణలకు, (urges)కు, మానసిక ప్రమాదాల (Traumas)కు బద్ధుడు; స్వతంత్ర నీతి పథాన్ని అవలంబించగల ఇచ్ఛాశక్తి (will) అతడికి లేదు; సృజనాత్మక కృషి, సదనుష్ఠానం, ఉన్నతాశయాలు కలిగి ఉండడం కేవలం ఉదాత్తాశయాలు మాత్రమే; మతవిశ్వాసమనగా ఒక రకమైన మానసికవ్యాధి; దేవుని గురించిన భావన పితృభావజన్యమైన ఒక కల్పన.

ఈ భావనా పద్ధతిని, "ఆత్మ (Psyche)* లేని ఆత్మశాస్త్రం" అని యూంగ్ పరిహసించాడు.

## యూంగ్ సమాధానం

మానవుని అజ్ఞాతమనస్సు (unconscious) జ్ఞాతమనస్సు (Conscious mind)చే నిరాకరింపబడిన ఆరోచకానుభవాలను ఎత్తిపోసే చెత్తకుండీ కాదని,

---

* Psyche (Greek) = Soul = ఆత్మ

నుంచి సెబ్బరులు రెండిటికీ తావుగల నిగూఢమై గొప్పగిడ్డంగి అనీ యూంగ్ వాదం. విశ్వజ. . మైన మానవస్నేహాలు, ఆశయాలు, భయాలు—అవి మనకు ఏలా కనిపిస్తున్నవో అలాగే—వాస్తవంగా ఉన్నవి. మత మనగా మనోవ్యాధి కాదనీ, ప్రపంచములో సర్వత్ర, సదా, మానవు లందరికీ మతముయొక్క అగత్యం స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నదనీ ఆయన అంటాడు.

ఫ్రాయిడ్ మహాప్రతిభావంతుడని యూంగ్ అంగీకరిస్తాడు. కొందరి విషయంలో, ముఖ్యంగా లైంగిక వాంఛోపహతులైన యువతీ యువకుల సమస్యలను పరిష్కరించడంలో ఫ్రాయిడ్ పద్ధతులు బాగా ఉపయోగపడగలవని కూడా ఆయన ఒప్పుకుంటాడు. అయితే, యూంగ్ అభిప్రాయం ఇది: మొత్తము మీద ఫ్రాయిడ్, ఆడ్లర్ కూడా ప్రతి విషయంలో "నీ స్వరూపమంతా...ఇంతే, ఇంతకన్న ఏమీ లేదు" అంటారు. ఆరోగి లక్షణాలకు మూలాలు ఫలానా ఫలానా అనీ, అవి ఫలానా ఫలానా తప్ప వేరేమీ అయి ఉండడానికి వీలు లేదనీ వారు నిష్కర్షగా చెప్పేస్తారు... లైంగిక ప్రవృత్తి సదా సర్వత్ర పొడసూపవచ్చునన్న మాట వాస్తవమే. అలాగే అధికారకాంక్ష (Instinct for power) మానవుని ఆత్మ (Soul) లోని కంటచొమ్ము కొని ఉండేమాట కూడ వాస్తవమే. కాని, ఈ రెంటిలో ఇదో, అదో మాత్రమే ఆత్మ అని గాని, ఈ రెండూ కలసి ఆత్మ అవుతాయని గాని చెప్పకూడదు... ఒక వ్యక్తిలోని సర్వం ఎలా ఏర్పడినదీ తెలుసుకున్న పిదప కూడా అతడిలో సగభాగాన్ని మాత్రమే మనము అర్థం చేసుకున్నట్టు. జీవితయాత్ర చాలించిన మానవుని మనస్సును గురించి మాత్రమే భూతకాలసంఘటనలతో మనం సమగ్రంగా వివరించగలం... జీవితం అంటే గడచినరోజుల గాథలే అనుకోవడం తప్పు..."

భావుకులలోను, మతగురువులలోను, సామాన్య ప్రజలోనుకూడా యూంగ్ అభిప్రాయాలపట్ల విశ్వాసం హెచ్చుతున్నది. మన స్తత్త్వ వివేచకుల (Analysts) కూడా ఈయన సిద్ధాంతంపట్ల విశ్వాసం హెచ్చుతున్నది. * ఈ నిపుణులలో చాలాభాగం ఫ్రాయిడ్ అనుచరులు. వీరు తమవృత్తిని కష్టంగా కొనసాగించుకుంటూ, యూంగ్ వాస్తవికజగత్తునుండి వైదొలగి పోయే పలాయనవాది (escapist) అని ఆక్షేపిస్తున్నారు. ఆడ్లర్, యూంగుల వాదాలతోపాటు, వీటికి భిన్నమైన ఇంకా అనేకవాదాలు బయలు దేరినవి. కెరెన్‌హార్నీ, ఆటోరాంక్ ఎరిచ్‌ఫ్రామ్, హారీస్టాక్. సుల్లివాన్, ఫ్రాంజ్ అలెగ్జాండర్, మెలానీక్లేన్ ప్రభృతులు ఈ వాదాలకు మూలపురుషులు. ఇక, వీరిలో ఫ్రాయిడ్ సిద్ధాంతంలో చాలాభాగాన్ని అంగీకరిస్తూ, యూంగ్, ఆడ్లర్, హార్నీ, సుల్లివాన్ మున్నగువారి అభిప్రాయాలలో తమకు నచ్చినవాటిని దానితో సమన్వయిస్తూ మిశ్రమసిద్ధాంతాలను రూపొందించేవారి సంఖ్య కూడా క్రమంగా వృద్ధి అవుతూంది. ఫ్రాయిడ్ వివేచనపద్ధతిలో మనోవికారాలన్నిటికీ కేవలం లైంగిక ప్రవృత్తులే (Sexual drives) ఆధారం అనడం చాలా సంకుచితదృష్టియే కావచ్చుననీ, మత విశ్వాసాల్లాంటి ఇతర ప్రవృత్తులను కూడా పరిశీలించడం అవసరమనీ ఇప్పుడిప్పుడు వీరిలో చాలామంది అంగీకరిస్తున్నారు. ఫ్రాయిడ్ మతానుయాయిఅయిన మిల్టన్-శాపిర్‌స్టీన్ అనే మనస్తత్త్వవివేచన నిపుణుడు, ఇలా వ్రాశాడు: "మత విశ్వాసాలు, సాంఘికహేతువులు, సమాజోద్యమాలు మానసికారోగ్యానికి అవసరమనీ, వీటిని మాటుపెట్టిన సజాతీయ సంభోగ ప్రవృత్తి (Sublimated homosexuality) క్రిందనో, మాతృగర్భంలోనికి మరలి పోవలెననే వాంఛగానో పేర్కొనడం ఉచితం కాదనీ నేడు క్రమంగా చాలామంది మనోవ్యాధి చికిత్సా నిపుణులు అంగీకరిస్తూన్నట్టు కనిపిస్తూంది."

ఫ్రాయిడ్ కొలంబస్ వంటివాడు. కొలంబస్ పశ్చిమార్ధగోళాన్ని కనుకొన్నట్టు ఈయన అజ్ఞాత మనస్సు అనే మానసికాంతర్జగత్తును కనిపెట్టాడు. యూంగ్ మెజెల్లాన్ వంటివాడు. మెజెల్లాన్ భూప్రదక్షిణం చేసినట్లు ఈయన మనోయుగజగత్తును సంపూర్ణంగా పరిశోధించాడు.

---

* "మనస్తత్త్వ వివేచన" (Psycho analysis) అనే పేరు కేవలం తమ సిద్ధాంతానికి, విధానాలకు మాత్రమే వర్తిస్తుందని ఫ్రాయిడ్, ఆయన అనుచరులు వాదిస్తున్నారు ఆడ్లర్ తన విధానానికి "వైయక్తిక మనస్తత్త్వశాస్త్రం (individual psychology) అని పేరుపెట్టుకొన్నాడు. యూంగ్ తన వాదం "వివేచనాత్మక మనస్తత్త్వశాస్త్రం" (Analytical Psychology) అంటాడు.

## అజ్ఞాత మనస్సులో విభాగాలు

యూంగ్ సిద్ధాంతం ప్రకారం మానవుని మనస్సులో మూడు అరలు ఉన్నవి. 1. జ్ఞాతమనస్సు. దీనినే మనమందరం సామాన్యంగా మనస్సు అని వ్యవహరిస్తున్నాం. 2. వ్యక్తిగత అజ్ఞాతమనస్సు. (ఇది ఇంచుమించు ఫ్రాయిడ్ చెప్పిన అజ్ఞాత మనస్సు పోలినదేగాని, కేవలం అదే అని భావించకూడదు.) విస్మృత సంఘటనలు, అణచివేయబడిన మానసికోద్రేకాలు ఈ అరలో అణిగి మణిగి ఉంటవి. 3. సమష్టి అజ్ఞాత మనస్సు. ఇది మానవ జాతి అంతటికీ ఏకంగా సంక్రమించినది; కనుక సహజ ప్రవృత్తుల (instincts) తోను, మనోవ్యాపారాలతో నిండి ఉంటుంది.

ఈ మానసిక యంత్రాన్ని నడిపే శక్తి ఏమిటని ప్రశ్న? విషయ వాసనే (Libido) అంటాడు యూంగ్. కాని, ఈపదాన్ని ఈయన వాడుతున్నది. ఫ్రాయిడ్ వాడిన అర్థంలో కాదు. యూంగ్ విషయ వాసనలో మానసికశక్తి (Psychic energy) యావత్తూ చేరిఉంది. ఈ శక్తి రెండు దిశలలో ఏ దిశకైనా, రెండు ఆవరణలలో ఏ ఆవరణలోనికైనా ప్రవహించవచ్చు. అదిముందుకి, అజ్ఞాతమనస్సులోనుండి జ్ఞాత మనస్సులోకి ప్రవహించేటప్పుడు మానవుడు తన పనులను సవ్యంగా చక్కబెట్టుకుంటూ, జీవితం సరళంగా నడుస్తూన్నదనే సంతృప్తితో బ్రతుకుతాడు. దీనికి విరుద్ధంగా, జ్ఞాతమనస్సులోనుండి అజ్ఞాత మనస్సులోనికి వెనుకకుకూడా ప్రవహించాలి. మనం ప్రయత్నపూర్వకమైన భావనమాని, ధ్యానముద్రలో కలలుకంటూన్న స్థితిలో ఇది సంభవిస్తుంది. కాని, ఈవిషమ ప్రవాహం మరీ ఎక్కువ కాలం జరిగే యెడల విషయ వాసన అజ్ఞాత మనస్సులోనుండి జ్ఞాతమనస్సు వంకకు ఉబికి వస్తూన్న ఏభావంచేతనో ఆకర్షింపబడుతూన్నదన్నమాట. ఆ భావం ఏమిటో వ్యక్తంకాకపోతే, దానిచుట్టూ తత్తుల్యమైన భావాలు మరికొన్ని కూడుకొని చిక్కుపడిన ఒక భావగ్రంథిగా ఏర్పడ్డం సంభవిస్తుంది.

ఈమనశ్శక్తి (psychic energy) అంతర్ముఖంగాను, బహిర్ముఖంగానుకూడా ప్రవహించవచ్చు. ఒక వ్యక్తిలో ఇది బహిర్ముఖమయి ఉంటే అతణ్ణి బహిర్ముఖు (Extravert) డంటాము. ఇతడు ఒక వస్తువును గాని, పరిస్థితిని గాని పరిశీలించినప్పుడు తన శక్తిని తనలోనుండి వెలుపలికి ఆవంకకు ప్రసరింపజేయాలనే భావం అతడికి మొట్టమొదట కలుగుతుంది. అలాకాక, అది అంతర్ముఖమయేయెడల అట్టి వ్యక్తిని అంతర్ముఖం (introvert) డంటాము ఏ వస్తువును చూచినా "ఇది నాకు ఏవిధంగా ఉపయోగపడుతుందీ?" అనే యోచనే ఇతడికి మొట్టమొదట కలుగుతుంది.

యూంగ్ మానవులందర్నీ నాలుగురకాల వ్యక్తిత్వాలుగలవారుగా విభజించాడు. ఇంద్రియవ్యాపారం (sensation), భావన (thinking), అనుభూతి (feeling) ప్రతిభ (intuition) అనే మనోవ్యాపార చతుష్టయ ప్రాబల్యాన్నిబట్టి ఈ నాలుగు తరగతులు ఏర్పరుపబడినవి. ఈ నాలుగు, తరగతుల్లో కూడా బహిర్ముఖతగలవారు, అంతర్ముఖతగలవారుఉండవచ్చు. కనుక యూంగ్ ఈ వ్యక్తిత్వాలను మొత్తం యెనిమిది రకాలుగా సూత్రించినట్టుఅయింది. అయితే యీ విభజనను స్థూలంగా గ్రహించవలసినదే అని, సాధారణంగా ప్రతివ్యక్తి ఇందులో రెండు మూడు తరగతుల సంకలనంగా ఉండటమే సంభవిస్తుందనీ ఆయన పదేపదే హెచ్చరిస్తూనే ఉన్నాడు. నిజానికి ఇందులో ఏతరగతిలోను చేర్చడానికి లొంగని విలక్షణ వ్యక్తులు కూడా తరచు కనిపిస్తారని కూడా ఆయన ఒప్పుకుంటాడు.

## ఆదిమ రూపాలు

అయితే యూంగ్ అజ్ఞాతమనస్సు (unconscious)ని ఇంత సుగమంగా వివరించడానికి వీలు లేదు. యూంగ్ కొన్ని సంకేతాలను కనిపెట్టాడు. వీటినిబట్టి ఆయన ఈ ఆదిప్రకృతుల విభాగాలను తయారు చేశాడు. సామాన్యంగా సుకరమైన శైలి, భావనా బలంగల యూంగ్ వీటినిగురించి వ్రాసేటప్పుడు ఒక్కొక్కచోట కేవలం మానవ వ్యక్తులను గురించే వ్రాస్తున్నాడా అనిపిస్తుంది. నిజానికి యూంగ్ చెప్పే ఆదిమరూపాలు మానవానుభవానికి, సంవేదనకు పురాతనపు నమూనాలు. వీటికి సర్వయుగాలలో, సర్వసంస్కృతులలో అనువృత్తి ఉంటుంది. ముఖ్యంగా ఇవి రెండురూపాలలో కనిపించవచ్చు. 1. వ్యక్తిగతాలోచనలు, స్వప్నాలు, మనోగత దృశ్యాలు. 2. పురాణగాథలు, సంప్రదాయాలు విశ్వాసాలు.

# డాక్టర్ కారల్ యూంగ్

యూంగ్ మనోవివేచకవృత్తిని ప్రారంభించి పనిచేస్తున్నప్పుడు, తనవద్దకు వచ్చేరోగుల స్వప్నాలలో అతి ప్రాచీనకాలపు చిహ్నాలు, కర్మకాండలు కనిపిస్తూండడం చాలాసార్లు గమనించాడు. ఆచిహ్నాలు కర్మలు అంతకుపూర్వం ఆ రోగులు ఎక్కడా కన్నవి గాని, విన్నవి గాని, చదివినవి గాని కాకపోవడం ఆయనకు విస్మయం కలిగింది. ఈ పరిశోధనల పర్యవసానముగా, మానవజాతియొక్క సమష్టి అజ్ఞాత మనస్సు (Collective unconscious) అనేది ఒకటి ఉన్నదనీ—అది 1. ప్రకృతి పరిణామక్రమంలో మనస్సులోని జ్ఞాత భాగానికన్న చాలా కాలం క్రిందటనే రూపొందినదనీ, 2. తిరిగి వొకే రకమైన ప్రాతిపదిక 'పథకాలను రూపొందిస్తుందనీ, ఆయన సిద్ధాంతం చేశాడు. అయితే ఈ ప్రాతిపదిక పథకాలు ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్క రకంగా అమర్చబడి ఉండవచ్చు. (మానవశరీరాలన్నీ ఒకే విధమైన అవయవాలను కలిగిఉన్నా, ప్రతి శరీరానికి విశిష్టత ఉన్నట్లే, వీటిలోని వ్యత్యాసమూ ఉంటుందని ఆయన ఉపమానం చెప్పాడు.

ఈ ఆదిమ రూపాలన్నింటిలోకి—చాలా వరకు జ్ఞాత మనస్సుకి సంబంధించినదే అయినా—సుస్పష్టమయి వాటిలో ఒకటిగా పరిగణింపబడేది 'బురఖా' (Persona) పూర్వం రోమ్‌నగరంలోని నటులు వివిధపాత్రలను అభినయించడానికి, ఆయాపాత్రానుగుణమైన కృత్రిమపు ముఖాలను లేక బురఖా (Persona) లను తమ ముఖాలకు తగిలించుకొని అభినయించేవారు (నృసింహ కరాళము లాంటివి). ఆ అర్థంలోనే యూంగ్ ఈ మాటను వాడాడు. అనగా, మానవుడు తన ఇరుగుపొరుగు వారియెదుట నిజస్వరూపాన్ని మరుగుపరచుకొని చేసే అభినయానికి యూంగ్ ఈ 'బురఖా' (Persona) అనే పేరు పెట్టాడు. దీనికి కొంత నాటకాభినయ చాతుర్యం కావాలి. మానవుడు తన అంతర్జగత్తుకి, తన పరిసర జగత్తుకి వైషమ్యాలను వారించడానికి ఈ నటన అవసరం అవుతుంది. ఈ బురఖా ఆంతరంగికమైన నిజ వ్యక్తిత్వంపై పెత్తనం చెలాయించనారంభించినప్పుడుమాత్రమే ప్రమాదకరంగా పరిణమిస్తుంది.

అయితే మరొక ప్రమాదమేమిటంటే, ఒకొక్కప్పుడు ఈ బురఖా మానవుణ్ణి తన ప్రతిబింబాన్ని (Shadow) తానే గుర్తించలేని అంధుణ్ణి చేయవచ్చు. వ్యక్తిగతమైన అజ్ఞాత మనస్సులో అంతర్భాగమైవుండే ఈ ప్రతిబింబం డాక్టర్ జెకిల్‌లోని హైడ్‌వలె అంతరాత్మ (Conscience) నిషేధించిన కర్మలనే చేయజూచే దుష్టప్రకృతి. కనుక, ఈ ప్రతిబింబాన్ని అదుపులో ఉంచడం అవసరం. కాని,



యూంగ్ బురఖా

"ప్రాణప్రియా ! నీవు లేకపోతే నేనేమై పోదును !"

ఈ పని చాలా ప్రమాదకరమైనది. దానిని అణచడానికి ప్రయత్నించినకొలది, అంతకుమించిన శక్తితో అది పైకి విజృంభించే ప్రమాదం ఉన్నది.

## అంతఃప్రవృత్తి, పృథ్వీమాత, ఆత్మ

ఈ సమష్టి అజ్ఞాతమనస్సులో ఇంకా అడుగున మానవునిలోని "స్త్రీప్రకృతి" (Female principle) రూపమయిన అంతఃప్రవృత్తి (Anima) ఉన్నదని యూంగ్ కనిపెట్టాడు. సంప్రదాయ సిద్ధంగా స్త్రీ స్వభావాలుగా పరిగణింపబడుతూన్న సౌమ్యత, మంజుల వస్తువులయెడ ప్రీతివంటివే కాక, అల్పత క్రోధంలాంటి గుణాలన్నీ దీనిలోనే చేరతాయి అంటాడు యూంగ్. మరొక ముఖ్యమైన విషయం ఏమిటంటే; "స్త్రీ స్వభావాన్ని గ్రహించడానికి కూడా' మానవుడికి ఈ అంతఃప్రవృత్తి ఉపయోగపడుతుంది. ఇది స్త్రీనిగురించిన ఆదర్శభావనకు అజ్ఞాతమనస్సులో ఏర్పడిన ఒక బింబం. ఇది ట్రాయ్ హెలెన్ మొదలు, ఆంగ్లనవలారచయిత రైడర్ హాగర్డ్ నవలలోని "ఆమె"వరకు, ఎవరి ప్రతిబింబమయినా కావచ్చు. ఈ ఆంతరమూర్తినిగురించి యూంగ్ శిష్యులలో ఒకరుచేసిన వివరణ ఇది: ఈమె యుగయుగాలుగా తిరిగితిరిగి వ్యక్తమయే అనేక గుణాలుగలది.. సంవత్సరాలకొలది అనుభవాల సూచ

వలు ఉన్నా ఈమె నిత్యయౌవన విలసితయై సదా నవనవలాడుతూన్నట్టు కనిపిస్తుంది. ... తెలివైనది, కాని అవి శక్తిమంతమైన తెలివితేటలు కావు; విచిత్రార్థాలేవో—గుప్తజ్ఞానం లాంటివి - ఆమెను ఆవరించుకొని ఉంటాయి" తనలోని ఈమె - ఈ స్త్రీ బింబములను - రక్తమాంసాదులతో కూడిన ఒక స్త్రీ పై అధ్యాసను చేసుకొన్నప్పుడు ఆ పురుషుడు ఆమెను ప్రేమిస్తాడు. కాని అనంతరం ఆమె అతని అజ్ఞాతమనస్సులోని బింబంతో పూర్తిగా సరిపడనప్పుడు మాత్రం చిక్కు వస్తుంది.

పురుషులలో ఈ అంతఃప్రవృత్తి వున్నట్టే స్త్రీలలో కూడా దీనివంటి అంతఃప్రవృత్తి, అనగా పురుషస్వభావాల సమష్టిరూపం, పురుషుని గురించిన ఆమె సమగ్రభావచిత్రం (Animus) ఉన్నదంటాడు యూంగ్.

తరువాత ఈ ఆదిమరూపాలలో (Archetypes) లో వృద్ధ విజ్ఞానిరూపం, పృథ్వీమాత రూపం చాలా ముఖ్యమైనవి. ఈ వృద్ధ విజ్ఞాని స్వప్నాలలోను అప్రయత్న భావనావస్థలోను చక్రవర్తిగా గాని, వీరుడుగా గాని, వైద్యుడుగా గాని, మంత్రవేత్తగా గాని, తనకు రక్షకుడుగా గాని కనిపించవచ్చు. (యూంగ్ వద్ద మానసిక చికిత్స పొందేవారికి ఈ వృద్ధుడు తరచు యూంగ్ రూపంలోనే సాక్షాత్కరించడం మామూలు.) ఈ భావాలు కొంతవరకు మంచివే! ప్రతి మానవునిలో గొప్పతనపు బీజాలు కొన్ని ఉంటవని; ఆ సంగతి తెలుసుకొని ఉండటంకూడా, అతనికి శ్రేయస్కరమే. కాని ఈ భావాన్ని బాగా విస్తరించుకున్నవాడు విపరీత పునరుద్ధరణవాది (Revivalist) గానో, హిట్లర్ గానో, లేక ఉన్మాదశాలలో కనిపించే (నెపోలియన్ వంటి) మహా విజేతగానో తయారవుతాడు.

పురుషునిలో ఈ వృద్ధ విజ్ఞానిభావం వలెనే స్త్రీలలో పృథ్వీమాతృ (Earth-mother) భావం—జీవనధాత్రి భావం -ఉన్నది. కాని, ఈ భావం మరీ ప్రబలమైన స్త్రీ ఇతరుల సమస్యలను అవగాహన



పురుషుడు తన ఆత్మలోని స్త్రీమూర్తినే ప్రేమించుతాడు.

చేసుకోవడంలో తనకు అనుపమాన సామర్థ్యం ఉన్నదని గ్రహించి ఉత్తమ ధార్మికురాలుగా తయారుగావచ్చు; లేదా తన మాతృభావ ప్రాచుర్యవలయాన్ని గట్టిగా బిగించి, తనకు ప్రీతిపాత్రమైన సర్వానికి ఇరకాటం, బాధ కలిగించేటంత భయంకరంగా పరిణమించవచ్చు.

చివరికి అల్పములైన ఆదిమరూపాల (Archetypes) లో ప్రముఖమైనది. సర్వాతిశాయి అయిన ఆత్మ (Self). వ్యక్తి బుద్ధిలోని కొన్ని అంశాలు, ఆదిమరూపాలలోని మంచివాటిలోను చెడ్డవాటిలోనూ కూడా కొన్ని కొన్ని అంశాలు కలిసి ఈ ఆత్మలో ఉంటాయి ఇది మానవజాతి ఏకతకు చిహ్నం. ఇలాంటివి చాలా మతాలలో ఉన్నవి ఉదాహరణకు: హిందూ వేదాంతు లభివర్ణించే 'ఆత్మ' ఇలాంటిదే.

యూంగ్ నిర్వచించే ఈ ఆత్మ అత్యంత ప్రముఖమైన మరొక ప్రక్రియకు దారిచూపింది. ఈ విధానానికి యూంగ్ వ్యక్తిత్వనిరూపణ (Individuation) మని పేరుపెట్టాడు. యూంగ్ వద్ద మనో వికారాలకు చికిత్సపొందిన రోగులు వ్యాధి పూర్తిగా నివారణ అయిన తరువాత తమకు తెలియకుండా ఇట్టి పరిపూర్ణ భావము (Wholeness) ను అనుభవిస్తున్నట్టు యూంగ్ కనిపెట్టాడు. వ్యక్తిత్వ నిరూపణ ఒక జీవితకాలపు పని కావచ్చు. (సామాన్యంగా మనస్తత్వ వివేచనా నిపుణుడే రోగికన్న ముందుగా నే చనిపోతూంటాడు అని యూంగ్ అనుయాయి అయిన ఒక వివేచకుడు వ్రాశాడు.) అజ్ఞాత మనస్సులోని గుప్తవిషయాలను క్రమంగా తెలుసుకొన్నకొలది మానవుడు తనలోని అశాంతికరమైన అర్ధవ్యక్త ప్రేరణలకు సరియైన విలువలు నిర్ధారణ చేసికొనగలుగుతాడు. వ్యక్తిత్వ నిరూపణ అనగా మానవుడు "తనలోని దేవుని తాను సాక్షాత్కరింపజేసికొనడం" అని మరొక వివరణ.

## సంకేతాల అగత్యం

ఈ విధానానికి సంకేతాలు ఉపకరించగలవు. ముఖ్యంగా యూంగ్‌ను విశేషంగా ఆకర్షించిన సంకేతం: ఒక చదరంలోని వలయంలో చెక్కబడి, నాలుగు సంఖ్యయొక్క గుణకంగా రచించిన 'మండల' (Mandala)* మనే యంత్రం. రసవాదులు పేర్కొనే తత్వవేత్తల దివ్యమణితో తరచు పోలిక చెప్పబడే ఆత్మకు సంకేతం కావచ్చు. గజిబిజిగా పెరిగిన మర్రిచెట్టునుబోలిన 'జీవన వృక్షం' ఒకే పువ్వు పూస్తుందనే సంకేతంకూడా తరచు కనిపిస్తుంది. బహుశః ఇదే ప్రాచ్యదేశాల సువర్ణ పుష్పం కావచ్చు, లేదా క్రిస్మస్ వృక్షపు నక్షత్రం (Cristmas free star) కావచ్చు. ఇది జీవన విధానానికి, జీవనానికీ మరొక సంకేతం.

ఆధునిక మనస్తత్వ శాస్త్రంలో ఇట్టి సంకేతాల ప్రయోజనం ఏమిటి? యూంగ్ సమాధాన మిది: ఈ సంకేతాలు వాస్తవమైనవి: అనుదినం అవి రోగుల స్వప్నాలలో కనిపిస్తున్నవి. ఉదాహరణకు, మానసిక రుగ్మతగల వ్యక్తి ఆకాశంవైపుకి పాముని ఎత్తిపట్టుకున్నట్టు కలగంటే, ఫ్రాయిడ్ మతానికి చెందిన వివేచకుడు అది పురుషలింగానికి సంకేతమని నిర్ధారణ చేస్తాడు దాని అర్థం అదే అయితే అయివుండవచ్చుననికూడా యూంగ్ అంగీకరిస్తాడు. అయితే యీ సర్ప సంకేతానికి ఇంకా విస్తృతమైన ప్రాముఖ్యం ఉన్నదన్నమాట నిజం. రెండవ శతాబ్దిలోని గ్రీస్ దేశంలోని సర్పచిహ్న విజ్ఞానవాదుల (Ophite-Gnostics) దృష్టిలో సర్పం ప్రపంచ విమోచన మార్గానికి చిహ్నం. సర్పం జీవితము యొక్క ఛాయాభాగాన్ని గుర్తించడానికి, దౌష్ట్యాన్ని (evil) సూచించడానికి సంకేతం కావచ్చునని యూంగ్ అభిప్రాయం. "నేటికాలపు రోగులలో కూడా ఇది అదే ప్రేరణకు చిహ్నం కావచ్చునేమో అనే దృష్టిలో మనం పరిశోధించవచ్చుగదా? పైగా, తమమనస్సులలో ఇట్టి సంకేతాలు కనిపించినరోగులు, అవి ఉన్మాదానికి చిహ్నాలనుకొని భయపడి, అవి కేవలం ప్రాచీన మానవ సంకేతాలని తెలియజెప్పిన మీదట స్వస్థచిత్తులవుతున్నారు", అని యూంగ్ వ్రాశాడు.

మతానికి ప్రాముఖ్యంగల యుగంలో మానవుడు తన ఆదిమ రూపాలను ప్రయత్నపూర్వకంగా గ్రహించవలసిన అగత్యం ఉండేదు. మతమే అతడికి అవసరమైన సంకేతాలను అమరుస్తుందంటాడు యూంగ్. ఈ

* "మండల" మనే ఈ సంస్కృత శబ్దానికి ఇక్కడ ఐంద్రజాలిక వలయం అని అర్థం. బౌద్ధులలోను, ప్రాచ్యదేశాలలోని మరికొన్ని మతాలలోను ఇది ఒక ప్రసిద్ధ ధ్యానసాధనం. మధ్యయుగాలలో వెలసిన, ఒక క్రైస్తవ మండలం మధ్యగా క్రీస్తు ప్రభువు, అతడికి నాల్గుప్రక్కల నల్గురు సువార్తా ప్రవక్తలు ఉన్నారు.

విషయంలో క్రైస్తవ మతం చాలా లోపభూయిష్ఠంగా ఉన్నదనీ, ప్రొటెస్టెంటుల సంస్కరణోద్యమమే ఈ స్థితికి చాలవరకు కారణ మనీ, కోట్లకొలది మానవులకు క్రైస్తవసంకేతాలకు అర్థా లేమిటో బొత్తిగా ఏమీ తెలియదనీ, స్వయం గా ప్రొటెస్టెంటు మతస్థుడయిన యూంగ్ విమర్శ. నేడు క్రైస్తవ మతశాఖ లన్నింటిలో రోమన్ కాథలిక్ మతం ప్రాబల్యం కలిగి ఉండడానికి ఇదే హేతువనీ, కాథలిక్కులకు సామాన్యంగా వ్యక్తిత్వ నిరూపణయొక్క అగత్యం కనిపించడం లేదనీ కూడా ఆయన సూచించాడు. "కాథలిక్ మతం సమగ్రమయిన మతం. ప్రొటెస్టెంట్ మతం కాదు. మతాలకు తత్త్వసిద్ధాంతాలతోపాటు, కర్మకాండలు కూడా అవసరం. ప్రొటెస్టెంట్ మతానికి ఈ కర్మకాండలు లేవు. అందువల్ల ఈమతం ఒకే కాలుమీద నిలబడిఉంది. కాథలిక్కులకు కర్మకాండలూ, వాటి వలన కలిగే అద్భుత ప్రయోజనాలు ఉన్నవి," అని ఆయన వివరించాడు. నిజానికి యూంగ్ సంవత్సరాలకొలది ఎన్నడు చర్చికి వెళ్లలేదు. కాని, "మీకు దేవునిలో విశ్వాసం ఉన్నదా?" అని అడిగిన వారికి ఆయన ఇలా చెప్పాడు: "విశ్వాసం ఉన్నదని నేను చెప్పలేను. కాని ఒకటి నేను గ్రహించాను. నాకన్న ప్రబలమైన శక్తి ఏదో లోనుండి నన్ను పట్టుకొని ఆడిస్తున్నదనే అనుభవజ్ఞానం మాత్రం నాకు ఉన్నది. దానినే ప్రజలు దేవుడని పిలుస్తున్నారు."

"ఆధునిక మానవుడు బుద్ధిపూర్వకంగా కాకపోతే తనకు తెలియకుండా అయినా ఈ మత సంకేతాలవల్లకలిగే శ్రేయస్సును, భద్రతను అభిలషిస్తున్నాడు. అందువల్లనే చాలామంది చిత్రవిచిత్రాలైన ప్రాచ్యదేశాల మతాలను యూరప్‌కి దిగుమతి చేయడానికి ప్రయత్నిస్తున్నారు. మరికొందరు గ్రామీణ నాయకులు గాను, నూతనవాదాలకు అనుచరులు గాను తయారవుతున్నారు. (ఇవి అజ్ఞాత మనస్సులోనుండి బయలు దేరేఅగ్నిపర్వత విజృంభణల్లాంటివని యూంగ్ అభిప్రాయం.) మరికొందరు వివేచకుల సలహా కోరుతున్నారు. "మన హృదయాలు ఆందోళన పడుతున్నవి. ఏదో గూఢమైన అశాంతి మన జీవితపు మూకటి వేళ్లను కొరికి వేస్తూంది ... ఈ అజ్ఞాత మనస్సుతో వ్యవహారం మనకు చావుబ్రతుకుల సమస్య అయిపోతూంది. "కనుక, రోగులు తమ మతసంకేతాలను తాము తెలుసుకొనలేనప్పుడు వివేచకులు వారి అజ్ఞాతమనస్సులో గుప్తమైఉన్న ఆ సంకేతాలను బహిర్గతం చేసిచూపడంలో వారికి సహాయపడాలి. జీవితం సగానికి పైబడినవారికి అనగా ముప్ఫయ్యేళ్లు దాటినవారందరికి అంతిమఆశ్రయం జీవితంలో మత దృష్టిని అలవరచుకొనడమే. ఇందులో ఒక్కరికి కూడా మినహాయింపు లేదు..."

## "గడ్డిమోపుమీద స్వారీ—కల"

ఫ్రాయిడ్ విధానాలకు యూంగ్ పద్ధతులకు గల విభేదాలు బోధపడడానికి ఈ చిన్న సంఘటన ఉదాహరణగా ఉపకరిస్తుంది. బాగా లాభసాటిగా వ్యాపారం చేస్తున్న ఒక వర్తకుడు యూంగ్ అనుయాయి అయిన ఒక వివేచకుడిదగ్గరకు వెళ్లాడు. 51 సంవత్సరాల వయస్సులో ఈ వర్తకుడికి రైలు ప్రయాణమన్నా, విమానప్రయాణమన్నా అమితమైన భయం పట్టుకున్నది. ప్రయాణం తలపెడితే నే అతడికి ఆపుకోలేని ఆందోళన, తలదిమ్ము (Giddiness) కలుగుతున్నవి.

రోగి ఏవయస్సువాడైనా ఫ్రాయిడ్ మతానికి చెందిన వివేచకుడైతే అతడిని మంచంమీద పరుండబెట్టి నిస్సంకోచంగా మనస్సుకి ఏమితోస్తే అది,— ముఖ్యంగా రోగి బాల్యావస్థనుగురించి — మాట్లాడమంటాడు. ప్రయోజనం: అతడి తలదిమ్ముకి మూల కారణమైన మానసికాఘాతాన్ని గాని, అణచివేయబడిన మనోద్రేకాన్ని గాని గుర్తించడం.

యూంగ్ మతానుయాయి అయిన వివేచకుడు రోగిని మంచంమీద పరుండబెట్టడు. తన కెదురుగా కుర్చీలో కూచోబెడతాడు. ఈ పద్ధతి ఇద్దరు సమానులమధ్య జరుగుతూన్న వ్యవహారాన్ని సూచిస్తుంది. ఫ్రాయిడ్ వివేచకుణ్ణి రోగికి కనిపించకుండా వెనుక ప్రక్కన ఉండమంటాడు. ("రోజుకి ఎనిమిదిగంటలు ఎవరో ఒకరు నావైపు ఆదుర్దాగా చూస్తూండడం నేను సహించను," అని ఫ్రాయిడ్ అన్నాడు.) యూంగ్ అలా కాక, మనోవివేచన కార్యక్రమంలోని ఉద్రేకావేశాలలో వివేచకుడు కూడా భాగం పంచుకోవాలంటాడు.

యూంగ్‌ను అనుసరించే వివేచకుడు వర్తమానాన్ని భవిష్యత్తునుమాత్రమే ప్రధానంగా పరిగణిస్తాడు. ఆ వ్యాపారస్థుడు బహుసంవత్సరాలుగా అతి భారవహమైన పని నిర్వహిస్తున్నాడు. ఇప్పుడు

అతడు తనపనిని కొంత తగ్గించుకోనక తప్పదని బలవంతపెట్టే కొన్ని చిహ్నాలు అతని అవ్యక్తబుద్ధిలో నుండి వెలువడుతున్నవి. శ్రమ తగ్గించుకోవాలనే కోరిక తనకు తెలియకుండానే అతనిలో ఏర్పడి ఉండాలి. కనుక, అతడి అవ్యక్తాశయాలను గ్రహించేందుకు వివేచకుడికి ఉపకరించడానికి గాను, ఆ వ్యాపారస్థుణ్ణి తన కార్యక్రమాన్ని గురించి, ప్రయాణాలను గురించి చెప్పమని కోరాడు. (ఇది అప్రయత్న ప్రసంగం కాదు. అట్టి ప్రసంగం ప్రధానవిషయాన్ని వదిలి వ్యభిచరించవచ్చు, అంటాడు యూంగ్.)

ఈ విధంగా చాలా సమావేశాలు, ప్రసంగాలు జరిగిన తరువాత ఒకరోజున ఆ వర్తకుడు తనకు వచ్చిన ఒక కల చెప్పాడు: "నేను బాగా ఎత్తుగా కట్టిన ఎండుగడ్డి బండిమీద కూర్చుని, ఆ బండిని మా పసువులశాలలోకి తోలుకుపోతున్నాను. బండిమీద గడ్డి బాగా ఎత్తుగా పేర్చి ఉండడంవలన నాతల ద్వారం పైభాగానికి కొట్టుకొని వెంటనే క్రిందపడిపోయాను. ఆ భయంతో నాకు మెలుకువ వచ్చింది." ఈ పసులశాల స్త్రీయోని అనీ; ఈ స్వప్నం మాతృగర్భంలోనికి తిరిగి వెళ్ళవలెనని మానవులలో ఉండే సహజ వాంఛకు చిహ్నం అనీ; అయితే ఈ స్వప్నంలో వరుసకానివారితో సంభోగించవలెననే వాంఛకూడా అంతర్గర్భితంగా ఉండడంవల్ల, తత్పర్యవసానంగా శిక్ష (బీజపాతము) అనుభవించవలసి వచ్చిందనీ ఫ్రాయిడ్ అనుయాయులు వ్యాఖ్యానిస్తారు. ఇక ఆడ్లర్ శిష్యులైతే బరువు ఎక్కువైన ఆ బండి అతిశయించిన అధికారేచ్ఛకు చిహ్నమనీ, ఆ వర్తకుని ఆత్మన్యూనతాభీతికి ప్రతిఫలమనీ వ్యాఖ్యానిస్తారు.

యూంగ్ మతానికి చెందిన వివేచకులు ఈ స్వప్నానికి ఇంతకన్న స్వతస్సిద్ధమైన వ్యాఖ్య చెపుతారు. రోగి జీవితాన్ని, ఈ స్వప్నాన్ని తిరిగి తిరిగి పరిశీలించినమీదట, (స్వప్నాలను వ్యాఖ్యానించడానికి ఏవో నిర్దిష్టసూత్రాలను చేసిపెట్టుకొనే పద్ధతి యూంగ్‌కి ఇష్టంలేదు) వివేచకుడు ఈ అర్థాన్ని సూచిస్తాడు: "ఈరోగి తన బ్రతుకు బండినిండా శక్తికి మించిన బరువు వేసుకున్నాడు; అందువలన అతని వ్యక్తి ఆశయాలు దెబ్బతింటున్నవి. ఈ స్వప్నం అతిశయ బహిర్ముఖతా విధానంవల్ల తారుమారవుతున్న సమస్థితిని పునరుద్ధరించడానికి అతడి అజ్ఞాత మనస్సు చేస్తున్న ప్రయత్నాన్ని నిరూపిస్తుంది. ఈ వ్యాపారస్థుడికి వయస్సు మళ్ళుతున్నకొద్దీ ఈ సమస్థితి మరీ భంగపడుతూ ఉండడంవల్ల ఈ ప్రయత్నం క్రమంగా ప్రస్ఫుటమవుతున్నది."

ఈ వ్యాఖ్యవలన రోగి ఫ్రాయిడ్ పద్ధతిలోవలె తన మనోవికారాన్ని చిన్నప్పుడు కలిగిన ఏ మానసికాఘాతానికో ముడిపెట్టుకొని తేలికగా బయటపడడానికి వీలులేదు. తాను జీవితములో ఏర్పరచుకొన్న లక్ష్యాలను సవరించుకొనవలసిన నూతన బాధ్యత అతనికి ఏర్పడుతుంది. ప్రస్తుత వర్తకుడు ఈ వ్యాఖ్యానం విన్నమీదట, తాను ఏకోన్ముఖమైన అసమగ్ర జీవితం గడుపుతూన్న సంగతి గ్రహించాడు. అందువల్ల తన వ్యాపారకలాపాలను తగ్గించుకొన్నాడు; పైగా ఆపని సంతృప్తితో సంతోషంగా చేశాడు. ఆపైన ఏ విధమైన ఆందోళనగాని, తలదిమ్ముగాని లేకుండా సుఖంగా ప్రయాణాలు చేస్తున్నాడు.

"ఫ్రాయిడ్ వివేచన పద్ధతిలో మనోవికారాలకు చికిత్స పొందిన పిమ్మట రోగి ఆత్మ నిర్వీర్యం అయిపోతుంది" అని యూంగ్ అనుయాయులు తరచు విమర్శిస్తూంటారు. యూంగ్ అభిప్రాయ మిది: మనోవ్యాకులత అనే రోగం రోగి ఆత్మ (Soul) లో కొంత భాగంతో గట్టిగా ముడిపెట్టుకొని ఉంటుంది. అందువల్ల, పుచ్చిన పన్నును లాగివేసినట్లు ఆ రోగాన్ని తొలగించివేస్తే, ఆ రోగికి లాభించేది ఏమీ ఉండకపోగా, విశేషమైన నష్టం కలుగుతుంది. ఈ నష్టం — తన నిర్ణయాలను తానే సంశయించి సరిచేసుకునే అభ్యాసాన్ని కోల్పోయిన విజ్ఞాని, తన జీవితాభిలాషలను కోల్పోయిన నైష్ఠికుడు పొందే నష్టంవంటిది... ప్రతి వ్యక్తీ బుద్ధిపూర్వకంగా, స్వయంగా చేసుకున్న నైతిక నిర్ణయాల ప్రకారం తన మార్గాన్ని తానే నిర్ణయించుకోవాలి."

## తండ్రి కొడుకులు

ఆధునిక మానవుని మానసిక వ్యధలలో ఒకటి, అతడు తన జన్మస్థానానికి, స్వజనానికి దూరమై ఉండడంవల్ల కలుగుతూంది. ప్రకృతినుండి ఇటీవలే మానవుడు స్వాధీనం చేసుకున్న అమెరికా ఖండంలోని ప్రజలకు — స్పష్టంగా వారికి తెలియకపోయినా — నేటికీ అక్కడ స్వస్థత చిక్కలేదనీ; దీనివలన ఉద్రేకం హెచ్చి అమెరికా దౌర్జన్య శక్తులకు

కారణం అవుతున్నదనీ యూంగ్ అంటాడు.* అయితే, యూంగ్‌కు ఇలాంటి బాధ ఏమీలేదు. ఈయన స్విట్జర్లెండ్ దేశపు మతసంస్కరణ వాదుల లోని ఒక మతాచార్యుల కుటుంబంలో జన్మించాడు. మొత్తంమీద ప్రపంచ మంతట పర్యటించాడు. భారతదేశంలో కొన్నాళ్లు ఉపన్యాసకుడుగా పని చేశాడు. కెన్యాలో ఎల్గాన్ పర్వతంవద్ద ఆదివాసుల ప్రాంతంలో కొంతకాలం ఉన్నాడు. నేను 1908 లో తాను, తన భార్య కలసి కట్టుకున స్వగృహంలో ఉంటున్నాడు.

యూంగ్ తన బాల్యదశను బాసెల్ (స్విట్జర్లెండు)లో ఏకాకిగా గడిపాడు. ఆరవయేట లాటిన్ చదువుకొనడం ప్రారంభించాడు. క్రమంగా, పిమ్మట తానే 'అంతర్ముఖత' అని పేర్కొన్న స్వభావానికి అలవాటు పడ్డాడు. "ఈయన అంతర్ముఖత నిశిత భావనాత్మకమైనది." మొదట ఆయన పురావస్తుతత్త్వవేత్త కావాలని, లేదా పురాతన జీవ పరిశోధకుడు కావాలనీ అనుకునేవాడు. "ఎక్కడైనా పురాతన వస్తువులు త్రవ్వి తీసిన ఫోటోగ్రాఫ్ తెలిస్తే ఇప్పటికీ ఆయన ఆనందపరవశుడౌతాడు. నిజానికి భూగర్భంలోనే కాదు, మన అంతరంగాలలో కూడా చరిత్ర ఉన్నది, ఈ చరిత్రను ఆయన త్రవ్వి బయటికి తీశారు," అని యూంగ్ శిష్యుడు వ్రాశాడు.

ముఖ్యంగా తనతండ్రిసంతృప్తికోసమే యూంగ్ వైద్యశాస్త్రం చదవడం ప్రారంభించాడు. అచిర కాలంలోనే మనోవికార చికిత్సాశాస్త్రం ఆయనను ఆకర్షించింది. 1900 లో క్రొత్తగా పట్టభద్రుడైన డాక్టర్ యూంగ్ జూరిక్ వెళ్లి, అచటి సుప్రసిద్ధ ప్రాచీన విశ్వవిద్యాలయంలోని మనోవ్యాధి చికిత్సా విభాగంలో సహోద్యోగిగా చేరాడు. ఫ్రాయిడ్ రచనలు చదివినమీదట ఆయనపదమైత్రిని (Word-associations) గురించిన పరీక్షలు ప్రారంభించాడు. పిదప, ఈ పరీక్షల ఫలితాలు ఫ్రాయిడ్ సిద్ధాంతాలలో ముఖ్యమైన వాంఛాదమనసిద్ధాంతానికి ప్రబలమైన నిదర్శనాలుగా ప్రశంసింపబడినవి. యూంగ్ ఆయనపై ఉద్యోగిగా పనిచేస్తూఉండిన డాక్టర్ యూజెన్‌బ్లూలెరూ ప్రసిద్ధమైన తమ జూరిక్ ఆసుపత్రిలోని పరిశోధనలద్వారా ఫ్రాయిడ్ సిద్ధాంతాలకు అపూర్వమైన ప్రతిష్ఠ కలిగించారు. 1907 లో యూంగ్ తనకు ఆచార్యతుల్యుడైన ఫ్రాయిడ్‌ని కలుసుకొనడానికి వియన్నా వెళ్ళి, రెండువారాలు అక్కడె ఆయనతో గడిపాడు. "మొదటిరోజున మేము 13 గంటలసేపు మాట్లాడుకొన్నాం. కాని, ఆయన శాస్త్రసర్వజ్ఞభావం (Science Positivism) మనస్సునుగూర్చిన వివరణలో ఆయన కేవల హేతువాదదృష్టి, ఆ లౌకికదృష్టీ నాకు రుచించలేదు," అని యూంగ్ వ్రాశాడు.

తరువాత అమెరికా మెసాచూసెట్స్ రాష్ట్రంలో వోర్సెస్టర్‌లోని క్లార్క్ విశ్వవిద్యాలయంలో ఉపన్యాసా లివ్వడానికిగాను వీరిద్దరూ ఒకేఓడమీద అట్లాంటిక్ సముద్రంమీద ప్రయాణంచేస్తూ మనస్తత్త్వశాస్త్రసమస్యలనుగురించి దీర్ఘంగా చర్చించుకున్నారు. తాము సేకరించిన స్వప్నాలను పరస్పరం వివేచించి వివరించుకున్నారు. యూంగ్ తన వైజ్ఞానికపుత్రుడనీ, వారసుడనీ ఫ్రాయిడ్ పేర్కొన్నాడు. కాని, అచిరకాలంలోనే ఈ సామరస్యకాలం అంతమైపోయింది. యూంగ్ 1912 లో మ్యూనిక్‌లో మానసికవివేచన విజ్ఞానాన్ని గురించి వ్రాస్తూ, దానికి జనకుడైన పరిశోధకుని పేరైనా ఉటంకించనందుకు ఫ్రాయిడ్ తీవ్రంగా మందలించాడు. ఈ వివాదంలో మతస్థాపకుడైన ఈజిప్టు చక్రవర్తి నాల్గవ ఏమెన్‌హోటప్ ఉపమానప్రసక్తి వచ్చింది. "అతడు తన రాజ్యంలోని ప్రాచీననిర్మాణాలలో తన తండ్రి పేరు ఎక్కడఉన్నా వెదికి వెదికి చెక్కించివేశాడట!" అన్నాడు సర్మగర్భంగా ఫ్రాయిడ్. "ఔను. ఆమాటతో ఎవరూ ఎమెన్‌హోటప్‌ను త్రోసివేయలేరు. అతడు మహాప్రజ్ఞాన్వితుడు, మహోదారుడు, విశిష్ట వ్యక్తిత్వంగలవాడు. అందువల్ల అతనిజీవితంలో ప్రధానమైన అంశం తండ్రి పేర్లు చెక్కించివేయడం కాజాలదు." ఆపైన ఫ్రాయిడ్ ఎన్నడు యూంగ్‌తో సమాధానపడలేదు. "పరోక్షంగా ఆయన నాపై దాడి

* జూరిక్‌లోని ఒక వివేచకుడు ఒక క్రొత్త చికిత్స చేయవలసివచ్చింది. అతడు మనోదౌర్బల్యం తీవ్రమై సైకోసిస్ అనే వ్యాధిలోకి సంక్రమించే స్థితిలో ఉన్నాడు. ఆ స్థితిలో మనోవివేచన ప్రారంభిస్తే అతడికి వెంటనే ఆ వ్యాధి పోకవచ్చునని భయపడి ఆ వివేచకుడు తన గురువైన యూంగ్‌ను సలహా అడిగాడు. ఆ గురువు, లక్షణాలన్నీ విని, "రోగి అమెరికా దేశస్థుడేనా? పశ్చిమమధ్యప్రాంతం వాడేనా?" అని ప్రశ్నించాడు. శిష్యుడు ఔనని సమాధానం చెప్పగానే, "అయితే భయపడవలసిన పనిలేదు. ఈ రోగి యూరప్‌ఖండవాసి అయితే నిజంగా ప్రమాదకరమైన స్థితే" అన్నాడు.

చేస్తూనే ఉండేవాడు, నేను తండ్రి పేరును—అనగా తన పేరును— చెరిపించివేసిన పాతకుడనని నన్ను తెగనాడుతూనే ఉండేవాడు," అని యూంగ్ వ్రాశాడు.

విషయవాసన ప్రభావంగా లైంగిక ప్రేరణే అన్న ఫ్రాయిడ్ వాదాన్ని యూంగ్ ప్రతిఘటించినప్పుడు, ఫ్రాయిడ్ అది తనపైన బహిరంగమైన తిరుగుబాటుగా భావించాడు. 1913 నాటికి "ఆ అసంబద్ధధోరణిని వదలనిదే నేనాయనతో కలసి పనిచేయజాలనని ఫ్రాయిడ్‌కి తెలియజేశాను," అని యూంగ్ వ్రాశాడు. "మేము ఉభయులం తిరిగి కలుసుకోవలసిన అగత్యం లేదు అనే నిశ్చయానికివచ్చి పరస్పరం సెలవు పుచ్చుకున్నాం," అన్నాడు ఫ్రాయిడ్.

## రసవాద పరిశోధన

మనోవ్యాధి నివారణరంగంలోనే కాక, నాజీ జర్మనీ సమస్యల విషయంలో కూడా యూంగ్ పేరు వివాదగ్రస్తమయింది. జాతినిగురించి యూంగ్ వ్రాసిన విషయాలను కొందరు జాతీయాధిక్యవాద ప్రచారానికి వినియోగించుకున్నారు. జర్మని నాజీల పాలనలో ఉన్న రోజులలో యూంగ్ ఒక జర్మని మనోవివేచన విజ్ఞాన పత్రికకు సంపాదకుడుగా పనిచేయడంవల్ల (ఒక సమయంలో ఈయనవద్ద పనిచేసిన సహాయసంపాదకుడు హెర్మన్ గోయరింగ్ బంధువు) ఆయనకు నాజీలపట్ల సానుభూతి ఉన్నదని విమర్శలు చెలరేగినవి. వాస్తవానికి జర్మనీ దేశంలోని మనోవ్యాధి నివారణ విజ్ఞానాన్ని తనకు చేతనైనంతవరకు కాపాడవలెననే ఆశయంతో, కేవలం విదేశీయుడుగానే తానా పదవిని స్వీకరించినట్టు అనంతరం యూంగ్ వివరించాడు.

యుద్ధం ప్రారంభమయిన తరువాత యూంగ్ స్వదేశమైన స్విట్జర్లెండులోనే జ్యూరిక్ సరోవర తీరాన కొద్దిమంది మనోరుగ్ణతలకు చికిత్స చేస్తూ కాలక్షేపం చేస్తున్నాడు. అయితే, అంతకన్న పెద్దరోగి అయిన ఈ ప్రపంచపు జటిలసమస్యలలో ఆయన శ్రద్ధ నేటికీ అకుంఠితంగానే ఉన్నది. గ్రంథరచన ఆయన నేటికీ అవిరళంగా కొనసాగిస్తున్నాడు. తన పూర్వాభిప్రాయాలను నూతన పరిశోధనల ఫలితాలను అనుసరించి సంస్కరించుకొంటున్నాడు. తన పరిశోధనావరణం ఇంకా విస్తృతం చేసుకుంటున్నాడు. మధ్యయుగాల రసవాదాన్ని గురించి ఆయన పరిశోధించాడు. ఆ కృత్రిమ రసాయన ప్రక్రియలలో ఆయనకు విశ్వాసము ఉండికాదు. ఇతర లోహాలను బంగారంగా తయారుచేయగల సువర్ణయోగాన్ని, అమృతయోగాన్ని కనిపెట్టవలెననే నాటి రసవాదుల గాఢవాంఛ మన తత్త్వశాస్త్ర పరిశోధనలకు ఉపకరించగలదని ఆయన నమ్మకం. యూరప్‌లో వీరి ప్రయత్నాలు మధ్యయుగపు మతవ్యవస్థతో సంబంధం లేకుండా స్వతంత్రంగా నూతన మతానుభవాలకోసం చేసిన అన్వేషణ లని ఆయన భావన.

యూంగ్‌వద్ద మనోవికార వ్యాధుల చికిత్సకు వచ్చే రోగులలో అధిక సంఖ్యాకులు స్త్రీలు. అందువల్ల ఆధునిక ప్రపంచవ్యవస్థలో స్త్రీ స్థానాన్ని గురించి ఆయన కొన్ని విలక్షణమైన అభిప్రాయాలు ప్రకటించాడు. ఆమె (ఇతడే నా యజమాని) అనే ధోరణిలో వివాహమాడే పాతకాలపు ధర్మానికి తిలోదకా లిస్తున్నదని ఆయన అభిప్రాయం. వివాహవిచ్ఛిత్తికి సామాన్యంగా పురుషుడే కారకుడని పూర్వకాలపు మాటకు నేడు విలువలేదు: "పురుషులలో స్త్రీలను చేరబట్టే వీరులు, వారితో యుద్ధంచేసి ఆ స్త్రీలను రక్షించే వీరులు నేడు నాటకాలలోను, సినిమా తెరలపైన తప్ప వాస్తవ జగత్తులో ఎక్కడా కనిపించరు. మానవునిలో స్వసుఖకాంక్ష మున్నెన్నడు లేనంతగా నేడు పెరిగింది......మేడలపైకి ఎగబ్రాకడానికి ద్వంద్వయుద్ధాలు చేయడానికి అవసరమైన అతిశయశక్తి నేడతనికి లేదు." ఇక స్త్రీలు భర్తలను ఎన్నుకొనడంలో "నిశ్చల సంకల్ప బలంతో చల్లగా అద్భుతంగా పనిచేసే అపూర్వ పద్ధతులను అనుసరిస్తున్నారు," అంటాడు. ఈ విధంగా పురుషులు స్త్రీలు క్రమంగా సంప్రదాయ సిద్ధంగా తమకు సహజమని చెప్పబడే గుణాలను వదలి, ఒండొరుల గుణాలను అలవరచుకుంటూ ఉండడంవలన, వారి మధ్య సమానభాగస్వామ్యంతో కూడిన నవీన సంబంధం ఏర్పడగలదని ఆయన జోస్యం.

ఇటీవలే ఇంగ్లండులో ప్రకటితమయిన 'Answer to Job' అనే గ్రంథంలో ఈయన, 1950 లో వర్జిన్ మేరీ స్వర్గారోహణాన్ని గురించి పోప్ చేసిన ప్రకటన—యూరప్ చరిత్రలో మతసంస్కరణోద్యమం తరువాత జరిగిన — అత్యద్భుతసంఘటన అని అభివర్ణించాడు. ఈ పోప్ ప్రకటన చరిత్రాత్మకంగాను, మన తత్త్వ విజ్ఞానం దృష్ట్యాను చాలా అవసరమైనదని, రోమన్ కాథలిక్ స్త్రీలంతా (బుద్ధిపూర్వకంగా కాకపోయినా) స్వర్గంలో తమకు ప్రాతినిధ్యం కావాలని కోరుతూండడమే తన ఈ అభిప్రాయానికి హేతువనీ ఆయన వివరించాడు.

## ఫ్రాయిడ్ అనుచరుల భయాలు

నేడు యూంగ్ పలుకుబడి అత్యుచ్చస్థాయిలో ఉంది. ఫ్రాయిడ్ అనుచరులలో మనస్తత్త్వశాస్త్రీయ సత్యాలన్నింటికీ తామే ధర్మకర్తలమనే విశ్వాసం ఉన్నవారు తమ విశ్వాసాలప్రచారంకోసం, తమ ప్రతిష్ఠకోసం ఎలాగైనా ఇతరులను తమలో చేర్చుకొనడానికి మతప్రచారకులవలె పట్టుదలతో ప్రచారం చేశారు. యూంగ్ అలాంటివేమీ చేయలేదు సరికదా, తన సిద్ధాంతాలను అనుసరింపగోరే మనస్తత్త్వవివేచకుల కొరకు సమగ్రశిక్షణకేంద్రాన్ని స్థాపించే ప్రయత్నం కూడా ఆయన చేయలేదు. ఈ మతప్రచారకపద్ధతులు వారి అజ్ఞాతమనస్సులలోని సంశయాలకు సంకేతాలని ఆయన నిశ్చయం. 1948 నాటికి గాని జూరిక్‌లో సి. జి. యూంగ్ శిక్షణాలయం ఏర్పడలేదు. ఈ సంస్థకు కూడా, తన పేరు పెట్టుకొనడానికి సమ్మతించడమే ఆయన చేసినమహాసహాయం. ప్రస్తుతమీ విద్యాలయంలో ఇండియా, అమెరికా, డెన్మార్క్, ఇంగ్లండ్ మున్నగు 14 దేశాలనుండి వచ్చిన 100 మంది శిక్షణ పొందుతున్నారు. ఇదిగాక లండన్, న్యూయార్క్, శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్ ఏంజెలెస్ మున్నగు నగరాలు ప్రపంచంలో యూంగ్ పలుకుబడికి చిహ్నాలైన ఇతరకేంద్రాలు. ఈ కేంద్రాలన్నిటిలో యూంగ్‌వద్దగాని, ఆయన ప్రథమశిష్యులవద్దగాని శిక్షణపొందిన మనస్తత్త్వవివేచకులు చాలామంది ఉన్నారు. శాన్‌ఫ్రాన్సిస్కోలో చిన్నశిక్షణకేంద్రమొకటి ఉన్నది. లాస్ ఏంజెలెస్‌లో అలాంటిదొకటి త్వరలో ఏర్పడబోతూంది.

యూంగ్‌పట్ల భక్తిగల అమెరికా దేశస్థుడు పాల్ మెల్లన్ ఏర్పాటుచేసిన బోలింజెన్ సంస్థవారు (బోలింజన్ జూరిక్ సరోవరతీరాన యూంగ్ నివసిస్తూన్న పట్టణం పేరు) ఈయన రచనలన్నింటిని సమగ్రంగా సేకరించి సంపుటాలుగా ప్రకటిస్తున్నారు.

మనోవ్యాధి చికిత్సారంగంలో యూంగ్ పలుకుబడిని కొందరు తరచు ప్రత్యక్షంగా ఆమోదించకపోయినా, ఫ్రాయిడ్ అనుచరులలో ప్రముఖుడైన ఎ. ఎ. బ్రిల్ ఈయనను "మనోవ్యాధి చికిత్సాశాస్త్రానికి మూలపురుషుడు" అని ప్రశంసించాడు. ఆవేశంవలన కలిగే లఘు మానసికవికారాలను నివారించడానికిమాత్రమే మనస్తత్త్వవివేచనం ఉపయోగపడగలదని ఫ్రాయిడ్ భావించాడు. ప్రమాదకరమైన ఉన్మాదాలలో ఒకటైన స్కిజోఫ్రేనియా అనే మానసికవ్యాధిని మొట్టమొదట మనోవివేచనవలన వివరించినవాడు యూంగే.

## సహజముఖ ప్రదర్శన

యూంగ్‌సిద్ధాంతాలకు వాటి ప్రత్యక్షప్రయోజనాలనుబట్టి విలువలు కట్టడానికి వీలులేదు. ఆయన మనస్తత్త్వశాస్త్రానికి నూతనపంథా చూపాడు. ఇదే ఆయన సాధించిన మహోత్కృష్టమైన విజయం. అజ్ఞాతదుర్గము, ఆధ్యాత్మికజగత్తుల పరిశోధింపగోరే మానవులకు ఆయన నవీన మనస్తత్త్వశాస్త్రం సృజించాడు. మానసికంగా ఏదో సమాధానం చెప్పుకుని సరిపెట్టుకోవాలనే లక్ష్యాన్ని ఆయన ఖండించాడు. "ఇది పరాజితులకు, ఇంకా ఏవిధంగాను స్థిరపడనివారికీ" మనోహరంగానే కనిపించవచ్చు. అన్యులకు మాత్రం ఇది కేవలం చిత్రహింసగా, దుస్సహమైన అశాంతిగా, నరకయాతనగా, నిష్ఠుర నిరాశావాదంగా" అనుభూతం అవుతూంది అన్నాడు. యూంగ్ సిద్ధాంతాలు అర్థసత్యాలే అన్నా, యూంగ్ మానవజాతికి ఒక విధమైన సమాధాన మార్గాన్ని సూచించాడు. ప్రతివ్యక్తి కేవలం తన అంతరంగిక ప్రవృత్తులతోను, సాంఘికమైన ఒత్తిడులతోను సమాధానపడాలని కాదు; తనలోని భిన్న భిన్న ప్రవృత్తులతోను, తన శాశ్వత మతావసరాలతోను సమాధానమని ఆయన సూచన.

ఆ పాతఇంట్లో, చుట్టూ పందొమ్మిది మనుమలతో, ఇద్దరు మునిమనుమలతో సుఖంగా కాలం గడుపుతూన్న ఈ జ్ఞానవయోవృద్ధుడు తన అనుచరులందరికీ తన సిద్ధాంతాల నిరూపణకు తన జీవితాన్నే నిదర్శనంగా చూపుతున్నట్లు కనిపిస్తుంది. "యూంగ్ స్వయంగా వ్యక్తిత్వ నిరూపణ చేసుకోగలిగాడా?" అన్న ప్రశ్నకు యూంగ్ జవాబు ఇది: "ఏ వ్యక్తి ఏమి సాధించవలెనో దానిని అతడు సాధించడమే వ్యక్తిత్వనిరూపణ. 'నీ స్వతస్సిద్ధమైన ముఖం చూపు!' అని జెన్ బౌద్ధసాహిత్యంలోని ఒక సూక్తి. నేను నా సహజముఖాన్నే సదా ప్రదర్శించాననుకొంటాను. అదే బహుశః అప్పుడప్పుడు అకాలికమై ఆందోళనకరంగా కూడా పరిణమించింది. ఔను! నేను వ్యక్తిత్వ నిరూపణ చేసుకొన్నాను. అది నా అదృష్టం! లేకపోతే నేను ఎన్నో మనోరుగ్మతలతో బాధపడుతూ ఉండవలసింది."

# కీర్తిధర మాతృగుప్తుల నాట్యశాస్త్రములు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

## : కీర్తిధరుడు :

కోహల, మతంగులవలె కీర్తిధరుడు గూడ నాట్యశాస్త్ర కర్తలలో నొకడు. కీర్తిధరుడు పఠించిన భరతగ్రంథమునకు అభినవుడు పఠించిన శాస్త్రమునకు గూడ భేదములు చాల కన్పించుచున్నవి. భరతుని గ్రంథమునకు రెండుపాఠములు గలవని చెప్పితిని. ఇందు నవ్యపాఠముతో గన్పించు విస్తృతగ్రంథమును కీర్తిధరుడు పఠించెను.

నందికేశ్వరమతము ననుసరించి చిత్రపూర్వరంగమున నొక విధానము నైదవ అధ్యాయమున కీర్తిధరుడే జేర్చె నని చెప్పుట కభినవుడు కొంత ఆధారము నిచ్చినాడు. ధ్రువాగానములోని అష్టాదశజాతి వినియోగములను ఇరువదియెన్మిదవ అధ్యాయములో కీర్తిధరుడొక్కడే పఠించినాడు. ముప్పదవఅధ్యాయమున మొదటిశ్లోకమైన తరువాత:

"నవవంశా స్తు విజ్ఞేయా స్త్రిస్థాన స్వరగోచరాః
తేషాం చైవ హి వర్ణానాం స్థానే స్థానే త్రికత్రయమ్"

అను శ్లోకమును ర్తిధరుడు సృష్టించినట్లున్నాడు. తొమ్మిది రకములు వంశముల నేఇతడు గ్రహించిచాడు. కాని ఇతరులు పదునాల్గింటిని స్వీకరించినారు. నిషధ హస్తమును :

"శిఖరస్తు యదా హస్తో మృగశీర్షేణ పీడితః
నిషధో నామ విజ్ఞేయః సభయార్తే విధీయతే"

అని నిర్వచించి, అభినవుని నిషధహస్త నిర్వచనమును వర్ధమాన హస్తపరముగా కీర్తిధరు డిచ్చినాడు. అభినవుడంగీకరించని కరవర్తనలనుగూడ వివరించియున్నాడు.

"'చిత్రాభినయేన బాల్యేన కరణప్రయోగ ఏవాభినేయపదాదీనాం చ నాట్యేఽపిసక్తౌతి నాట్యమేవ వేదమితి కీర్తిధరాచార్యః"

(అ. భా. I 208.)

అని కీర్తిధరుని వాదము నుదహరించిన అభినవగుప్తుడు నాట్యవేదశబ్దమును వ్యాఖ్యానించెను. కాని చిత్రపూర్వరంగావసరమున కీర్తిధరుని ప్రామాణికునిగా గ్రహించినట్లు కన్పించదు.

"అనంతరంతు యాని బహిర్గీతాని కాంగాని, తేషామస్మాభిః పంచమేఽధ్యాయే యథా స్వాగమం ప్రదర్శితమ్, యత్కీర్తిధరేణ నందికేశ్వరమత మతాగమిత్యేవ దర్శితం, తదస్మాభిః సాక్షాన్న దృష్టమ్. తత్ప్రత్యయాత్తు లిఖ్యతే సంక్షేపతః"

(ప్రాతప్రతి IV 50)

అని చెప్పి చివరకు

"ఏవం నందికేశ్వరమతానుసారేణాయం
చిత్రపూర్వరంగ పూర్వవిధి రితి నబద్ధః"(IV. 54)

అని నాడు.

వర్ధమాన హస్తావసరమున;

"సంగ్రహాపరిగ్రహోద్ధారణం చ సమయం చ సత్త్వవదనం చ
సంక్షేపః సంక్షిప్తం నిపీడితేనాభినేతవ్యమ్"

అను వినియోగము నొకదానిని కీర్తిధరుడు కల్పించెనో నితంబాది హస్తనిరూపణములలో అభినవాదులు పతాకాహస్తములను గ్రహించగా, కీర్తిధరుడు త్రిపతాకాహస్తములను చెప్పియున్నాడు. కరిహస్తలక్షణావసరమున "కరిహస్తౌ ప్రకీర్తితౌ" అని ! ధరుడు పఠించి యుండుటచే:

"త్రిపతాకోఽపరః కర్ణే కరిహస్తః ప్రకీర్తితః"

అను పంక్తికి బదులు

"ద్వితీయః ఖటకాఖ్య శ్చ కరిహస్తౌ ప్రకీర్తితౌ"

అని కీర్తిధరుని పాఠము గలదనవలెను. కాని ఈ పాఠము నభినవుడు దూషించి, నిరసించినాడు. కీర్తిధరుడు పార్శ్వమండల హస్తములకు కటివర్తనను విధించెనట. ముష్టిక స్వస్తికములయందు కుంచితముష్టిహస్తమును, రెండవ చేతిని అంచిత ఖటకాముఖముగాను జూపి, వీటితో ఖడ్గవర్తనను చెప్పినాడు. ఇట్లే పద్మకోశములయందు గూడ భిన్నవ్యాఖ్యచేసి పఠించినాడు.

అడ్డితాచారీ విధానమున "అగ్రతః పృష్ఠతో వాపి" అనుటకు బదులు "పృష్ఠతోవాపి" అను మాటలను కీర్తిధరుడు నిషేధించెను. జనితాచారిలో ముసలఘాటికావర్తనను చెప్పినాడు. అతిక్రాంతాచారిలో పార్శ్వమున పాదమును పడవేయవలెనని, ఈ పాదము మడమను బాగుగా ఘట్టించివేయవలెనని వచించినాడు. అపక్రాంతాచారిలో విక్షేపవలితమును చదివినాడు.

పన్నెండవ అధ్యాయమున కీర్తిధరుని పాఠము విశేషభేదములతో కన్పించుచున్నది. పదమూడవ అధ్యాయమున ప్రవృత్తులను చెప్పిన తర్వాత ధర్మిద్వయ వివరణ మనకు నేడు లభించు గ్రంథమునగలదు. కాని ఆరవ అధ్యాయములోని సంగ్రహ శ్లోకములోని క్రమము ననుసరించి కీర్తిధరుడు ధర్మిద్వయానంతరము ప్రవృత్తులను పఠించినాడు. ఆర్యావృత్తములను నిర్వచించు వేళ:

"అసాంతు సంప్రవక్ష్యామి యతి మాత్ర వికల్పనమ్
లక్షణం నియమంచైవ వికల్ప గుణ సంశ్రయమ్
యతిభేదస్తు విజ్ఞేయ శ్చతుర్మాత్రో గణఃస్మృతః
ద్వితీయాంత్యౌ యుజౌ పాదా వయుజౌ త్వ పరౌ స్మృతౌ
గురుమధ్య విహీనస్తు చతుర్గుణ సమన్వితః
అయుగ్గణో విధాతవ్యో యుగ్గణస్తు యథేప్సితః"

అను యతిమాత్ర వికల్పస్వరూపవిషయక భాగమును కీర్తిధరుడే పఠించియుండుటచే అభినవుడు భరత కృతములు గావని వీటిని త్రోసివేసినాడు.

వీటినిబట్టి కీర్తిధరునకు లభించిన నాట్యశాస్త్రములో కొన్ని విశేషములు కలవని, కీర్తిధరుడుగూడ కొంతభాగమును రచించి మూలములోనికి జొప్పించినాడని, లేదా కీర్తిధరుడు స్వతంత్రముగా నాట్యశాస్త్రము నొకదానిని రచించెనని చెప్పవీలగుచున్నది. ఈ కీర్తిధరుడు వర్తనములను, చాలకములను గూడ చెప్పినాడని వెనుక ప్రస్తుతించితిని. ఇతని కారికలు గూడ కొన్ని మన నాట్యశాస్త్రములో గలవు.

## : మాతృగుప్తుడు :

కోహల, కీర్తిధరాదులేగాక, మాతృగుప్తుడు గూడ నాట్యశాస్త్రమును గాని లేక ముఖ్యముగా దశరూపకప్రకరణమునుగాని రచించె నని చెప్ప వీలగుచున్నది.

"పూర్వవృత్తాశ్రయ మపి కించి దుత్పాద్యవస్తు చ
విధేయం నాటక మితి మాతృగుప్తేన భాషితమ్"
(పే. 234)

అని రాఘవభట్టు అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యానావసరమున పలికినాడు. ప్రసిద్ధ మగు ఇతివృత్తము నేగాక ఉత్పాద్యవస్తువును సహితముకని స్వీకరించవచ్చునని ఇచట చెప్పబడినది. మరియొకచోట:

"సూత్రధారలక్షణం యథా మాతృగుప్తాచార్యైరుక్తం—
'చతురాతోద్యనిష్ణాతో ఽనేకభూషా సమావృతః
నానాభాషణ తత్త్వజ్ఞో నీతిశాస్త్రార్థ తత్త్వవిత్
వేశ్యోపచార చతురః పారేషణ విచక్షణః
నానాగతి ప్రచారజ్ఞో రసభావవిశారదః
నాట్యప్రయోగనిపుణో నానాశిల్పకలాన్వితః
ఛందోవిధాన తత్త్వజ్ఞః సర్వశాస్త్రవిచక్షణః
తత్తద్గీతానుగ లయకలాతాలావధారణః
అవధాయ ప్రయోక్తా చ యోక్తౄణాముపదేశకః
ఏవం గుణగణోపేతః సూత్రధారోఽభిధీయతే'"
(అ. శా. 5)

అని రాఘవభట్టు ఇతనికారికల నుదహరించినాడు. సూత్రధారలక్షణములనుగూర్చి చెప్పు ఈ శ్లోకములు భరతునిశ్లోకములకు చాల సన్నిహితములుగా కన్పించుచున్నవి.

"ఉక్తంచ మాతృగుప్తాచార్యైః—
'ప్రాక్ప్రతీచీభువోః సింధ్వోర్హిమవద్వింధ్య శైలయోః
అంతరావస్థితం దేశ మార్యావర్తం విదుర్బుధాః
ఆర్యావర్త ప్రసూతేసు సర్వాస్వేవ హి జాతిషు
శౌరసేనీం సమాశ్రిత్య భాషాం కావ్యే ప్రయోజయేత్' ఇతి" (పే. 8).

అని చెప్పినపుడు మాతృగుప్తుడు వృత్తులను, ప్రవృత్తులను గూడ వివరించినట్లు కన్పట్టును:

"తల్లక్షణముక్తం మాతృగుప్తాచార్యైః—
'ప్రఖ్యాత వస్తు విషయం ధీరోదాత్తాది నాయకమ్
రాజర్షి వంశ చరితం తథా దివ్యాశ్రయాన్వితమ్
యుక్తం వృద్ధివిలాసాద్యై ర్గుణైర్నానా విభూతిభిః
శృంగార వీరాన్యతర ప్రధాన రస సంశ్రయమ్
ప్రకృత్యవస్థా సంధ్యంగ సంధ్యంతర విభూషణైః

పతాకాస్థాన కైర్వృత్తం తదంగైశ్చ ప్రవృత్తిభిః
నాట్యాలంకరణై ర్నానాభాషాయుక్త్యాత్ర సంచయైః
అంక ప్రవేశకై రాఢ్యం రసభావసముజ్జ్వలమ్
సుఖ దుఃఖోత్పత్తి కృతం చరితం యచ్చ భూభృతామ్
ఇతివృత్తం కథోద్భూతం కించిదుత్పాద్య వస్తు చ
నాటకం నామ తద్జ్ఞేయం రూపకం నాట్యవేదిభిః' ఇతి" (పే. 9).

ఈ శ్లోకములు నాటక లక్షణములకు చెందినవి. ఇవి భరతుని వాక్యములకు వివరణములవంటివని వేరుగా జెప్పనక్కరలేదు. శాకుంతల వ్యాఖ్యలో నింకొక చోట:

"మాతృగుప్తాచార్యైశ్చ—
'సంమతానాం దేవతానాం రాజన్యామాత్య సైనికే
వణిజ్మాగధ సూతానాం పాఠ్యంయోజ్యంతు సంస్కృతిమ్' ఇతి" (పే. 15)

అని గలదు. ఇచట భాషా విషయకమగు ఔచిత్యమును మాతృగుప్తుడు విధించుచున్నాడు.

"తదుక్తం మాతృగుప్తాచార్యైః—
'రసాస్తు త్రివిధా వాచిక నేపథ్య స్వభావజాః,
రసానురూపై రాలాపైః శ్లోకై ర్వాక్యైః పదై స్తథా
నానాలంకార సంయుక్తై ర్వాచికో రసఉచ్యతే.
కర్మరూపవయోజాతి దేశకాలానువర్తిభిః
మాల్యభూషణ వస్త్రాద్యై ర్నేపథ్యరస ఉచ్యతే.
రూపయౌవన లావణ్య స్థైర్య ధైర్యాదిభి ర్గుణైః
రసః స్వాభావికో జ్ఞేయః స చ నాట్యే ప్రశస్యతే' ఇతి." (పే. 7)

వాచికరసము, నేపథ్యరసము, స్వాభావిక రసము అని మూడువిధముల రసములు గలవని ఒక క్రొత్తవాదమును మాతృగుప్తుడు లేవదీసినాడు. ఇట్టి వాదము భరతునకు పూర్వమే గలదనుటకు కొంత ఆధారముగలదు.

"తల్లక్షణం మాతృగుప్తాచార్యై రుక్తం—
'గృహకక్ష్యా విచారిణ్య స్తథోపవన సంచరాః
యామేషు చ నియుక్తానాం యామశుద్ధి విశారదాః
సంచారికా స్తు తాజ్ఞేయా యవన్యోఽపి మతాః క్వచిత్' ఇతి" (పే. 57)

అని యవనీలక్షణమును మాతృగుప్తు డిచ్చినాడు

"సేనాపతి లక్షణ ముక్తం మాతృగుప్తాచార్యైః—
'శీలవాన్ సత్త్వసంపన్నః స్వక్తాలస్యః ప్రియంవదః
పర రంధ్రాంతరాభిజ్ఞో యాత్రా కాలవిశేషవిత్
అస్త్ర శాస్త్రాదితత్త్వజ్ఞో లోకేచావక్రతాం గతః
దేశవిత్కాలవి చ్చైవ భవేత్సేనాపతిర్గుణైః' ఇతి" (పే. 62)

అని సేనాపతి లక్షణము నిచ్చినాడు.

"తల్లక్షణం మాతృగుప్తే—
'వికసిత కపోలాంత ముత్ఫుల్లానుఁలోచనమ్
కించిల్లక్షిత దంతాగ్రం హసితం తద్విదో విదుః'
ఇతి" (పే 74)

అని హసితలక్షణము భరతానుసారమే కన్పించుచున్నది.

"యదుక్తం తత్రైవ
'ఉత్తమస్య సముద్దిష్టం స్మితం హసితమేవ చ'
ఇతి" (పే 74)

ఈ స్మితహసితముల విభాగము కూడ భరతునిలో గలదు.

"ఏషాం స్థానమప్యుక్తం మాతృగుప్తాచార్యైః—
'ముఖే ప్రతిముఖే గర్భే విమర్శే చ చతుర్ష్వపి
భేదాః సంధిషు కర్తవ్యాః పతాకాస్థానకస్య తు'
ఇతి" (పే 110)

అని పతాకాస్థానకములు విధింపబడినవి.

"తల్లక్షణముక్తం మాతృగుప్తాచార్యైః—
'అర్థోపక్షేపణం యత్ర నగూఢం సవినయంభవేత్
శ్లిష్ట ప్రత్యుత్తరోపేతం తృతీయం తన్మతం తథా'
ఇతి" (పే 123, 151)

అని తృతీయ పతాకస్థానము మాతృగుప్తునిచే నిర్వచింపబడినది.

"ఉక్తంచ మాతృగుప్తాచార్యైః—
'యోజ్యం విదూషకోన్మత్త బాలతాపసయోషితామ్
నీచానాం షండకానాంచ నీచగ్రహవికారిణామ్
విద్వద్భిః ప్రాకృతం కార్యం కారణాత్సంస్కృతం క్వచిత్' ఇతి" (పే 126)

అని భాషౌచిత్య విధిగలదు.

"ప్రతీహారీ లక్షణం మాతృగుప్తాచార్యై రుక్తం-

'సంధివిగ్రహసంబద్ధం నానాకార్య సముత్థితమ్
నివేదయంతి యాః కార్యం ప్రతీహార్యస్తుతాః
స్మృతాః' ఇతి" (పే 156)

ఇచట ప్రతీహారీ లక్షణ మీయబడినది. మరియొక చోట:

"పరిచారికా లక్షణం మాతృగుప్తాచార్యై రుక్తం-
'సంవాహనే చ గంధే చ తథా చైవ ప్రసాధనే
భూషణాభరణ సంయోగమాల్యసంగ్రంథనేషు చ
విజ్ఞేయా నామతః సా తు నృపతేః పరిచారికా' ఇతి"
(పే.199)

అని పరిచారికా లక్షణమును,

"తల్లక్షణం మాతృగుప్తాచార్యై రుక్తం—
'యదాధికారికం వస్తు సమ్యక్ప్రాజ్ఞైః ప్రయుజ్యతే
తదర్థో యః సమారంభ స్తత్కార్యం కథ్యతే ఇతి
అభిప్రేతం సమర్థంచ ప్రతిరూపం క్రియాఫలమ్
ఇతి వృత్తం భవేద్యస్మిన్ ఫలయోగః స ఉచ్యతే'
ఇతి" (పే. 230)

అని ఫలయోగనిర్వచనమును గావించెనని రాఘవభట్టు చెప్పుచున్నాడు.

"తత్రవిశేషో మాతృగుప్తాచార్యైరుక్తః—
'క్వచిత్కారణమాత్రం తు క్వచిచ్చ ఫలదర్శనమ్
క్వచి దారంభమాత్రం తు ఫలముక్త్వా క్రియా క్వచిత్
వ్యాపార శ్చ విశేషోక్తః క్వచి ద్వా ఫలసాధకః
బహుధా రూపకే ష్వేవం బీజరూపేణ దృశ్యతే
ఫలే యస్య హి సంహారః ఫలబీజం తు తద్భవేత్
వస్తుబీజం కథాజ్ఞేయా అర్థబీజంతు నాయకః' ఇతి"
(పే. 15)

ఈ బీజవివరణమున మాతృగుప్తుడు విశేషములను పెల్లగించి, వివరించినాడని ఇచట చెప్పబడుచున్నది. ఫలబీజము, వస్తుబీజము మొదలైనవి మన కపరిచితములే. కాని అవి గూడ స్పృశింపబడుట విచిత్రమే.

"తల్లక్షణం మాతృగుప్తాచార్యైరుక్తం—
'ఉపమాద్యైర లంకారై ర్గుణైః శ్లేషాదిభి స్తథా
రత్నాద్యైర్బహుభి ర్యుక్తం భూషణైరివ భూషణమ్' ఇతి" (పే. 20)

అని భూషణ మనబడు లక్షణము వివరింపబడినది.

"ఉక్తం మాతృగుప్తాచార్యైః—
'స్వప్నో దూతశ్చ లేఖశ్చ నేపథ్యోక్తి స్తథైవ చ
ఆకాశవచనం చేతి జ్ఞేయా హ్యంతరసంధయః'
ఇతి" (పే. 20)

అని అంతరసంధులను మాతృగుప్తుడు ప్రపంచించియున్నాడు.

భరతుని గ్రంథమున సామాన్యాభినయము, ఆహార్యము, ప్రకృతివిధానము అని మొదలుగాగల అధ్యాయములు విస్తృతముగా నవ్యపాఠమున, సంక్షేపరూపమున ప్రాచీన పాఠమున గలవు. విస్తృతముగా కన్పించుపాఠములో పాఠభేదములు, ప్రక్షిప్తములు విరివిగా కన్పించుచున్నవి. ఈ భాగములను పైన ఈయబడిన మాతృగుప్తుని కారికలతో పోల్చి చూచుకొని మాతృగుప్తాదులు చెప్పిన కారికలలో కొన్ని భరతుని గ్రంథములోనికి ప్రవేశించినవా? యను సంశయ ముత్పన్నము కాగలదు. పైగా నేను లభించు భరతగ్రంథంలోని విషయమునకంటె ప్రాచీన మగు రసత్రైవిధ్యమును మాతృగుప్తు డంగీకరించెనని చెప్పితిని. ఈ విషయమును గమనించితి మేని పై సంశయము మిక్కుటము కాగలదు.

# సాక్షి

ఆల్బర్టో మొరేవియా

ముందు ముందు మనవంతా కూడా యజమానులమై కూర్చుంటామనీ, నౌకర్లనేవాళ్లు అసలు ఇక వుండరనీ అంటారు. పరాయివాళ్ళ యిళ్లల్లో నౌకరీ వట్టి బానిసఖాన్ వృత్తి అనీ, నిజంగా మనిషిగా బ్రతుకదలచిన వాడికి యిది లాయికీ అయిన పనిగాదనీ, మనిషిని గౌరవహీనుణ్ణిగా చేసిపారేస్తుందనీ చెబుతున్నారు. ముందు ముందు ఒకడిక్రింద ఒకడు పనిచేయటమంటూ వుండదుట; ఎవళ్ళకు ఎన్ని పనులున్నా అవన్నీ వాళ్ళే చేసుకు బ్రతుకుతారుట—అనాది ఆటవిక దశనాటి మనుషుల్లాగా. ఈ విషయాన్ని గురించి నేను చర్చించబోవటంలేదు. మానవుడు ఎప్పుడూ ఒకేమాదిరిగా వుండడు. మనిషిలోవుండే ప్రతీ అణువూ సర్వదా మార్పును కోరుతూనే వుంటుంది; తప్పనిసరిగా మారుతుంది కూడా—మరింత అధ్వాన్నస్థితికి. ఈ మార్పునే అభివృద్ధి అని చెప్పుకుని మానవుడు సంతృప్తిపడుతూవుంటాడు. ఇంతకీ నేను చెప్పవచ్చిందేమిటంటే: ప్రతి పదిమంది మనుషుల్లోనూ యే ఒకరిద్దరో యజమానులుగా పుడతారు. మిగతావాళ్ళంతా నౌకర్లుగా పుడతారు. యజమాని పుటకబుట్టినవాడు పొత్తిళ్ళ గుడ్డల్లోనుంచీ యెదటివాళ్ళమీద ఉత్తరువులు చెలాయించటానికి ఉల్లాసపడతాడు. తక్కినవాళ్లు అలా కాదు యజమాని అనేవాడెవడో ఒకడు దొరికి వాడు తమమీద ఉత్తరువులు చలాయించేవరకూ వాళ్లు హాయిగా బ్రతకలేరు. ఏవో తాపత్రయపడి చచ్చిపోతూ వుంటారు. ఏం జేస్తాం మనుషుల పుటకలోనే అలాంటి తేడాలుంటాయి. మనం చెబుతున్న అభివృద్ధి ఎందాకా ముందుకుపోయినా ఈ యజమానులూ నౌకర్లూ అనేవాళ్లు ఎల్లకాలం వుంటూనే వుంటారు. కాకపోతే ఆ వర్గాలకు ఆ పాతపేర్లుమార్చి కొత్తపేర్లు పెడతారు. జనాన్ని మభ్యపెట్టడానికి మాటలకుండే సత్తాయేమిటో అందరికీ తెలిసిన సంగతేగదా!

ఇక నా సంగతి—నా పుటకే నౌకరుపుటక; మహాఅయితే చచ్చేనాటికి పెద్ద నౌకరుగా చస్తానేమోగాని, యేమైనా జీవితమంతా నౌకరీచేయవలసినవాణ్ణే; ఇతరులకు ఉపయోగపడటం నాకు యిష్టం. ఇతరులకు విధేయుణ్ణయి పనిచెయ్యటం నాకు హాయిగా వుంటుంది.

పరబుద్ధిమీద ఆధారపడి నడుచుకోవటంలో నాకు హాయివుంది. నిజంగా ఆలోచించితే నేను ఒకరికి ఉపయోగపడి పనిచేస్తున్నానంటే, ఆయనా నాకు ఉపయోగపడుతున్నాడన్నమాటే. అసలు యజమాని అనేవాడు లేకపోతే నౌకరు యెలా వుంటాడు. నౌకరీ లేకపోతే నేనేం చెయ్యాలి? ఇక నా గొయ్యి నేను తవ్వుకోవాలి.

అందుచేత ఆ యజమానిదగ్గిరమానుకుని ఈ యజమానిదగ్గిరా, ఈ యజమానిదగ్గిర మానుకుని యింకోరిదగ్గిరా ఇలా అనేకమందివగ్గర నౌకరిచేస్తూ కాలం గడుపుతున్నాను. ఒకరి దగ్గిర పని నచ్చక నేనే మానుకుంటే, మరొకరు నా పని నచ్చక వారే తీసెయ్యటం—ఇలా జరుగుతోంది. చివరికి 'ఫియాకొసియో' పర్వతంమీది ఒక విలాసభవనంలో నౌకరీకి కుదిరాను. ఆ నౌకరీ కొస్త వీలుగానే వుందనుకున్నాను. ఇది ఇటీవలనే నిర్మించిన భవనం. దాన్లో కొత్తగా పెళ్ళయిన ఒక మొగుడూ పెళ్లాం కాపురమున్నారు. ఆ అమ్మాయి — మిసమిసలాడుతూన్న కోలముఖం—నీలాలులా నిగనిగలాడుతూ చేరడేసి కళ్ళూ, సన్నగా, బక్కపలచగా కొంచెం బారుగా, నెపోలియన్ క్రాప్‌కట్‌తో, కుర్రాడులా వుంటుంది. ఆయన బాగా పొట్టి కురచ మనిషి బలమైన జబ్బలూ, భుజాలూ, నలుచదరపు ముఖం బ్రహ్మాండమైనబాకాగొంతూ—ఆయన సర్వఅవయవాల్లోనూ అధికారావేశం ఉట్టిపడుతూవుంటుంది. పొట్టివాళలో ఒక విచిత్రమైన స్వభావం వుంటుంది.

తమ హ్రస్వరూపాన్ని కప్పుకోవటానికి చుట్టూ వున్న వాళ్ళమీద జులుంగా తమ ఆధిక్యాన్ని స్థాపించుకోవటానికి ప్రయత్నించుతారు. ఈయన కూడా అదేరకం. ఆయన తప్పకుండా యేదో కాపు కుటుంబంలో పుట్టినవాడై వుండాలి. ఈవిషయం ఇంతరూఢిగా ఎందుకు చెప్పగలుగుతున్నానంటే ఒకనాడు ఆయనతల్లి ఆ విలాసభవనానికివచ్చి చూసి పోయింది. ఆవిణ్ణిచూసి నేను మొదట్లో, కోడిగుడ్లు తట్టలో పెట్టుకుని అమ్ముకుంటూ తిరిగే బాపతు కాపు మనిషి యెవరోననుకున్నాను. ఏది యేమైనా ఆవిడ గొప్పకుటుంబం తాలూకు మనిషేనట; ఆవిడ తండ్రి జడ్జీయో యేదో చేశాడట. నా నౌకరీ బాగా నేవుందని చెప్పాను. బాగా నేవుందంటే, బాగా నేవున్నదన్న మాటేగాని యీతిబాధలేమీ లేవనికాదు. ముఖ్యంగా మానవజాతితో సంబంధంలేని ఘోరమైన ఏకాంత వాసం. పన్నెండుమైళ్ళయీవలోపున ఊరూనాడూ ఎక్కడాలేదు ఆధ్యాత్మికచింతనాపరుడైన నాబోటి వాడికి గనుక సరిపోయిందిగాని మరొకడికైతే ఈ అరణ్యవాసం నరకప్రాయంగా వుంటుంది. ఇది బ్రహ్మాండమైన భవంతి: క్రింద అంత సంతా వంటకూ భోజనాలకు, అతిథులతో కబుర్లాడటానికి గట్రకూ అనేకగదులు; పైఅంతస్థంతా పడకగదులు, అంతకొంపకీ, తోటమాలిని లెక్కలోకి తీసుకోకపోతే ముగ్గురు నౌకర్లం—వంట మనిషి, అమ్మగారిదాసీ, మూడోవాణ్ణి నేను. ఈ యింటెడు చాకిరీ మేవుఁ ముగ్గురం సమర్థించాలి. అన్నిటికంటే పెద్ద చిక్కేమిటంటే, ఆయనగాని ఆవిడగాని యజమాని పుటక గలవాళ్ళుగాదు. వాడో మడ్డి మృగం—మడ్డి మృగాల కొడుకు, మడ్డి మృగాల మనమడు. ఆవిడ కొంచెం పెద్ద కుటుంబంలోనుంచే వచ్చినా, ఆ కుటుంబానికి డబ్బు లేదు. ఆవిడకైతే యజమానురాలననిపించుకోవాలనే అభిలాష వుంది గాని, యజమానురాలుగా నిభాయించుకోగల సహజమైన అలవాట్లు లేవు. ఇల్లాంటి విషయాల్లో సహజమైన ఆహుందాతనం లేకపోతే యేమీ లాభంలేదు. ఆయన ప్రాతఃకాల భోజనం ముగించుకోగానే, కారు వేసుకుని 'రంయ్యి'న కొండదిగి వెళ్ళిపోతాడు. మళ్ళీ చీకటి పడందే ఇక ఇంటికి జేరటమంటూ వుండదు. రోమ్ నగరంలో ఎగుమతి దిగుమతి వ్యాపారానికి సంబంధించిన ఆఫీసులేకాక యితర చీకటి వ్యాపారాలు కూడా అనేకం వుంటాయనుకుంటాను. ఆవిడకు కూడా ఒక ఫస్టు క్లాసైన కారుంది. సొంతంగానే డ్రైవు చేసుకోగలదుకూడా. కాని ఆవిడ కారు వాడటం బహు అరుదు.

ఆవిడకు పల్లెవాసమంటే యిష్టంలేకపోవటమో, అక్కడ ఆవిడకు యెరిగిన వాళ్ళెవళ్లూ లేకపోవడమో అందుకు కారణమై వుండవచ్చు. అందుచేత ఆవిడ యెప్పుడూ ఇంటికాడే వుండేది. నిక్కరూ బనియనూ వేసుకుని ఈ గదిలోనుంచి ఆ గదిలోకీ ఆగదిలోనుంచి ఈగదిలోకి అస్తమానం తిరుగుతూ వుండేది. లేకపోతే తోటలో తిరుగుతూ వుండేది. ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూవుండేది. చెయ్యాలే గాని అంతపెద్ద కొంపలో పనికేం తక్కువ. మధ్యాహ్నంపూట పడక కుర్చీలో కాళ్లు ముడుచుకు పడుకుని ఏదో ఒకటి చదువుతూవుండేది. ఆ పనీ యీ పనీ యెంత కల్పించుకుని తిరుగుతూ వున్నా, ఆవిడ మనసులో ఏదో అసంతృప్తిగా వున్నదనీ ఆ ఏకాంతవాసంతో విసుగెత్తిపోతోందనీ ఆవిడముఖం చూస్తేనే తెలిసిపోతుంది. ఒకోనాడు, పూలమొక్కలు పాతటంలోనూ, పొదరిల్లు కత్తిరించటంలోనూ నేను తోటమాలికి సాయపడుతుంటే, ఆ మొక్కలవంకా ఆ పొదలవంకా చూస్తూ నా వెనకాల నిలబడివుండేది. మరీ గుబులెక్కితే అమాంతం గుర్రం వీపుమీదకి ఎగిరి ఆ పర్వతాలవెంటా గుట్టలవెంటా అటూ ఇటూ కొంచెంసేపు స్వారీచేసి తిరిగి వచ్చేది. గుర్రంమీద వున్నా తోటలో వున్నా ఆ విసుగువల్ల ఆవిడ ముఖం మీద చీకటి క్రీనీడలా తొంగిచూస్తూనే వుండేది.

ఇక ఆయనగారు—రాత్రి బాగా పొద్దుపోతే గాని కొంపకు జేరేవాడు కాదు. కారు అల్లా కొండమలుపుకు వచ్చీ రావటమే హారన్ గర్జించటం ప్రారంభించేది. ఆటో హారన్ గర్జన వినిపించగానే ఆ భవనానికి యజమాని యెవడో సర్వులకు విదితమైపోతుంది.

చదువుకుంటూ యీలగిలబడి పడుకున్న ఆవిడ అమాంతం హడిలి, సోఫాలోనుంచి క్రిందికి దూకేది. సాయిబుల సుర్వాలా, పిక్కలు అంటిపెట్టుకున్న లాగూతో కొంగన కాళ్లమీద గెంతుతూ సింహద్వారం దగ్గిరికి పరుగెత్తుకొచ్చేది. మత్తుగా తిని ప్రొద్దస్తమానం ఆవిడ పాదాలదగ్గిర పడుకుని నిద్ర

పోతూవుండే తరిపిదూడల్లాంటి ఆ 'డేన్' జాతి కుక్కలు రెండూ కలవరంగాలేచి పెద్ద గొంతులు పెట్టుకు అరుచుకుంటూ ఆవిడతోపాటు ఇరుపార్శ్వాలా పరుగెత్తుకుంటూ వచ్చేవి. దాసీమనిషి టోపీ గీపీ సరిచేసుకుని అదో వేపునుంచి పరుగెత్తుకొచ్చేది. గేటు తెరవటానికి తోటమాలి కంగారుగా పరుగెత్తేవాడు. హాలు దర్వాజా తెరవటానికి నేనూ పరుగెత్తేవాణ్ణి. కారు హెడ్‌లైట్లు మా అందర్నీ ఉరిమి చూస్తూ ముందుకు వెలుగుచిమ్ముతుంటే ఆయన తోటకు మధ్యగావున్న రోడ్డువెంట సరాసరి కారు రానిచ్చి దభాల్న కార్లోనుంచి బయటికి దిగేసి ముసులోనిలా నడుస్తూ ఇంట్లోకి వెళ్ళిపోయేవాడు. ఇంట్లో అడుగు బెట్టేపెట్టడమే పెట్టే తొలికేక— 'సిద్ధమేనా?'

ఈకేక వినుతూనే పోయి అక్కడున్న సోఫాలలో దేన్లోనో ఒకదాన్లో జారబడేవాడు. ఆవిడ కామేచ్ఛతో అంగలారుస్తున్న పిల్లిలా దగ్గిరికిపోయి అతని భుజానికి ఆప్యాయంగా అలుముకునేది. అతని చేతిని ఒళ్లోకి తీసుకుని మనికట్టుమీద పెరిగిన నల్లటి బిరుసువెంట్రుకలను మెత్తనితనచేతితో లాలనగా దువ్వేది. ఆయన ఆ చేతిని ఆవిడకు వదిలేసి రెండో చేతితో బల్లమీదనుంచి యే వార్తాపత్రికో లాగి చదువుతూ వుండేవాడు—ఆవిడ అస్థిత్వాన్ని లక్షించకుండా. ఈలోగా నేను 'వెయిటర్' అంగరఖా తగిలించుకు జాగ్రత్తగా కుండీలు వగైరా సర్దుకుని భోజనశాలతలుపు తెరిచి వంగి సలాంకొట్టి 'వడ్డన పూర్తి అయింది హుజూర్!' అనేవాణ్ణి.

మీరు, బహుశా, చూసివుంటారనుకుంటాను!— ఊరిబయటగావుండే ఏ నాటుహోటల్లోనైనా—చెమటన్నా తుడుచుకోకుండా నెత్తిమీది పీచుకాయితాల టోపీఅయినా తియ్యకుండా ఉప్పరతట్ట అప్పుడే అవతల పారేసొచ్చి భోజనందగ్గిర కూర్చుని ఇంతింత పందిమాంసం కూరాకలిపి నోట్లో అదరాబాదరా కుక్కుకునే కూలీవాణ్ణి. మా యజమానిది కచ్చితంగా అదేతంతు—ఇంగ్లీషు ట్వీడుసూటు వేసుకుంటేనేమి, ప్రత్యేకం ఆర్డరిచ్చి తయారు చేయించుకున్న అద్భుతమైన ఒకటోరకం కారులో ఇంటికి తిరిగి వస్తేనేమి. లలితమైన హరిత వర్ణంలోవున్న పాలరాతి బల్ల; దాని మీద ముత్తెపుసగులుకూర్చి లేసులల్లిన మేజాగుడ్డ; బల్లమీద అనేకరకాల వెండిపాత్రలు; మన జన్మలో చూడని అత్యంత శోభాయమానమైన పింగాణీ సామాను బల్లకు ఒకప్రక్కను శ్రీమతికూర్చుంటుంది—మెడనిక్కబెట్టుకుని ఠీవిని ఒలకబోస్తూ. రెండో ప్రక్కన చేతులు తుడుచుకునే మురికిగుడ్డ మెడమీది కాలరులో దోపుకుని అతగాడు — అదే ఆ శ్మశానంలో గోతులుతవ్వేబాపతుమనిషి—ఇంచుమించు బల్లమీద బొక్కబోర్లగా పడుకుని ఏమన్నాను? శ్మశానంలో గోతులుతవ్వేవాడన్నానా? కాదు కాదు. అలా అనటం ఆరకంకూలీలను అవమానించటం. ఇంకా నడక చేతగాని పిల్లలు రెండేసి తుప్పటడుగులు వేసి, బోర్లబొక్కలుగా ముందుకు పడుతూ వుంటారే, అదే ప్రకారం, ఒకటి రెండు క్షణాలు కత్తీ ఫోర్కులతో సాముచేసి వాటిని అమాంతం అవతల పారేసి, గబగబా చేతులకు పని చెప్పేస్తాడు. మరి, కోడిపిల్లల పులుసు, మూలుగు బొమికలతో సహా వండిన ఆవుమాంసం వున్ననాడు చూడాలి మరి ఆ శోభ. నోటినిండా పట్టేడు మాంసం కుక్కుని నోరు అదే పనిగా దున్నపోతులా తెరుచుకుని నెమరు వేసేవాడు. సగం నమిలిన మాంసం గవదలనిండా వుండగానే నీళ్లు పోసి గుటగుట తాగేవాడు. ముఖంమీదనుంచి కారుతున్న చెమటని తింటూ తింటూవున్న ముంజేతితో తుడుచుకొనేవాడు. కూరగలలో వేసిన బఠానీగింజలన్నీ ఏరి వరసని చాకుమీద పేర్చి ఒక్కసారి గొంతులో పోసుకునేవాడు. భోజనం చేసినంతసేపూ ఆ వ్యక్తి ప్రవర్తించని అనాగరకమైన వెకిలిచేష్ట అంటూ వుండదు.

సహజంగా, ఇదంతా చూస్తుంటే ఆవిడకు చిరాకుగా వుండేది. అవును మరి—ఆవిడ 'గుడ్ మానర్స్'లో విశ్వాసమున్న మనిషి. ఆ సంగతి ఆవిడ ఎడనెడా చెబుతూవుండేది కూడా. పాపం ఆవిడ మనోవేదనంతా నేను గమనించుతూనే వుండేవాణ్ణి. నీలాల జంటలావున్న కనుగవను చారెడేసిగా విచ్చులుకుని అతనివంక తదేకలక్ష్యంగా చూస్తూకూర్చునేది; అనంతరం నా కళ్ళవంక జాలిగా చూసేది; చివరికి గత్యంతరం లేక బల్లమధ్య వున్న పూలగుత్తులవంక దిగులుగా చూసేది - లేకపోతే దుస్సహ వేదనాదోదూయమాన మానసయై ఒక నిట్టూర్పువిడిచి తలదించేసుకునేది. ఆయనగారు మాత్రం ఈవిడగారి హృదయవేదన నేమీ

కాతరుచెయ్యకుండా మరింత ఎలుగొడ్డు పంథాలో ఉపక్రమించేవాడు. ప్లేట్లోవున్న దంతా నాకి, ఇంకా యే మూలగు బొమికెనో కరువొచ్చినట్టు పీకుతూ కూర్చుంటే, ఒకోనాడు ఆవిడ నావంకచూసి: 'రెమిగియో! మీ యజమానిముందున్న ఆప్లేటు తీసెయ్యి!' అనేది. ఆయన కళ్లు పెద్దవిచేసి అసమ్మతిసూచకంగా ఒక ఎలుగ్గొడ్డుమూలుగు మూలిగేవాడు. నేను హడిలిపోయి, ఆయన సాంతం ముగించేసి కడిగేసినట్టు శుభ్రంగా నాకేసి ఆ ప్లేటు నా వైపు తోసేదాకా కిక్కురుమనకుండా చేతులుకట్టుకుని అలానే నిల్చునేవాణ్ణి.

నేను ఆ యింట్లో ఒక మాసం రోజులు పని చేశాను. భోజనాలదగ్గర ఈ రభస మినహాయించితే, నా ఉద్యోగం హాయిగానేవుంది. నేను పడుకోటానికీ చదవటానికీ, స్నానంచెయ్యటానికి వసతీ అదీ వున్న మంచి విశాలమైనగది ఒకటి యిచ్చారు. పైపెచ్చు నాకు తోటపని అంటే సర్దా. ఆ సర్దా తీర్చుకోవటానికి కూడా మంచి అవకాశం లభించింది. కాని ఇలాఉండగా ఒకనాటిరాత్రి పెద్ద గందరగోళం జరిగిపోయింది-అలా ఎప్పుడో ఓ నాడు జరిగితీరుతుందని నేను రోజూ అనుకుంటున్నదే.

మామూలు మోస్తరుగానే ఆయన ప్లేటుమీదికి యెగబడి రెండుచేతులకూ పనిచెప్పి మాంసం మెక్కుతున్నాడు. మంటమీద వ్రేలాడగట్టి కొవ్వు దిగజారేలా కమలబెట్టిన మేకపిల్ల పక్కటెముకలమాంసం. ఆవిడ ఆయన వాలకంచూసి రోజూమోస్తరుగానే బాధపడుతోంది. ఒకొక్క బొమికే పళ్ళతో గీరుకు తింటున్నాడు. చెవులదాకా కొవ్వు పూసుకున్నాడు. అప్పటికి నాలుగు బొమికలదాకా పీకేశాడు. సరే అన్నీ పూర్తిచేశాడుగదా అని అనుకుంటూండగానే తిరిగి మొదటి బొమికనుంచి మళ్ళా మొదలెట్టి పీకటం ప్రారంభించాడు.

దీంతో ఆవిడ ఇక ఉండబట్టలేకపోయింది. బల్ల రెండోప్రక్కనుంచి, కొంచెం కంటకంగానే అంది—'వేలంటైనో!—అలా చేతులు ఉపయోగించటం మానెయ్యకూడదూ—పైగా ఇక ఆ చేతులు తుండుగడ్డలకు తుడిచేస్తావాయిరి. నీ మూలాన రెండు డజన్ల నౌకర్లకి పని చెప్పవలసివస్తుంది'—

తెల్లగా తళతళా మెరుస్తున్న తోడేలుపళ్లలా వున్న దంతాలమధ్యవేసి ఒక బొమికను పటపటా నమిలేస్తూ అమాంతం ఆవిడవంక ఒక్కసారి ఉరిమిచూసి మళ్లా తన పని తాను కానిస్తున్నాడు. ఆ చూపుతో ఆవిడ మొదట కొంచెం బిక్కుబిక్కు లాడిందిగాని మళ్లా ధైర్యం చిక్కబట్టుకుని 'వేలంటైన్...' అని తిరుగ మరింత తీవ్రంగా హెచ్చరించింది.

ఒక్కక్షణం ఆ బొమికెను బల్లమీదపెట్టి ఆవిడ వంకచూసి తాపీగా చెప్పాడు—'నాగొడవ నీకు అవసరం'—మళ్లా బల్లమీదనుంచి బొమికెను తీసాడు.

'అలా చేతులతో తినటం అసహ్యం' — ఆవేశంతో ఆవిడ నరాలు కంపించిపోతున్నయ్; మళ్లా అందుకుంది. 'అడివిమనుషులు తప్ప అలా ఎవడూ తినడు'.

'ఇంతకీ నేను అడివిమనిషినంటావు?'—

'అవును — ఇంకా అలానే ప్రవర్తించితే అలానే అనుకోవలసి వస్తుంది'

'ఇంతకీనీసంగతి—నువ్వెవరో నీకుతెలుసా?'—

'తెలియదనుకో — తెలియక్కర్లేదుకూడా— ఏదియేమైనా—చేతులతో తినటం మాత్రం మానెయ్యి!'

'నువ్వా—కానీకి గతిలేని ముష్టివానివి— జోరీగవి — నోరుమూసుకు పడుండలేని పిచ్చికుక్కవ్—'

ఈ తిట్లతో ఆవిడకు రేచికెత్తుకొచ్చింది. సారా గ్లాసు మొహాన విసిరేసినట్లు చివాల్న ఆవేశంగా లేచింది—'మేవుఁ డబ్బులేనివాళ్ళమయితే కావచ్చు—కాని మాయింట్లో ఇలా చేతులతో తినేవాడెవడూ లేడు'—

'ఆసంగతి నాకు తెలుసు. — అసలు తింటానికంటూ ఏదేనా ఒకటి ఉండేడిస్తేనా?'

'వాలంటైన్—'

'నోరుముయ్! పక్షీ!—

ఆ దెబ్బతో ఆవిడకు పిచ్చెత్తిపోయింది. క్రోధంతో కనుబొమలుః ముడిబడ్డాయి. బల్లమీదకు ముందుకు వంగి—వరసని అరిచేసింది: 'ఈసంగతులు ఏనాటినుంచో చెప్పాలనుకుంటున్నాను. చెప్పదగిన

సమయం వచ్చింది. ఇప్పుడు చెబుతున్నా విను—నువ్వు జంతువు—అడివిజంతువు—ఎలుగ్గొడ్డువి—మెదడులేని మడ్డిమృగానివి—మొరటుగొడ్డువి—అయినా అందంగా వుండొచ్చు—అదికూడా లేదు. నక్కరంతి మరి గుజ్జువి—వేలిగాడివి! తెలిసిందా'...

ఆ శరపరంపరలో 'మరుగుజ్జువు' అన్నమాట తుపాకిగుండులా సూటిగాపోయి అతనిగుండెలకు కొట్టుకునుండాలి. అదృష్టవశాత్తూ, సమయంలో వచ్చుకున్నానుగాని బల్ల ఆ చివరనుంచి యీ చివరకు ఉరకటంలో మధ్య నన్ను తొక్కేసేవాడే. తుపాకి దెబ్బతిన్న బెబ్బులిలా ఆవిడమీద దూకాడు. తన హృదయంలోవున్న జుగుప్సనంతా వికటమైన చిరునవ్వులో వ్యక్తంచేస్తూ ఆవిడ అలానే నిల్చునుంది. దూకీదూకడమే అమాంతం చెయ్యి పైకెత్తేశాడు. ఆవిడ చలించలేదు. అతనిముఖంలోకి అదేప్రకారం తీవ్రంగా చూస్తోంది. ఢబాల్న ఒకదెబ్బ ముఖంమీదపడ్డది. బల్లదగ్గరనుంచి యివతలికి కదిలేలోగా నే మరొకదెబ్బ! ఈషణ్మాత్రమైనా చలించకుండా ఆవిడ నెమ్మదిగా బల్లదగ్గరనుంచి బయలుదేరి లోపలి గదిలోకి నడిచింది. శివమెత్తిన రాక్షసిలా ఆవిడ వెనువెంటనే తానుకూడా లోపలికి పరుగెత్తాడు. లోపలినుంచి బొబ్బలూ, దెబ్బలూ, ఏడుపులూ, మొత్తుకోళ్ళూ వినిపించుతున్నయ్.

రోజూ మోస్తరుగానే కింనాస్తిగా బల్లశుభ్రం చేసేసి యేమీ జరగనట్టు నిశ్చింతగా నా గదిలోకి నేను వెళ్ళిపోయాను. నిజానికి ఈ సంఘటన నాకేమీ వింతగా తోచలేదు. ఇలాంటి జాతర ఏదో నాడు జరిగితీరుతుందని నేను మొదటినుంచీ అనుకుంటున్నదే. పైపెచ్చు భార్యాభర్తలమధ్య వున్న కల్లోలాలన్నీ భోజనాలదగ్గిర జ్వాలలు రేగటం మామూలే! ఇలాంటి సంఘటనలనేకాదు, ఇంతకంటే దారుణమైనవి, నా నౌకరీ జీవితంలో లెక్కలేనన్ని చూశాను

మర్నాడు ఉదయం నేను చాలా పెందరాళే లేచి ఆయన దుస్తులు వేసుకునే గదిలోకి వెళ్ళాను. ఆ భవనం యావత్తూ నిశ్శబ్దంగావుంది. చీమ చిటుక్కు మనటంలేదు. చుట్టూ బయళ్లమీద వ్యాపించివున్న గభీర నిశ్శబ్దత ఆ భవనాన్ని కూడా కైవసం చేసుకుంది. ఆ గదిలో కూర్చుని ఆయన తొడుక్కునే బూట్లజతను తీసుకుని నిగనిగలాడేటట్టు పాలిష్ వేస్తున్నాను. కొంచెం హుషారుగా నాలో నేను ఏదో కూనిరాగం తీస్తున్నాను. ఎదురుగావున్న కిటికీలోనుంచి ఉదయించుతున్న సూర్యుని కిరణాలు మిలమిలలాడుతూ లోపల పడుతున్నాయి. నెమ్మదిగా వెనకతట్టున వున్న ద్వారం తెరుచుకుంది. తలెత్తి చూచాను; ఆవిడ గుమ్మంలో నిల్చునుంది.

ఆవిణ్ణు చూసీచూడ్డమే గ్రహించాను—చాలా దెబ్బలు తిన్నది—బలమైన గాయాలే తగిలాయి. ఒక కన్ను నల్లబడి మూసుకుపోయింది-సగంవరకు మూసుకుపోయి చుట్టూ నల్లగా కమిలి వుండుబడిపోయింది. ఆ రకం పుళ్లు ముందు నల్లగావుండి తరవాత ఆకుపచ్చ వర్ణంలోకి తిరిగి అనంతరం పసుపుపచ్చగా మారి, సాంతం నయం కావటానికి ఒక నెలైనా పడుతుంది. ఆ గాయం ఆవిడ ముఖాన్ని వికృతంగా మార్చివేసింది—ఆవిడ ముఖంవంక చూస్తే జాలివేసింది. జగత్తులో కొన్ని కొన్ని విషయాలుంటయ్—వాటివంక చూడకుండా వుండాలని విశ్వప్రయత్నం చేస్తాం—కాని దురదృష్టవశాత్తూ దృష్టిని మరల్చుకోలేక వాటివంకే చూస్తాం. ఆ గాయంవంక చూడకుండా వుండాలని ఎంతో ప్రయత్నంచేశాను—కాని విభ్రాంతుడనై దానివంకే చూస్తూ నిల్చున్నాను. ఇంతలో ఆవిడ అన్నది:

'రెమిగ్యో! నేను చాలా విచారిస్తున్నానే అనుకో-కాని తప్పనిసరిగా ఇలా చేయవలసివచ్చింది—నిన్ను నౌకరీలోనుంచి తొలగించుతున్నాను.'

ఇల్లాంటిది జరుగుతుందని నేనెప్పుడూ అనుకోలేదు. చేతిలోవున్న బూటు చేతిలో ఆపళంగానే పట్టుకుని నోరు అప్పాలపండులా తెరిచి తెల్లబోయి శూన్యంలోకి చూచాను. చివరికి నాలిక పెగల్చుకుని మూగగా గొణిగాను. 'అమ్మగారూ! నా నౌకరీ తీసెయ్యటానికి నేనేం చేశాను?'

'నిజానికి నువ్వు చేసిందేమీ లేదు—నౌకరీ విషయంలో నీ శ్రద్ధాభక్తులకు నేను చాలా సంతోషించాను కూడా?'—

'మరి యిదేమిటి తల్లీ!'—

'రాత్రి జరిగిన సంఘటనకారణంగా నిన్ను తోసేస్తున్నాను'—

'దాల్లో నాబాధ్యత యేముంది'—

'నిజానికి—నీబాధ్యత యేమీ లేదు -కాని ఆరభసంతా నువ్వు విన్నావు—నువ్వు చూచావు. ఇదంతా చూసిన నువ్వు యీ యింట్లో నాయెదట తిరుగుతూ వుండటం నేను సహించలేను.'

ఆవిడ తత్వం నాకు సంపూర్ణంగా అర్థమై పోయింది: అయినా నచ్చచెప్పటానికి ప్రయత్నించాను:

'ఇవి మరేం విపరీతమైన సంగతులు కాదుతల్లీ—గొప్పవాళ్ళ దగ్గరనుంచి కొద్దివాళ్ళదాకా యింటింటా వుండేవే—భార్యాభర్తలిలా పరస్పరం తిట్టుకోటం కొట్టుకోటం ఇదేం విపరీతమైన సంగతి కాదు నేను దేవుడిమీద ఒట్టుబెట్టుకు చెబుతున్నాను—నాకు సంబంధించినంతవరకు ఇదంతా నేను చూసినా చూడనట్టె ననుకోండి.'

'అదంతా నిజమే కావచ్చు—కాని యిదంతా చూసిన ఒకవ్యక్తి వెయిటరుగా నాప్రక్కని నిల్చునుండటం నేను ఓర్చుకోలేను. నాకూ విచారంగానే వుంది—కాని లాభం లేదు—నిన్ను తీసేశాను'—

'మీరు నన్ను సర్వనాశనం చేస్తున్నారుతల్లీ!'-

'ఇంతకంటే మంచితావు నీకు చూపిస్తాను'—అంటూనే, ఆవిడ నిల్చోకుండా లోపలికి వెళ్ళిపోయింది.

తెలిసిందా అండీ! వాళ్ళల్లోవాళ్లు ఒకళ్ళనోళ్లు బూతులుకూసుకుని కొట్టుకున్నారు. మధ్యయేమీ సంబంధం లేని నన్ను ఉద్యోగంలోనుంచి తీసేశారు. నేను ఆపైని ఇక వాగ్వాదమేమీ చెయ్యలేదు. భర్తతో చెబితే ఆయన నా పక్షమేవహిస్తాడని నాకు తెలిసికూడా అలా చెయ్యలేదు. అలా చేస్తే ఆవిడ మరొక అవమానశల్యాన్ని భరించవలసి వచ్చేది. ఇంతకీ ఆవిడపట్ల నాకు ఎలాటిద్వేషమూ లేదు. ఆవిడ మానసికపరిస్థితి యేవిటో నాకు తెలుసు. ఒకవేళ నేను మొండిచరిచి అక్కడవున్నా ఆవిడ మర్నాటి నుంచీ నన్ను కంటకంగా చూసేది — అప్పుడైనా వెళ్లిపోవలసేవస్తుంది. అందుచేత మరుమాటలేకుండా నాసామానూ జట్టా అంతా మూటగట్టేసి ఆవేళే బయటికి వచ్చేశాను. ఇంతకీ యిదంతా యెందుకు చెప్పానంటే: ఆవిడనిజమైన యజమానురాలి పుటకేపుట్టివుంటే ఇలా నా ఉద్యోగం పోయేది గాదు. నిజమైన యజమానికి నౌకరుయొక్క అస్తిత్వమే అగుపించదు. కళ్లెదుటవున్నా వాడేదో మజ్లిన్ తెరలావుండీ లేనట్టు మసకమసకగా కనుపించుతాడే తప్ప వాడికో వ్యక్తిత్వమున్నట్టు స్థూలరూపంలో అగుపించడు. వాడు అక్కడవున్నా లక్షించకుండా వాడిముందే గుడ్డ ఊడిదీసి అక్కడ పారేసి దిగంబరిగా తిరిగెయ్యగలదు,—మొగుడుమీద కలబడి అమారుతం కు స్త్రీబట్టి పెయ్యగలదుకూడా: సరే యిప్పుడు ఇదంతా ఆలోచించి లాభమేవిటిలెండి. ఆరోజులు పోయాయి లోకంలో ఇప్పుడు అలాంటి నిజమైన యజమానులూ లేరు యజమానురాళ్లూ లేరు.

* ఎన్‌కౌంటర్ పత్రిక సౌజన్యంతో

# నన్నయ : కన్నడభారతము

ల ష్ణ

"పంపని భారతమును భట్టారకుని భారత రచనను బోల్చి చూచినపుడు రెండు గ్రంథములను రచించిన దొకరేనా? యన్నంత పోలిక గనుపించును," అని 'సుజాత' ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ మహాసభా (అలంపురం) సంచికలో, పుట్టపర్తి నారాయణాచార్యులు గారు వ్రాసినారు. పంపడు వేఁగినాటి వాఁడగుటను, నన్నయ వేఁగి నాటిలో తెలుఁగు భారతమును రచించుటచేతను, వీరిరువురి పోషకులగు రాజులు చాళుక్యులే యగుట చేతను, వీరి కభిమానమున్నను, వీరిలో పంప జైన మతస్థుఁడై నన్నయ వైదికమతస్థు డగుటచేతను, పంప భారతము జైనమత పరముగను, నన్నయ భారతము వైదికమతము పరముగను రచింపఁబడుటచేత నే భిన్న సంప్రదాయములకుఁ జెందిపోయినవని వారే గుర్తించిరి. ఇఁక రచనా సామగ్రి విషయమున నన్నయకుఁ బూర్వమునఁగల శాసనపద్యములందు సంస్కృత వృత్తములు లేమిచే, సంస్కృత వృత్తములను దన భారతమున నన్నయ దెచ్చిపెట్టుట పంపాది కన్నడ కవుల ననుకరించియేయని పండితు లందరు నంగీకరించిన విషయమే. భావములు, తత్సమసమాసములు తుల్యముగా నున్నవనుచోట వీరిద్దరూ మూలముగు సంస్కృత భారతమును భాషాంతరీకరించునపుడట్లుండుట సహజమేకదా. వీరి మూలమందలి భావముల నే గ్రహించిరని యెంచవలెను. ఇఁక మూలమందు లేని భావములు గాని, దేశీయపదబంధము గాని వీరిద్దరిలో తుల్యముగా నున్నచో నన్నయ కన్నడ కవుల ననుసరించె నని చెప్పినను తప్పులేదు. కాని యట్టివి చూపక లాక్షణికులు, విమర్శకులు సామాన్యముగా చెప్పు కవితా శైలి లక్షణములను గూర్చి చెప్పిన వాక్యములనుబట్టి "భట్టారకుల 'ప్రసన్న కథాత్వ' మును, పంపని 'ప్రసన్న కవితాగుణం', 'ఉదాత్తవస్తు విన్యాసం' అనెడునవి రమ్మని పిలుచుచున్నవి. అర్థ యుక్తిని 'సకలార్థ సంయుతి' అను శబ్దము పెనఁగూడుచున్నది. 'అక్షర రమ్యత'కు పంప మహోన్మృదుపాదం 'లలితపదం' వాక్శ్రీసుభగం అనబడునవి బంగారు నగలగుచున్నవి. 'కవీంద్రు లారసి మేలు నాఁ' అను భావమును స్పష్టముగ పంప చెప్పినాడు. "ఇఁక తక్కిన పదము లన్నియు నన్నపార్యునకు బునరుక్తులుగ దోచియుండుటచే వదలివేసిరి," అని తెలుపుట సాహసము. ఇందును సూక్ష్మముగా విచారించిన నన్నయ చెప్పిన 'ప్రసన్న కథా కలితార్థయుక్తి'యు, పంపడు తెల్పిన 'ప్రసన్న కవితాగుణ'మును నొకటి కాఁజాలవు. పంపడు చెప్పినవి యాలంకారికులు కవితనుగూర్చి చెప్పిన దశగుణములలో నొకటగు 'ప్రసన్నత్వము'; అనగా గూఢము గాక, తేలికగా తెలియు భావములు, పదబంధముగల కవిత. కాని నన్నయ చెప్పిన 'ప్రసన్నత్వము' కవిత కంతకు గాక, కథకు మాత్రమే చెందునది. ప్రసన్నమైన (నిగూఢము గాని) కథతో గూడుకొనిన యర్థ చమత్కారము (యుక్తి) గల్గియుండుట యని యర్థము. అట్లే నన్నయ తెల్పిన 'యక్షర రమ్యత'కు పంప సూచించిన 'లలితపదం'కు గూడ భేదమున్నది. భావములనుబట్టి శైలి మారుచుండును. ప్రసాదగుణమునకు లలితపదబంధము తగినది. గంభీర భావములకు లలిత పదబంధము చాలదు. ఓజో గుణముగూడ గావలసి యుండును. దాన ప్రౌఢమైన పదములను వాడవలసి యుండును. ఆయా భావములకు గుణములకు తగిన శైలితో పదములనుగూర్చుట యక్షరరమ్యత యగును. అందుచే నక్షరరమ్యత వివిధపాకములబట్టి వివిధములుగా మారుచుండును. మరియు నన్నయ శైలి గంభీరముగనుండి మదమాతంగమువలె నడుచు నని ఎఱ్ఱనాదులు తెల్పిరిగద. కాన నన్నయ యక్షరరమ్యతకును, పంపని లలిత పదమునకు సంబంధము లేదు. లలితపదబంధముగల రచన యక్షరరమ్యతగలది కావచ్చును గాని, యక్షరరమ్యత గల రచన లన్నియు లలితపదబంధముగలవి గావు.

# నన్నయ : కన్నడభారతము

తర్వాత నాచార్యులవారు నన్నయ సంస్కృత సమాసగ్రథన లక్షణముల నుగ్గడించి, యవన్నియు పంపని సమాసగ్రథనమందున్నవని చెప్పి యిచ్చునకొక వచనపుతునుకను, రెండు కందపద్యములను కన్నడ భారతమునుండియిచ్చి "పై వచనమునందు—పద్యములందు కన్నడపదములను తెలుగుచేసి, ఆంధ్రవిభక్తులను చేర్చినచో — నన్నయ కవితకన్న వేఱుగా వానిని చూడలేము. వారిర్వురి వచన రచనముకూడ చాల పోలిక గలది" అని వ్రాయుటలో నర్థము లేదు. ఇంక "నన్నపార్యుని కవితలు విమర్శించునపుడు వారు 'వస్తుకవిత' ప్రధానముగ పలుకుదురని రసికులందురు. ఆ వస్తుకవిత పంపునిదే" అని వ్రాయుట మఱియు విచిత్రముగా నున్నది. నన్నెచోడుడు తన కవితను వస్తుకవిత యని చెప్పుకొనినాడు. కాని నన్నయ కవిత వస్తుకవిత యని యెవ్వరనిరో తెలియరాదు. ఇంతకు వస్తుకవిత యిట్టిదని యెవ్వరు నిర్వచింపను లేదు. కాళిదాసాదుల యుత్తమ కవిత వస్తుకవిత యని నన్నెచోడుడు పొగడినాడు.

నన్నయయే కాక తిక్కనసోమయాజిగూడ కన్నడ కవితాప్రభావమునే తన కవితలోఁ జూపెనాఁడట. అంతకంటె విచిత్రము. "తిక్కన తండ్రి తాతలు జీవించినది రాజంపేట తాలూకాయందలి 'పొత్తపి' యని తమకు మనవి చేయుచున్నాను" అని వ్రాసినారు. ఇది వారి యతివినయమునుమాత్రమే తెల్పును కాని సత్యముమాత్రము గాదు. వీరి విమర్శ కీనితో పరమకోటి కెక్కినది. తిక్కనయే తనతాత గుంటూరు విభుడని నిర్వచనోత్తర రామాయణమున దెల్పుకొనినది దీనితో పటాపంచలైనది. వీరికి ప్రమాణము సున్న. ఇట్టి విమర్శ వీరి కన్నడాభిమానమునే తెల్పును గాని యాథార్థ్యముమాత్రము గాదు.

పంప నన్నయల కవితారచనలందు, సంస్కృత సమాసములందు స్పష్టత, రసానుగుణమైన కథా శరీర రచన మొదలగు గుణములు సమానముగ గలవని వారి వాదము. పురాణ రచయితలగు ప్రాచీనకవు లందరి యందు నీ గుణములు సామాన్యముగా నున్నవి. పురాణ కవితాగుణములు ప్రబంధకవితాగుణములకంటె భిన్నములు. ఇంతమాత్రమున నన్నయ పంపని యనుకరించెనని నిర్ధారింపఁ దగదు. వీరు చూపిన కారక విశేషములను నన్నయపంపనుండియే గ్రహింప నక్కర లేదు. ఇవి నన్నయకు పూర్వమున గల శాసనములందు గలవు. ఉదా: — "నీ చేసిన యుపకారంబునకు"; 'కొండుమయ్యాను పరోపకారంబు పొందిగాని; అతని కొట్టించిన చెఱువులు; అతని చేయబడి' (చాళుక్య భీముని కొఱవిశాసనము క్రీ. శ. 892–929); "కొత్తంబు పారకు కుంచికాల్గిల ఇచ్చిన పన్నస." "బెజయిత్త భటరల నిల్పిన దత్తి." "ఎరిగల తుగరాజు ఇచ్చిన పన్నాస." "అశ్వమేధంబున ఫలంబు." (అద్దంకి శాసనము)

ఇంక వ్యాసుని వర్ణించుచు పంప:

"నీలాంబుద శ్యామనుం, కనకపింగళ జటాబంధ కలాపనుం, దండక పాళిహస్తనుం, కృష్ణమృగ త్వక్పరిధానను మాగి వ్యాస భట్టారకం పుట్టివుదు."

అని వర్ణింపగ, నన్నయభట్టు:

"కృష్ణాజిన పరిధాన కపిలజటామండల దండక మండలు మండితుండై" అని పంపని రచనను సంకోచపరచినాడని యాచార్యులవారు వ్రాసిరి. ఇందు 'కపాళి ధారణము' పనికిరాదని నన్నయ వదలి వేసినాడట. 'నీలాంబుద శ్యామనుం' అను దాని నేల వదలి వేయవలయును? "వ్యాసో నారాయణో హరిః" అను వాక్యమును నన్నయ విశ్వసింపలేదా? ఇదేనా నన్నయకు సంకోచపరచవలసినది. పోనీ, మిగిలిన దానిలోనైనా నన్నయ పంపని యెంతవర కనుకరించినాడో చూద్దాము. పంపకవి 'కనక పింగళ జటాబంధ కలాపనుం' అని వ్రాయఁగ, నన్నయ 'కపిల జటా మండల' అనిగదా వ్రాసెను. ఈ రెంటిలో 'జటా' శబ్దముమాత్రమే తుల్యము గాని, యితరపదము లన్నియు భిన్నములే కదా. పంపడు 'కృష్ణమృగ త్వక్పరిధానను' అని వ్రాయఁగ, నన్నయ 'కృష్ణాజిన పరిధాన' అని రచించి, 'కృష్ణమృగత్వక్'కంటె 'కృష్ణాజిన' పదము ధారాళముగ వాడబడుదాని నుపయోగించెను. పంపని 'దండకపాలహస్తనుం' అనుటకు, 'దండకమండలు మండితుండై' యని నన్నయ వ్రాసెను. దీనిలోగూడ 'దండ' శబ్దముమాత్రమే సమానము. ఇది సంస్కృత పదము. మిగిలినది నన్నయ స్వంతమే కదా. జట, దండ పదములు సంస్కృతములై భాషలో సర్వసాధారణమైనవి. మరియు పంప యీ మూడు గుణములను ప్రత్యేకము వ్యస్తపదములుగ వాడగ, నన్నయ వీని నన్నింటిని నేకసమాసమున గలిపి వేసినాడు

ఇదేగాబోలు నన్నయ పంప ననుకరించినతీరు. ఇంతకు నేకవియైన నొక ఋషిని వర్ణించునపుడు 'జటా దండకమండల కృష్ణాజిన' ధారణమును గూర్చుట సర్వసామాన్యము. ఇవి లేకపోయినచో నతఁడు సన్యాసికాక సంసారియే యగును, ఇందు విశేష మేమియు లేదు. ఇట్టి సామాన్యవర్ణనకు నన్నయ పంపని ననుకరింపవలయునా, వీరిద్దరి రచనలో గల శబ్ద సామ్యమును పైనఁ జూపితినిగదా. కాని దీనిలో పంపకవిని నన్నయ యనుకరించె నని చెప్పఁ జూచుట నన్నయను గొంచపఱచఁ జూచుటయే. పంపని యనుసరించినచో 'నీలాంబుద శ్యామునుం' అను విశేషణమును పరిహరింప నేల? 'భారత భారతీశుభగభస్తి' యను పద్యమును రచించి తన కల్పనాశక్తిని, భావనాశక్తి నేల ప్రదర్శింపఁగలఁడు? తర్వాత ఆచార్యుల గారు, నన్నయ "ప్రాచీన కర్ణాటక సాహిత్యమును గాలించి కళగల పదములపై కన్ను వేసి యుంచినాఁడు" అని వ్రాసినారు కాని యేయే కర్ణాట పదములపై కన్ను వేసినాఁడో మాత్రము మాయన తెల్పలేదు. దీనికి ప్రమాణము లేదు. కన్నడ పదములను విశేషముగా వాడినది నన్నెచోడుఁడు, పాల్కురికి సోమన మొదలైన శివకవులు. పద్యముల యెత్తుగడ, యేకపదమును పునరుక్తిగా వాడుట, మొదలైనవి పంపకవి రచనలందలివి నన్నయలో నేకాక యితర సంస్కృతాంధ్ర కవుల నేకులలో గూడ గలవు. ఇంతమాత్రముచే నన్నయ పంప ననుకరించెనని భావింపరాదు.

గున్నపోతీనినదనగానే దూడను గట్టివేయు మన్నట్లు, మరియొక మహానుభావుడు పంప నన్నయ పద్యములలోని తత్సమ సమాస పదములను జూపి, నన్నయ పంపనుండి భాషను దొంగిలించినట్లు చూపెను. ఉదా:—(1) సాలప్రాంశు:— నన్నయ. భా. ఆది 6-30; పంప భా. 1:—68; (2) అర్గలం:—ఆది 6 217; పంప 1 10; (3) మాణిక్యగాణిక్య సభా. 1-18; ఆది పు 8-16; (4) అనయన:—సభా. 1-16; పంప 9-35; (5) అరుణ :— ఆది 3-299; ఆదిపు 7-8; (6) హేమకర:—ఆది 4-228; పంప భా. 3, 82-83; (7) కురువృద్ధు:—సభా. 2 283; పంప భా. 6-44; (8) అష్టశోభి:—ఆది 7.281; పంప భా. 5. 22,7-2; ఇంతేకాక నన్నయ సంస్కృత కవులనుండిగూడ పద సమాసములను దొంగిలించినట్లు రఘువంశాది కావ్యములనుండి సామ్యములనుజూపిరి. ఉదా:—(1)గుర్వర్థమర్థి:—ఆది 1-94; రఘువం 5-24; (2) సామ్రాజ్యదీక్షితు:—సభా; రఘువం 4-5; (3) ఉదవాస:—ఆది 2 25; కుమారసం 5-26; (4) భేరి:—ఆది 7-174; (5) నిపాత:—అరణ్య 3 36; రఘువం 2-60; + అభిజ్ఞానశాకుంతల 1-10; సంస్కృతపదసమాసములు సంస్కృత కావ్యములం దుండక యేలపోవును. దీనికై గ్రంథాన్వేషణాయాస నటన యక్కరలేదు. ఆయా సంస్కృతపదములకై సంస్కృతనిఘంటువులను జూచినచో నాపదప్రయోగములు గల కావ్యభాగములే ప్రమాణముగ నందీయఁబడును. ఇట్లు నన్నయ వాడిన ప్రతి సంస్కృతపదమునకు సామ్యము జూపవచ్చునుకదా. సంస్కృతకోశములలోని సంస్కృత పదముల నెవరైన వాడగలరా? పూర్వ సంస్కృత కవుల శబ్దజాలము సప్రమాణముగ కోశములందుండగ, తర్వాతకవు లాయాపదములను వాడకుండనుండగలరా? వాడినంతమాత్రమున పూర్వ కవుల రచనలనుండి దొంగిలించుట గాని యనుసరించుట గాని యగుచో, నాయా భావములను వ్యక్తీకరించుట కాయాపదములు గాక మఱే యేపదము లుపయోగింపనగును. కాన సమపద ప్రయోగ మున్నంతమాత్రముననే యనుసరణ మనఁ దగదు. సంస్కృతమూలమునుండి భాషాంతరీకరించు పంప నన్నయలు సందర్భానుసారముగ సంస్కృత సమాసముల నుపయోగించినంతనే పంపను నన్నయ యనుసరించెనని యేల భావింపవలయు. ఇరువురకు మూలము వ్యాసభారతమేగదా. ఈమాత్ర స్వల్ప విషయమును గుర్తింపక నన్నయ ప్రభావమును కొంచెపఱుప నేల? ఒకవేళ సంస్కృతభారతమున నాయా పదములు వరుసగ లేకపోయినను, అనేక శ్లోకములందలి భావములను క్రోడీకరించి యిద్దరు క్లుప్తపఱచి వ్రాయుటలో ఛందస్సనియమముల ననుసరించిన పదముల కూర్పులో కాకతాళీయన్యాయముగ కొన్ని చోట్ల కొన్ని పదములు సమానముగ దొర్లవచ్చును. వీరు చూపినదానిలో నిది యొక్కటిమాత్రమే అట్టిది. చ॥ సరళతమాలతాళ హరిచందన" ఆది 8-78; పంప 5-3; ఇది చెట్లపేర్లను దెల్పు ద్వంద్వసమాసమందలి కొంత భాగముమాత్రమే. అనుసరింపదగిన విశేష మేమున్నదో పాఠకులకు విదితమే. ఇందు ఇతర సంస్కృత కావ్యమందలి పదములు దొర్లినట్లుగనే

పంపనుండియుఁ గావచ్చును. కాని పనికట్టుకొని యాతని భారతమును నన్నయ యనుసరించెనని చెప్పరాదు. ఎందుకన "భారతముపై పంపడు వేసిన జినముద్ర భట్టారకుని మనస్సును శూలమై బాధించినది" అని నారాయణాచార్యులవారే వ్రాసిరి గదా. దీనినిబట్టి పంపపై నన్నయ కభిమానము లేదని విశదమే కదా. అభిమానము లేనివాని ననుసరించుట ప్రకృతి విరుద్ధము. కాన నన్నయ పంప భారతము ననుసరించె ననుటకు వీలు లేదు. పారావారమువంటి సంస్కృత వాఙ్మయము లక్ష్యలక్షణములతో సిద్ధముగా నుండగ, తన కొకటి రెండు శతాబ్దములు పూర్వముండున్న కన్నడ వాఙ్మయముమీద నెక్కువ యభిమాన పడడు నన్నయ. నన్నయ వాక్యరచన బహు ప్రౌఢసమాసములతోడను, కారకాంగులతోడను సంస్కృతభాష ననుసరించె ననిగదా ప్రతీతి. సంస్కృతవాఙ్మయముతోఁబాటు నన్నయ పంప భారతము నొకమారు చదివియుండవచ్చును. కాని పనికట్టుకొని గాని ననుసరించి యుండడు. ఒక వేళ నట్లే యనుసరించినచో వ్యాస వాల్మీకులను బూర్వకవులలో స్తుతించినట్లుగాని, నారాయణభట్టునందు కృతజ్ఞత జూపినట్లుగాని, పంపవిషయమైకూడ తెల్పెడివాడే నన్నయ. అట్టివి లేవుగదా. ఒక వేళ వ్యాస పంప భారతములను—జైన వైదిక భారతములను—సంస్కృత కన్నడ భారతములను, అనగా ఆర్య ద్రావిడ, జైన వైదిక సంప్రదాయముల నన్నయ యనుసరించినచో అయ్యవారిని చేయఁబోయిన కోతి యయ్యె ననునట్లుండెడిది. కవిబ్రహ్మ యగు తిక్కనయే నన్నయను 'విద్యాదయితుడని' పొగడెనుగదా. ఇఁక మనమో యతని యెరవు సొమ్ములనెత్తి చూపుచున్నాము.

పరిశోధన పూర్వక విమర్శకు ముఖ్యముగా (1) ప్రసిద్ధమైన ప్రమాణమును జూపవలయును. తరువాత (2) దానితో సమన్వయము చేసి వ్యాఖ్యానించునపుడు వాదము సహేతుకముగ, కార్యకారణ సంబంధము గల్గియుండవలెను. కాని, కేవల మూహాప్రపంచమున గాలిమేడలు కట్టఁజూచినచో నవి నిరాధారములగును. అద్యతనకాలమున సాహిత్యవిమర్శ లనేక విధములనేయున్నవి. అభిరుచి యున్నంత మాత్రమున విమర్శ నిర్దోషముగ సాగదు. ప్రతిభా వ్యుత్పత్తులతోఁబాటు అభిమానరాహిత్యము (disinterestedness) విశేషముగా నుండినగాని విమర్శ నిర్దోషముగ నుండఁజాలదు. క్రొత్తదొకటి చెప్పవలెనను బులపాటము నుండిన చాలదు. దీనిఫలితము మేముగూడను నాత్మవిచారముగూడ నుండవలె. లేనిచో నాత్మవంచన పరవంచనలకు దారితీయును. నారాయణాచార్యులవారి వ్యాసము అనంతపురం ఆంధ్రసారస్వత పరిషత్ సప్తమమహాసభా సమావేశమున చదువబడినది. ఈ సభాంగుల సహనమునకు నా ధన్యవాదములు.

# ప్రత్యభిజ్ఞ

శ్రీ సూరంపూడి భాస్కరరావు

## పాత్రలు

ఉత్తర అభిమన్యునిస్వరం ద్రౌపది ధర్మరాజు
మల్లిక శ్రీ కృష్ణుడు సుభద్ర అర్జునుడు
కుంతి, చక్రపాలుడు, అనుచరులు

## దృశ్యకావ్యము

### రంగము : 1

సమయం : పద్మవ్యూహ యుద్ధం ముగిసిన నాటి రేయి.

ప్రదేశం : పాండవశిబిరం, కురుక్షేత్రం.

[అభ్యంతరగానము]

తల్లీ! మాతల్లీ!
భారతసంగ్రామ మొకటి
తప్పనిదా తల్లీ?

భారతసంగ్రామములో
పద్మవ్యూహమ్ముగూడ
తప్పనిదా తల్లీ?

ఈనాటికి సౌభద్రుడు
ఏనాడో బాలచంద్రు
డింకెపుడో ఇంకెవరో
ఇంతేనా తల్లీ?

ఈహింసకు ప్రతిలేదా?
ఏబుద్ధుని కారుణ్యమొ
ఏ అశోకసమ్రాట్టో
ఏ తెంచెడి ఘణ్యకాల
మెఱుగవేమొ తల్లీ?
తల్లీ!!

మల్లిక : ఉత్తరాదేవీ!

ఉత్తరా: (సమాధానానికి ఊకొట్టలేని బరువుతో)

బ్రతుకలేనో నేను,
బ్రతుకలేనో గడచి,
బ్రతుకలేనో!
బ్రతుకలేనో!
కరగెనో నవమేఘ
తరుణాంబు గర్భమ్ము,
కరుణాశ్రువులజాలు
పొరలిపారెడినిటు! బ్ర||
మరుగు ఏపెనుకడలి
కెరలిపోయెనో గాని
చెరవీడి బడబాగ్ని
హరనేత్రముగ రేగు|| బ్ర||
విరిగి ఏ హృదయమ్మొ
సురిగిపోయెను నేడు
మరణవీణియవోలె
మొరసె మూగతనమ్మొ|| బ్ర||

మల్లిక : ఇంత ఏకాంతవాసిత్వ మెందుకమ్మా
మాతో మాటాడగూడదూ?

ఉ త్తర మాటాడుట కేమి మిగిలింది మల్లికా? నీ వెర గనిదీ, నేను చెప్పేదీ ఉందా?

మల్లిక : ఏదో చెప్పబోతున్నావు రా కుమారీ!

ఉ త్తర మల్లికా, ఈదీపాలవెనుక చీకటి కరుకుగట్టి నట్టుందే! గడచిన పగటి వేళ కురుక్షేత్రంలో యుద్ధం ముగిసింది. రేపుపగలు మళ్లీయుద్ధం ప్రబద్ధలవుతుంది. ఈరేయి మాత్రం ఇంత నిస్తబ్ధంగా, ఇంత నిర్జీవంగా, తడిసినశవం కాలుతున్నట్లుందెందుచేతనో!

మల్లిక : ఈప్రపంచపుటద్దంలో ఈచీకటికిరణాల సహా యంతో నిన్ను నీవే చూచుకొంటున్నావు.

ఉ త్తర : నీమాటలు నాకర్థంకాలేదు. నీ మాటలలో ధ్వనిలేదు మల్లికా.

మల్లిక : పోనీలే రాకుమారీ! నీకాదంబినీ పంక్తుల్లో నడిచిపో,ఆముందు తెల్ల మేఘాలున్నాయిలే.

: ఔను, తెప్పరిల్లుతున్నాను. అదిగో! అది యేదో మనలోకానికి చెందనికాంతి. నా కనులలో నిండుతున్న కాంతి. నీవు అవ రించుకోగలిగిన కాంతి—

మల్లిక : నేను ఊకొట్టుతున్నానమ్మా!

ఉ త్తర : ఇంతవరకూ నాలోనే దాగిపోయినకాంతి, నాకు తెలియనికాంతి, ఇప్పుడు బహిర్గతమై నాలోకి చొరుచుకొంటూంది మల్లికా! ఎంతదీప్తి! ఎంత ఆర్ద్రమైనకాంతి! ఎంత శాశ్వతమైనశాంతి!

మల్లిక : పగటివెలుగు ప్రాపంచికం. చీకటి దుఃఖ మయం. వాటిని అతిక్రమించిన అనుభూతి లోనికి పోతున్నావమ్మా.

: వెలుగులో నవ్వుకుంటూన్న నేను చీకటి లోకి జారిపడ్డాను సాయంత్రం గంటమ్రోగి నప్పుడు. కాని ఈ చీకటిదాటిపోతుంది సుమా! సన్నని చల్లని వెన్నెల సోకుతోంది. నా మృతినిదాటిన బ్రతుకులోనికి పోతు న్నాను. ఇక నాకు మృతిలేదు...! నామృతిని మీరు చూడగలరేమోగాని నేను చూడలేను. నేను చూడకుండ జరిగి పోయింది.

మల్లిక : నీకు కావలసిందేదో వెతుక్కుంటున్నావు. నీది అజయ్యశక్తి రాకుమారీ. నువ్వు సమ కూర్చుకోగలవు.

ఉ త్తర : ఔను మల్లికా. నా ప్రియుడిదేహం! అది కావాలి, ఈప్రపంచపుటెల్లలను దాటేందు కది కష్టమెట్టు.

మల్లిక : అనగా?

ఉ త్తర : నాచేత చెప్పించాలా మల్లికా? ఈభౌతిక లోకపు వాసనలన్నీ, ఈశరీరపు బరువుని దించుకుని విడిపడడానికది అవసరంకాదూ?

మల్లిక నీమాటలలో నీవనుకొని అర్థం మెరుగులుతోం దమ్మా.

ఉ త్తర మల్లికా వారడిగితే చెప్పు, ఉత్తరదేహం జీవిస్తూనే ఉండగలదని.

మల్లిక : అంతేనా? ఆదేహాన్ని కప్పుకుని, రోదసీ కుహరంనిండి ఉత్తరాభిమన్యుల ప్రణయా త్మలు అజరామరంగా విహరిస్తూ ఉంటా యని చెప్పక్కర్లేదూ?

ఉ త్తర : నీకు, తెలుసును, మల్లికా.

## రంగము : 2

ద్రౌపది: అభిమన్య కుమారుడు చనిపోయాడు.

సుభద్ర: ఇది మూడోసారి పలుకుతున్నావక్కా.

ద్రౌపది: ఎందుకంత పిరికి పడుతున్నారు మీరంతా. మీరీ సత్యాన్ని ఒప్పుకున్నట్లు కనబడడం లేదు.

సుభద్ర: (క్రుంగిపోతూ) అత్తయ్యా! (కుంతితో చెప్పుకుంటుంది).

కుంతి : తడిసిన ఉత్తర గుండెలని బ్రద్దలుచేసేందుకా వెచ్చిచెకుతున్నావు పాంచాలీ?

ద్రౌపది: బ్రద్ద లయ్యేవి మన గుండెలు. ఉత్తర విశ్వ సత్యాన్నుంచి మనంత దూరంగా పోలేదు.

ధర్మ : నిన్ను మేం ఓదార్చలేమమ్మా

సుభద్ర నా అభిమన్యుణ్ణి నీలో చూచుకుంటు న్నాను. నీవుకూడా క్రుంగిపోతే?

కుంతి సుభద్రా పోయి క్షీరభాండం తేగలవా?

(సుభద్ర తనని మోసుకుంటూ వెళుతుంది.)

ద్రౌపది: అంత కనుతెరవలేని బాధలో ఉన్నావా ఉత్తరా!

ఉత్తర : బాధపడుతున్నట్లుగా కనబడుతున్నానా అత్తగారూ!

ద్రౌపది: ఏమో నీ కళ్ళంత నిశ్చలంగా ఉన్నాయేం? నీ గుండె కొట్టుకుంటూందో లేదో తెలియడంలేదు.

మల్లిక : ఆమెలో ఈ చైతన్యం లేదు దేవీ. బాధ, సంతోషం యెరగని మరొక స్థితిలో ఉంది.

ద్రౌపది: కదలని కళ్లూ, ఆలోచించని మనస్సూ ఇవి నాకూ తెలుసు, కొన్ని జన్మాలక్రితం. అవి యిప్పుడు నాలోకి చొరజాలవు ఇది యుద్ధమనీ, ఈ పాండవులుకూడా చిరజీవులు కారనీ నాకు తెలుసు.

కుంతి ద్రౌపదీ.........(అంటుంది ఆత్రంతో కంగారుపడి అదిలించినట్లు).

అరు : గుండెలతో, కుంకెలతో ఆడినట్లు ఆడుతున్నావా? ఘోర సత్యస్వరూపిణీ!

ధర్మ : అదిగో సుభద్ర వస్తోంది. కొంచెం పాలు పుచ్చుకోతల్లీ నీరసిల్లి పోతావు.

[సుభద్ర ప్రవేశం]

సుభద్ర: ఇదిగో, ఇది నీ గిన్నె. ఇది అభిమన్యుడి గిన్నె. నీ ఇష్టమొచ్చిన దాంట్లో త్రాగు. రెండిటితోనూ త్రాగు.

కుంతి : త్రాగుతల్లీ, నీవు కూడా త్రాగి విశ్రమించు సుభద్రా.

సుభద్ర: నేనా? నేను త్రాగలేనత్తయ్యా. ఇంకా త్రాగగలనా?

(ఉత్తరతో) అమ్మా పాపమో పుణ్యమో ఆరంభించాం. ఆ శ్రీకృష్ణుడిదే భారం. అతడేగా నడిపిస్తున్నాడంటా. అర్జునా నీ ప్రతిజ్ఞ ఒకటున్నదిగా. లేమరి. శ్రీకృష్ణుని దర్శించి రావద్దూ?

మల్లిక : మహారాజా,

ధర్మ : ఏమి మల్లికా?

మల్లిక : ఉత్తరా కుమారి కోర్కె ఒకటి ఉన్నది.

ధర్మ : చెప్పబిడ్డా.

అర్జు : భూలోకంలో నీవు పొందలేనిదీ కోరరానిదీ లేదు. అడుగుతల్లీ.

మల్లిక : మహారాజా, సౌభద్ర కుమారుని దేహం...

ధర్మ : (ఆశ్చర్యంతో) సౌభద్ర కుమారుని దేహం?

అర్జు : (పిరికిగా) ఉత్తరా...!

సుభద్ర: (గద్గదికతో) గర్భంలో శిశువు తల్లీ!...

మల్లిక : రాకుమారి యేమీ ఘోరంతలపెట్టలేదు దేవీ. ఆమె ఈ ప్రపంచాన్ని చూచి భీతి పడిపోలేదు.

ధర్మ : రుధిర మలినమైన దేహాన్నేం చేస్తావు ఉత్తరా?

మలిక ఇంతవరకూ తనని బాహ్య జగత్తులో రంజింప జేసిన అభిమన్యుకుమారు డిప్పుడు అదృశ్య జగత్తులోనుంచి తన్ను రంజింప జేస్తున్నాడు. మిగిలిన ఆ మూర్తి యొక్క భౌతిక రూపపు ఛాయలని విస్మరించేందుకు ముందు వీడ్కోలు పలుకుతుంది గాబోలు.

ధర్మ నీ ఇష్టం,...చక్రపాలా!

చక్ర ప్రభూ;

ధర్మ పోయి రణక్షోణిలో అభిమన్య కుమారుని దేహం వెదకి తెచ్చే ఏర్పాటులు చేయి.

చక్ర ఆజ్ఞ (నిష్క్రమిస్తాడు).

ధర్మ అర్జునా! (అడుగు వేస్తాడు).

అర్జు మీ వెంటనే ఉన్నాను అన్నగారూ. (నిష్క్రమిస్తారు).

## రంగము : 3

ధర్మ : శ్రీకృష్ణా.

శ్రీకృష్ణ: వచ్చావా బావా. కూర్చో అర్జునా.

ధర్మ : ఈ మహా సంగ్రామంలో జరిగే రక్తపాతానికి నీ వేనా బాధ్యుడవు?

శ్రీకృష్ణ: పూర్తిగా నేనే బావా దోషిని.

ధర్మ : దోషివో, నిర్దోషివో, ప్రపంచం గిలగిలలాడిపోతోంది. ఎన్నో లేత హృదయాలు విచ్చిపోతున్నాయి.

శ్రీకృష్ణ: అది హృదయాల తీరు బావా. చంపితే చచ్చిన వాటిని చూస్తున్నావిప్పుడు. చంప

కుండా నే చచ్చి పోయినప్పుడు బాధ్య లెవ రంటావు?

ధర్మ : నన్నా అడుగుతున్నావు?

శ్రీకృష్ణ. ఈనాడీ అస్త్రశస్త్రా లుపయోగించాం. ఇంకో నాడు వేయిరెట్లు హింసాత్మకమయిన శస్త్రా లుపయోగిస్తారేమో. లేక అసలు శస్త్రాలే ఉపయోగించరేమో. జీవితమే యుద్ధం. కాదా అర్జునా?

అరు ఔ నేమో. మాకు అస్తిత్వం లేదు. అస్తిత్వం ఉన్నా కర్తృత్వం లేదని నీవే చెప్పావు. ఎవరి కర్తృత్వమో అభిమన్యుడెక్కడో దాగుండి పోయాడు.

శ్రీకృష్ణ: వేలాది దాగుండి పోతున్నారు.

అర్జు : నాకు కాదు బావా, ఉత్తర కేమి సమాధానం చెబుతావు?

శ్రీకృష్ణ: ఉత్తర సమాధానం కోరలేదే!

అర్జు : సమాధానం కాదు. అభిమన్యుడి దేహం కోరింది.

శ్రీకృష్ణ: ఇవ్వలేక పోయారా?

: చక్రపాలు డీపాటికి తెచ్చేఉంటాడు.

కృష్ణ : ఎంత అమాయకులు! అతడు తేగల్గుతాడా?

అర్జు : తేలేడా? నేను తెస్తాను.

కృష్ణ : ఎందుకోయి. ఉత్తరే తెచ్చుకోగలదు. నీ వెందుకు ప్రయత్నించడం?

అర్జు : అంత దుస్సాధ్యమా?

ధర్మ : కాదర్జునా. ప్రయత్నింతువు గాని. కృష్ణా రేపటికి అర్జునుని ప్రతిజ్ఞ నెరవేరాలిగదూ?

శ్రీకృష్ణ: ఔను.

ధర్మ : అందునుగూర్చి సిద్ధపడవలసినది లేదూ?

శ్రీకృష్ణ: ఆచరించవలసినదే. సిద్ధపడవలసినదేముంది?

అరు ఇక వెళ్ళివస్తాం బావా. (నిష్క్రమిస్తారు.)

## రంగము : 4

* * ఉత్తర ఒంటరిగా ఉంటుంది. దూరంగా చీకటిలో ఒక నీడ కన్పిస్తుంది.

ఉత్తర : (గుర్తించి).

వీటి వెలుపల, ఏటిమలుపుల
తోటతలుపుల, చాటునెవరో?

అభిమన్యుని స్వరం :

తేటతలపుల, తేటివలపుల
పాటపిలుపుల, బాటనెవరో!

ఉత్తర : (తన్మయతతో)

కంటికొలకుల, ఇంటికెలకుల
మింటిశిఖరుల, పంటలేమో?

అభి. స్వరం:

పంటచెలకల, జంటచిలుకల
కొంటెపలుకుల, గంటలేమో!

ఉత్తర :

సిలివన్నెల, వాలుగన్నుల
పూలకన్నెల, జాలిపాటలు!

అభి. స్వ:

పూలతిన్నెల, పాలవెన్నెల
గాలికన్నెల, జోలపాటలు!

ఉత్తర. అభి:

గాలిపాటలు! గాలిపాటలు!

[లోకానికి అనూహ్యమైన యీ గానం మల్లికకి శ్రావ్యం.]

మల్లిక : (ఆలించి)

ప్రణయశీలా! అమర,
ప్రణయలోలా! నీకు
ప్రణయమే! బ్రతుకొక్క,
ప్రణయమే లేనే!
ప్రియుడు గేహము బాసి,
ప్రియుడు దేహము బాసి
స్వప్నలోకాలలో,

సాగిపోయాడే మొ
స్వప్నమే నీకింక,
స్వప్నమే మనికి!
ప్రియవియోగము లేని,
ప్రియతమవు నీవే నె!
ప్రణయశీలా! అమర,
ప్రణయలోలా! నీకు
ప్రణయమే! బ్రతుకొక్క,
ప్రణయమే లే వే!

ఉత్తర : (మేలుకొన్నట్లు) మల్లికా ఎవరైనా ఉన్నారా యిక్కడ? విన్నారా నాపాట?

మల్లిక : ఎవరూ లేరమ్మా. అంతా అమాయకపు నిద్రలో ఉన్నారు.

ఉత్తర : మరి నేను?

మల్లిక : నీవా? నిన్ను క్షుత్పిపాసలు నిద్రాజాగరణలు అంటలేవేమో!

## రంగము : 5

ధర్మ : చక్రపాలా, ఇంకేనా నీ చాకదక్యం?... ఔను! మన మాతని దుస్తులని, రత్నకాశే యాన్ని గుర్తించగలంగాని, అతని ముఖ స్ఫూర్తిని గుర్తించగలమా?

అర్జు : ఉత్తరూంగం లేని యిగేనా నా అభిమన్యుని సుందర దేహం? చావు బ్రతుకులలో ఎంత వ్యత్యాసం?

ద్రౌపది : సుభద్రా ఆ దేహాన్ని చూచి అంత భీతి పడతావెందుకు?

సుభద్ర : నీవు భీతిపడటంలేదా అక్కా?

ద్రౌపది : భయంకాదు బీభత్సం నాలో.

మల్లిక : మహారాజా? రాకుమారి తన నాధుని శిర్షం తానే వెదకి తెచ్చుకొంటుంది. అనుజ్ఞ వేడు తోంది.

అర్జు : ఉత్తరా నేను తేగలనమ్మా. చైత్ర నృత్యం చేసే నీ చరణాలు రణక్షోణిలో రక్తం తొక్కాలా?

[బయల్దేరుతాడు.]

ద్రౌప : ....ఉత్తరా!...

ఉతర : ....ఏమత్తా!...

ద్రౌప : ఈపాట విన్నావా? ప్రొద్దున్న బిచ్చగాడు కొంబోలు, పాడినట్లు వినిపించింది. మల్లికా వీణ శ్రుతి చేయి.

[మల్లిక వీణ మీటుతుంది]

ద్రౌప : నే పాడబోయే పాట నీకెలా తెలుసును మల్లికా? లేక, అది వీణలోనే ఉందా?

మల్లిక : ఈ వేళ సూర్యాస్తమయం అయాక శ్రీకృష్ణుడు చెట్ల ఆకులలోనుంచి పాడిన పాటమ్మా ఇది. ప్రొద్దున్న అని పొరబడు తున్నావు.

ద్రౌప : అయితే పాడు. ఉత్తర వింటుంది.

మల్లికా: నేనెందుకమ్మా. ఆ శ్రీకృష్ణుడే పాడతాడు నేను వీణతో అనుసరిస్తాను.

[చెట్ల ఆకుల్లోనుంచి]

తెరవీడిపోవే,
తెరమీాదిబొమ్మా!
మరచిపోవేయింక,
మాటాడుబొమ్మా!
యుద్ధమో యిదియే
అబద్ధమో నిజమొ;
కరువో, రుజయో, జరయొ,
గంటమోగినదే!
తెరవీడిపోవే,
తెరమీాదిబొమ్మా!
వ్యూహమే యిది
పద్మవ్యూహమే బొమ్మా!
చొరరానిదే, చొరిన
తిరిగి రాబోవే!
తెరవీడిపోవే,
తెరమీాది బొమ్మా!

మరచిపోవే యింక,
మాటాడుబొమ్మా!

ద్రౌప : చెట్ల ఆకుల్లోంచేగాని పాడవుగాబోలు. పాడుతూంటే కనబడరాదా కృష్ణా?

కృష్ణ : (ప్రవేశిస్తూ) పోనీ, చెల్లీ!

ద్రౌప : నీవుకూడా 'అబద్ధమో నిజమో' అంటున్నావు, నీకూ తెలియదూ దీనినిజం?

కృష్ణ : చెప్పేందుకింతే చెల్లీ. తెలిసేందుకు మరొకటి కావచ్చు. మాటలు తెలిసినదంతా చెప్పలేవుగా.

మల్లిక : ఈపాట ఉత్తరకి సంబంధించదు కృష్ణప్రభూ!

కృష్ణ : ఇది ఉత్తరకి వినిపించదు మల్లికా. కుంతికీ, సుభద్రకీ మాత్రమే వినిపిస్తుంది. ద్రౌపదికి అక్కర్లేకపోయినా ఆమెకు రిస్తుంది.

ధర్మ : అడుగో అర్జునుడు. ఏమర్జునా?

అర్జు : ఇదిగో, దేవదత్తమైన నాకిరీటానికి ప్రతిరూపంగా చేయించిన నాకుమారుడి కిరీటం. దీనిప్రక్కనున్న శిరస్సులలో ఒక్కటీ అభిమన్యుడిదిగా గోచరించలేదు. ఆ రుధిరసిక్తాలైన శిరస్సుల్లో అభిమన్యుని సుందర వదనాన్ని ఎలా చూడగలను?

ద్రౌప : కిరీటమూ తేగల్గినని?

అర్జు : ఓడిపోయాను ఉత్తరా, అన్ని శిరస్సుల్లో అభిమన్యుడిది కానరాలేదు. లేదేమో—

మలిక : ఎంతమాట! పునరుచ్చరించకండి.

కృష్ణ : ఉత్తరా, అర్జునుడు తేలేకపోయాడు, నీకెందు కంతపట్టు.

మలిక : పట్టుకాదు ప్రభూ! ఆమె యీ లోకపు జాలాన్ని వదిలించుకొని, తన నిరంతమైన స్వాప్నికజగత్తులో ప్రియుని యెడలేని సాయుజ్యాన్ని సాధించుకోవద్దూ. మీరెరగనిదా?

[క్షణ మాగి ఉత్తర లేస్తుంది]

కుంతి : ఉత్తరా!......

మల్లిక : తాను రణక్షోణిలోకి పోవడానికి అనుజ్ఞ కోరుతోంది.

ధర్మ : అనుజ్ఞకేమితల్లీ! మేము నీవెంటే ఉంటాం.

మలిక : మీకు అన్యకార్యాతిపాతా లుండగలవు. మీ రెందుకు శ్రమపడాలి? నేనూ రాకుమారీ పోయి రాగలం. కాదా కృష్ణప్రభూ!

కృష్ణ : మల్లికా, ఉత్తరను అనుసరించు, తూర్పున యెరుపు కమ్ముతోంది.

## రంగము : 6

ఉత్తర: ఈనాడు నా ప్రభూ!
నీ నామసంస్మరణ
ఏ నీడ లేనినా,
దీనాత్మ సంతసన॥
నీ కొరకె నా దేవ,
ఈ కఠిన వ్రతరీతి
ఏకాంత ధ్యానమీ
శోక గద్గద గీతి॥
స్వాంతమ్ము, నా నాథ
ధ్వాంతసంభరితమ్ము
కాంతి మత్తవమూర్తి
శాంతమధురము రమ్ము॥

మల్లిక : మేలుకొనే ఉన్నట్లున్నావు. కలలోకి ఇంకా ప్రవేశించ లేదా రాకుమారీ?

ఉత్తర : ఆ రాబొందు చప్పుళ్లు చేస్తోంది మల్లికా.

మల్లిక : నక్కలు రాబందుల్ని తరుముతున్నాయి.

ఉత్తర : రాబందు యెగిరినప్పుడు గాలి మొయ్యలేనట్లుగా మూలుగుతోంది చూచావా?

మల్లిక : ఇదిగో పద్మవ్యూహపు సింహద్వారం. కనబడటం లేదూ నేలమీద గొప్పలూ?

ఉత్తర : ప్రియుడితోపాటు పద్మవ్యూహం కూడా చచ్చిపోయింది కాదూ?

మల్లిక : రాజపుత్రీ, మెరుపు కంటిలో చొరబోతోంది. నీ కలలు స్థిరం కాబోతున్నాయి. చెదరగొట్టుకుంటూ వెందుకమ్మా?

ఉ తర  కరుడుగట్టిన భూమి గడ్డలా కాలికి తగులుతూంది. లత్తుక—రక్తంలా నేలకి జిగురుగా అంటుకుంటూంది. ఈ నిజం స్మృతిని వదలడం లేదు మల్లికా.

మలిక  వీటిని మించిన నీ శాశ్వతమైన స్మృతి నిన్నటికి ముందు గడచింవమ్మా. ఆ గడచిన దాంట్లోనే నీ కలలు నిలకడ చెందుతాయి. తొణుకుతా వెందుకు? తూలిపోతావు, నా చేతిని ఊతచేసుకో!

ఉత్తర  కాగడాల అబద్ధపు కాంతి మనని వెంబడిస్తోంది.

మల్లిక  నీ కంటివెలుగు నీకు సహాయపడుతుంది లేవమ్మా.

ఉత్తర : ...మల్లికా, యెవరో పిలుస్తున్నారు!

మల్లిక : కొద్దిగా ముందుకు నడవవమ్మా. వ్యూహ గర్భం ప్రవేశిస్తాం.

ఉత్తర : యెవరో పిలుస్తున్నారు మల్లికా, నీకు వినబడటం లేదూ?

మల్లిక : ఇంకొక్క మూడడుగులు.

ఉ తర  ఎవరో నా చెవిలో పలుకూదుతున్నారు. అంతకంతకు దగ్గర దగ్గరగా పలుకూదుతున్నారు!

[అభిమన్యుని స్వరం—శీర్షంలోనుంచి వెలువడుతుంది.]

రావే...
రావే...
ప్రణయమే ఒక స్వప్నమైతే
బ్రతుకె స్వప్నముగాగ నిలచిన
ప్రణయలక్ష్మీ!
పిలచుచున్నానే
రావే...!
రావే...!
రుధిరకలుషిత ధూళిధూసర
విధురవిచ్ఛిన్నార్ద్ర కంఠము
ప్రణయలక్ష్మీ!
పిలచుచున్నానే—
రావే...!
రావే...!

ఉ తర : (చెంగున గెంతి అభిమన్యుని శీర్షాన్ని అందుకుంటుంది. ఆమె అడుగులకూ నేలకూ మధ్య గాలిపొర మిగులుతుంది. అడుగు లంత తేలికగా, తొట్రుపాటుతో వేస్తుంది.)

ఇదిగో నే!
నా నాథుశీర్షమ్మ
ఇదిగో నె!
నా వలపు చెలికాని
నవమంగళాకార
మిదిగో నె!
కన లేద టే, కురుల
నునువంపు సొంపులో
తన ప్రాణసఖియ ది
ద్దిన సీలికెరటాలు! ॥ఇదిగో నె॥

మలిక  సపర్యలు చేస్తున్నావా దేవీ, చెరగుతో తుడుస్తున్నావు?

ఉత్తర : (తదేకంగా ఆ ముఖాన్ని అవలోకిస్తూ),
తన నిదురలో మూసి
కొనిన కనురెప్పపై
చిరవాసమున్న ఈ
చిరుత రేకలపాళి! ॥ఇదిగో నె॥

మలిక  నిజాన్ని యెంత ఒప్పుకోనిదానవమ్మా? ఛిన్నమస్తకాన్ని ముద్దిడుతున్నావా?

ఉ
ఈ లేత పెదవులం
దెండిపో లేదింక

నమిలి నానోట నే
నందించియున్నట్టి
కర్పూర తాంబూల
గంధసారస్యమ్ము
ఇదిగో నె!
ఇదిగో నె!

[మల్లిక భుజంమీదకు ఒరిగిపోతుంది.]

మల్లిక :

ప్రణయశీలా, అమర
ప్రణయలోలా, నీకు
ప్రణయమే, బ్రతుకౌక—
ప్రణయమే లేవే!

ప్రియుడు గేహము బాసి,
ప్రియుడు దేహము బాసి,
స్వప్న లోకాలలో
సాగిపోయాడే మొ!
స్వప్నమే నీకింక
స్వప్నమే మనికి
ప్రియవియోగము లేని
ప్రియతమస్మి నేనె
ప్రణయశీలా అమర
ప్రణయలోలా నీకు
ప్రణయమే బ్రతుకౌక,
ప్రణయమే లేవె।

[యవనిక]

# మానవస్వభావము

'హసజ'

నేడు మానవ జీవిత భవిష్యత్తునుగురించి పడుతున్న ఆందోళన, అభూతమైన విజ్ఞాన (సైన్స్) పురోగమనంలోంచి ఉత్పన్నమవుతున్న ప్రచండ సమస్యలు, స్థాపితమతాల నిరంతర వైఫల్యము, ఆధ్యాత్మిక విశ్వాసము, మానవ చైతన్యానికి సంస్థలద్వారా రూపురేఖలను దిద్దాలనుకొనే రాజకీయ ఆర్థిక రీతులు—ఇవన్నీ ఒకే ఒక అంశంచుట్టూ అల్లుకుపోయివున్నవి. అదే మానవస్వభావము.

మానవుడుగా పేర్కొనబడుతున్న జీవి యుగయుగాలక్రితం నేలపై కాలుమోపాడు. కాని విశ్వ పరిణామం దృష్ట్యా చూస్తే, మిగతా జీవరాశిగమనం బట్టిమాస్తే, మానవజాతికి ఇంకా బాల్యం కూడా రాలేదేమో అనిపిస్తుంది.

రాజ్యాలు, సామ్రాజ్యాలు, సాహిత్యము, సంస్కృతి, కళలు ఉత్కృష్టంగా విరాజిల్లిన సమయాలు ఉన్నవి. ఉద్ధతి పతనాలకు శిథిలాలు సాక్ష్యమిస్తున్నవి. అయినప్పటికికూడా మానవజాతి పరిణామంలో గతం అత్యంత అల్పంగా ఉన్నట్టే మిగతా జాతులపరిణామం సూచిస్తున్నది. ఒకవిధంగా చూస్తే, పై చెప్పుకొన్న ఉత్కృష్టత, ఉద్ధతిపతనాలు బహుశః ఎక్కువగా మానవజాతియొక్క సామాజికవ్యవస్థకు, బాహ్యరీతికి చెందినట్టివేమో. మానవస్వభావమునుబట్టే ఇవన్నీ ఏర్పడవలసినప్పటికిని, వీటన్నిటి మార్పులలో మానవస్వభావంకూడా అంతగా ఏమైనా మార్పు చెందుతోందా అని ప్రశ్న వేసుకుంటే, చరిత్రలో కొత్తపుటను తెరచినవారం అవుతాం.

మానవజాతియొక్క దైనందిన గమనం, సామాజిక నిర్మాణం, దాని వివిధరూపాలు అనేక ప్రాంతాల్లో అనేక విధాలుగా మార్పు చెందుతున్నవి. బాహ్యవాతావరణంతో, తోటిమానవులతో కలసి జీవించటంలో అనేకమైన మార్పులు సిద్ధించినవి. అగ్నినుంచి అణువిచ్ఛిత్తివరకు ఆ మార్పుల పరంపరే. ఇదంతా బాహ్య పరిస్థితులను చక్కబఱచుకొని, సంఘటితపరచుకొనటంతో సంబంధించి వున్నది. మానవస్వభావంతో సంబంధం లేని పరిణామమని కాదు. కాని మానవస్వభావ పరిణామాన్ని ముఖ్యంగా పరిశీలించాలంటే, ఈ పరిణామందాటి, మానవజాతిలోని ఆంతరంగిక దృశ్యాన్ని చూడాలి. బైట సాధించిన అద్భుతమైన మార్పులకు తగిన ప్రయోజనాన్ని, సాఫల్యాన్ని చేకూర్చేవిధంగా, లోపలకూడా మార్పులను మానవజాతి సాధించుకున్నదా? సాధించుకుంటున్నదా?

ఆంతరంగికమంటే, బాహ్య వాతావరణాన్ని మానవజీవితంగా మార్చే మానవ స్వభావము.

మానవస్వభావమంటే, స్థూలంగా స్వార్థం, స్వార్థసంరక్షణ, స్వార్థవిస్తృతి, భయం, ప్రేమ, కామం, ద్వేషం, లోభం, త్యాగం...ఇత్యాదులు. క్లుప్తంగా చెప్పాలంటే బాహ్య వాతావరణాన్ని (తోటిమానవులతో సహా) 'స్వ' అనేదాని మనుగడకు వినియోగించుకొనటం ఆదిలో మానవస్వభావంగా ఉన్నట్టు తోస్తుంది. అడవుల్లో, నదుల తీరాల్లో, వనమృగాలమధ్య, విశాలమైన భూమిపైన మానవుడు (మానవజాతి అనే అర్థంలో) ఏకాకి. అసహాయుడు. ఇతర జాతుల్లో స్నేహితులు, ఆప్తులు లేరు. ఆ అపరిచితమైన అనంతమనేదాని ఒత్తిడికి తట్టుకొని, తనఉనికిని, వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనటం జీవన్మరణ సమస్య అయింది. తనను తృటిలో హతమార్చే శక్తులు తన చుట్టూ చెల్లాచెదరుగా వున్న ఆ సమయంలో, ప్రాణాన్ని, అద్వితీయమైన మానవ రూపాన్ని కాపాడుకొనటమే కర్తవ్యమైంది. 'స్వ' అనే దానికి కూకటివేరు బహుశః ఆ విధంగా పోసుకొని వుండవచ్చు. ఒక్కొక్కప్పుడు బాహ్య వాతావరణమువల్లనేకాక, స్వజాతిలోని కొందరు వ్యక్తులవల్ల, గుంపులవల్ల కూడా మాన

వుల్లో ఒకరి కొకరికి తీవ్ర ప్రమాదము లేర్పడక తప్పదు. మాట వ్రాత చేతకాకపోవటం, తగినంత ఆహారం సులభంగా దొరక్క పోవటం, కామ ప్రేరేపణ...వీటి మూలంగా ఒకరినొకరు చంపుకొనటం తప్పనిసరి అయ్యేది. ఇతర జాతులనుంచేకాక, స్వజాతినుంచి కూడా మానవుడు తననుతా సంరక్షించుకొన వలసి వచ్చింది. భయంతో మొలకెత్తిన 'స్వ' అనేది క్రమంగా బాహుబల విశ్వాసంతో ఇతర జాతులకు, స్వజాతిలోని ఇతరులకు భయంకొల్పేదిగా పరిణమించింది. (భయపడేవాడు ఇతర్లనూ భయ పెట్టటానికే ప్రయత్నిస్తాడు).

ఈ మాదిరి వాతావరణంలో భయం, ప్రతీకారం, ప్రేమ, ద్వేషం, లోభం, స్వార్థం వగైరా ప్రవృత్తులు ఉత్పన్నమయినవి. అవసరంబట్టే అవి తలెత్తినవి. ఆ ప్రవృత్తుల మూలంగా క్రమేపీ ఈ విశీర్ణ విశ్వంలో మానవ జాతికి సుస్థిర స్థానం లభించింది. కొంతస్థాయి చిక్కాక, శరీర ప్రవృత్తుల తాపం కొంత చల్లారాక, మనుష్యునికి కొద్దిగా తీరిక చిక్కింది. తలలో పురుగు తొలచటం ఆరంభమైంది. ప్రవృత్తి కన్న పరిశీలన, ఊహ, ఆలోచన, నమ్మకం బలపడినవి. క్రమేపీ బాహ్య వాతావరణంనుంచి పారిపోవటం మానివేయడమే గాక ఆవాతావరణాన్ని గదమాయించి, మచ్చిక చేసుకొని, చివరకు తనకు వశం చేసుకొనటం నేర్చుకొన్నాడు. నిజానికి నేడు మానవజాతి మనుగడకు ప్రకృతి శక్తులుగాని, ఇతరజాతులుగాని అంత వినాశకరంగాలేవు. కథ తిలకిందులైంది.

ఇహ అలాగే స్వజాతిలో ఒకరినొకరు నాశనంగా పరిణమిల్లవలసిన అలనాటి వాతావరణంలేదు. ఆఘోరక్షుధ లేదు. ఆభయంకరమైన మృగశోనంలేదు. ఆవన్యమృగసంప్రదాయంలేదు. ఆహారం సర్వవ్యాప్తమైయుంది. జాతి అభివృద్ధితో కామతృప్తికి అవకాశాలు విస్తరించినవి. భయంస్థానే పరస్పర విశ్వాసం, విరోధంబదులు సహకారం, మాత్సర్యంస్థానే చర్చలు, వైయక్తిక ప్రతీకారంబదులు సామాజికశిక్షు క్రమంగా ఏర్పడుతున్నవి. మధ్యమధ్య ఆటవికరీతులు వ్యక్తమవుతూ నేవున్నా, మొత్తంమీద మానవజాతియొక్క సామూహికజీవితం ఆరంభంలోవలె కేవలం ప్రవృత్తులకే లోనవక, నేటికి బుద్ధిప్రాధివంవలన కొంతవరకైనా ఆలోచనాపరమై యున్నది. శారీరకభద్రతను స్థిరంచేసుకొనేఘట్టం దాటి, బుద్ధి పరిణామపథంలో మానవజాతి యాత్రచేస్తున్నది.

మానవజాతి పరిణామాన్ని ఈవిధంగా చూస్తే, అంటే, శారీరకభద్రతకు పట్టినకాలాన్ని విడదీసి చూస్తే, బుద్ధిపరిణామం ప్రబలంగా ప్రారంభమై ఎంతో కాలం కాలేదని తట్టుతుంది. శారీరకపరిణామముని బుద్ధి పరిణామమునీ వేర్వేరుగా లేవు. రెండూ ఒకే పరిణామం కాకపోతే ముందు ఉనికి సురక్షితమై వుండటం ప్రాథమిక జీవధర్మం కాబట్టి, శరీరానికి ప్రాముఖ్య ముంటుంది. అది స్థిరమయ్యాక, బుద్ధి అంశం ఆరంగంలోంచి క్రమంగా తప్పుకొని, ఇతర రంగాల్లో ఎక్కువగా అభివ్యక్త మవుతుంది. ఈవిశేమొదలై ఎంతో కాలం కాలేదు. విశ్వకాలమానంలో లక్షల సంవత్సరాలు చాలా అల్పవ్యవధులు. కాని మామూలుగా మనం ఈవిషయాన్ని తెలుసుకుంచిపోయి, విశ్వగృహంలో మానవుడు ఇంచుమించు పెనపుట్టినట్టు, పనికి మాలినవాడైనట్టు తీర్పు చెప్పేస్తాం. లేదా ఉన్నతీరే చాలా బాగుంటుందని, దానికి మించి ఆవల మరేమీ లేదని, పరిణామ మనేది సంపూర్ణమై పోయినట్లు భావించేస్తాం.

కాళ్లు, చేతులు, కళ్లు వగైరా ఇంద్రియ సాధనాలు సరిగా వినియోగంలోకి రావటానికి ఎంత కాలం పట్టిందో చూసుకుంటే, బుద్ధి అనే సాధనం స్పృహలోకివచ్చి చాలా తక్కువకాలమే అయినట్లు తెలుస్తుంది. కాబట్టి మానవజాతి విఫలమై పోయినట్టు, కొన్ని ఇతర జాతులవలెనే కాలదోషం పట్టినట్టు, లేదా ఆత్మకథలో పూర్తిగా నిమగ్నమై పోయినట్టు భావించటానికి తగిన కారణం లేదు. చాలామంది నైతిక వాదులు, మతసంస్థలవారు మానవజాతి పరిణామాన్ని లెక్కలోకి తీసుకొనకుండా, ఏదో అదృశ్యశక్తి, అలౌకికశక్తి ఉన్నట్టు, దానికి తామే రాయబార్లైనట్టు, మానవుడు పాపిష్ఠి అని, పాపంలోంచి బైటపడాలంటే పరిణామం లేకుండా స్తంభించిపోయి తమముందు మోకరిల్లాలన్నట్టు ప్రచారం చేస్తారు. వీరిప్రచారం గత పరిణామంతో ఏమాత్రమూ సంబంధంలేనట్టిదై, ముందు మనుష్యుడికి ఆత్మ విశ్వాసం పూర్తిగా పోయేట్టు చేసింది. వెంటనే వేరే ఏదో ఒక అదృశ్యశక్తి వుందని, దానికి తామే ప్రతినిధులమని చెప్పి, పరిణామక్రమానికి భిన్నంగా విశ్వామిత్ర

సృష్టినిచేసి, దాని కనుగుణంగా జీవించమని ఆదేశిస్తూ ఉంటారువీరు. తన ఉనికిని పాతాళంలోకి తొక్కేసుకొన్నవాడి ధ్యాస దైవంమీద ఉన్నా ఒకటే, దయ్యంమీద వున్నా వొకటే.

ఇట్టి ప్రచారంవలన ఏదైనా కొంత మనశ్శాంతి ఉండవచ్చునేమోగాని, మనుష్యుడికి వికాసంమటుకు శూన్యం. ఈతప్పు దృక్పథానికి లోనవకుండా, మనం మనుష్యునికేసి, అతని పరిణామంకేసి, అతను జీవించియున్న విశ్వప్రకృతికేసి చూస్తే, మనకు వాస్తవం బోధపడుతుంది. వాస్తవం మన ఆశలకు తగ్గట్టుగా లేకపోవచ్చు. కాని మన ఆశాసమూహం కాదు యథార్థమంటే. ఏది ఉన్నదో అనేవాస్తవం.

బుద్ధిపరిణామంవలన, బాహ్యజ్ఞానమే కాక, ఆత్మజ్ఞానమూ సిద్ధిస్తుంది. ఇందుమూలంగా ఒకవిధమైన విమర్శ రేకెత్తుతుంది. ఫలితంగా పశ్చాత్తాపం కలుగుతుంది. పొరబాట్లు జరిగినట్లు, ఆ పొరబాట్లు జరుగక పోతె చాలా బాగుండేదిసుమా అని అనిపిస్తుంది. సాధ్యమైనంతవరకు మళ్లీ అవే పొరబాట్లను చేయకుండా వుండాలనే వివేకము ఉదయిస్తుంది.

అలాగే మానవజాతి గమనాన్ని పరికిస్తే, జాతి మనుగడకే ముప్పు కల్గించే స్వయంకృతాపరాధాలు చాలా కనపడుతవి. వీటిబట్టి వెంటనే 'ఛ్ఛీ! ఏం లాభం లేదు. మానవుడి కథ వ్రాయటం పూర్తి అయి పోయింది. కాకపోతే పూర్తిగా చదవటానికిమటుకే మరికొంతకాలం పట్టుతుంది' అనిపిస్తుంది.

ఒక విషయాన్నిగురించి ప్రసక్తి కలిగినప్పుడు మామూలుగా దాన్ని పరిశీలించి, అర్థం చేసుకోవటం కన్న, దానినిగురించి ఒక ఖచ్చితమైన ఆలోచనకు, నిర్ణయానికి రావటం ఎక్కువ ముఖ్యంగా ఉంటుంది. ఇది సృజనాత్మకమైన దృక్పథం కాదు. ఏదో అనతిక్రమ్యమైన విధి ఒకటి జీవితాన్ని ఒక ఖచ్చితమైన మూసలో అచ్చుపోసినట్టు, ప్రతి సంఘటనను ఒక రాజశాసనంగా అనుభవించితీరక తప్పదని నిర్ణయానికి వస్తాం. అనుభవాలను మార్చుకొనగలిగే శక్తి బుద్ధిపరిణామంలో గర్భితమైయుందనే వాస్తవదృష్టి సోకదు. అనుభవమనేది స్వభావంపై ఖచ్చితమైన తీర్పుగా ఎంచి, సంకెళ్లు తగిలించుకుంటాం. అలాకాక పరిణామదృక్పథంతో చూస్తే, ప్రతి పొరబాటు వాస్తవాన్ని, సత్యాన్ని మరింతసుస్పష్టం చేస్తుంది. ఏదీ ఖచ్చితమైన ముగింపుగా గోచరించదు. ముగింపు అనుకొన్న ప్రతిదీ మరొక ఆరంభంగా పరిణమిస్తుంది.

కాబట్టి స్వల్పమైన గత చరిత్రను లెక్కలోకి దీసుకొని (అదీ పరిణామం బట్టి కాకుండా, ఊహించుకొన్న ఏ స్వాప్నిక దివ్య లక్ష్యం బట్టియో, భౌతికలక్ష్యం బట్టియో విచారించి), ఆ ప్రకారం మానవజాతి భవిష్యత్తునుగురించి ఇప్పుడే నిరాశతో, గర్వంతో, అసంపూర్ణ జ్ఞానంతో, తీర్పుచెప్పి వేయటం సరియైనపద్ధతి కాదు. భవిష్యత్తును వర్తమానపుత్రాసులో, గతపుత్రాసులో ఇట్టేతూచేయటంకన్న పొరబాటు లేదు. పరిణామంలో ఈత్రికాలములకున్న అర్థాన్ని మఱచిపోవటమే అది.

ఇక నేటివరకు వృద్ధిచెందియున్న మానవ స్వభావాన్ని పరికిద్దాం. ముఖ్యంగా గమనింపవలసిన విషయం ఒకటివుంది. ఎన్నో అనుకోని మార్పులను సాధించి, బాహ్యప్రకృతిని, కోటిమానవులను ఏదో ఒకవిధమైన మిత్రసంబంధంలోకి తెచ్చుకొన్నప్పటికి, మనుష్యుడికి ఈ తన విజయాల్లో తనకే గాఢ నమ్మకం లేకుండాఉన్నట్టు తోస్తుంది. ఆ నాడు దండకారణ్యాల్లో అడుగడుగున పొందిన మనోభయంతోనే నేడూ చలిస్తున్నాడు. ఆ భయం అప్పటి అవసరంతో తీరిపోలేదు. అది పాతుకొనిపోయింది. సంచారభయం లేదు. నేల, నీరు, ఆకాశం అంతటా సంచరించే ధీమా ఉన్నప్పటికి, భయమనేదే మళ్లీ ఒక వింత క్రూరమృగంవలె తయారైంది. ఇన్ని యుగాలు దాటినా, ప్రపంచ మంతటికీ నాశనం తేగల్గిన శక్తి సిద్ధించినప్పటికి ఆ అనాది బర్బర భయం మటుకు పోలేదు. వయస్సువచ్చినా మోకాళ్ళమీద నే పాకులాడటం ఎంత హాస్యాస్పదంగా, వైకల్యచిహ్నంగా ఉంటుందో, అలాగే ఆటవికత పోయి నాగరికత, అందులో నేటి నాగరికతవచ్చినా భయమనేది ఇంకా ఉంచటంకూడా హాస్యాస్పదమూ, వైకల్య చిహ్నమూను.

ఈ పురాతన భయంవల్లనే, అధునాతన యుగంలోకూడా ఇంకా మానవజాతి సంరక్షణ స్థాయిలోనే సదమదమవుతూ వుంది. వ్యష్టి లప్పుడప్పుడు అక్కడక్కడ ఈ స్థాయినిదాటి, వికాసస్థాయిలో అడుగుపెట్టటమేకాక, ఉత్కృష్టస్థితిని చేరటం

కూడా ఎరుగుదుము. కాని మానవజాతి మొత్తంమీద ఇంకా సంరక్షణస్థాయిలో నే కూరుకొనిపోయివున్నది. భయగ్రస్తమయేవుంది. రాజకీయ ఆర్థిక వ్యవస్థలన్నీ అన్ని దేశాల్లోనూ ఈప్రచండభయానికే ప్రతిబింబాలు.

ఒకేవిధంగా నేడున్నంతభయం గడచిన కొన్ని సమయాల్లో లేనట్టుతోస్తుంది. అందుకే ఆయా సమయాల్లో మానవుడు రాతిపై, మాటల్లో, రంగుల్లో, నడవడిలో, అనేక శిల్పరీతుల్లో తననుతాను అంతం తగానైనా వ్యక్తంచేసుకొనగలిగాడు. వికాసం పొందగలిగాడు. ఈ అనాదిభయం ఉధృతంగా ఉన్న ప్రాంతాల్లో, సమయాల్లో ఈ వికాసదశకు గ్రహణం పట్టుతూనేవుంటుంది. నేడు సాహిత్య శిల్పరంగాల్లో ఉత్కృష్టపరిణతి కనబడకపోవటానికి కారణం బహుశః నేటి దుర్భర భయవాతావరణమేమో. భయం మనస్సును, జీవాన్ని నొక్కివేస్తుంది. ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. వ్యక్తినైనాసరే, జాతినైనాసరే. అథవా ఎలాగో పెగిలి బైటపడినా, ఆ వికాసంకూడా భయకంపననే ప్రతిబింబిస్తుంది. నిర్జీవమైన, నిరాశాపూరితమైన శ్మశానజ్వాలలచే ఉద్రిక్తంగా ఆకర్షింపబడిన సాహిత్యం పేజీలను నింపేస్తుంది. (తెలుగు సాహిత్యంలో నేడు యీ ధోరణి ఎంతో సుస్పష్టం.)

భయాన్నిబట్టే,వస్తువులకు, తోటివారలకు విశ్వతపు విలువలను అంటగట్టడం జరుగుతుంది. యాజమాన్యం, లోభం, అధికారం, ప్రాబల్యం, దాస్యం, అణకువ, మోసంవగైరా ప్రవృత్తులన్నీ తలెత్తుతవి.

నేను, నా స్త్రీ, నా కుటుంబం, నా గుంపు, నా కొండ, నా మైదానం అని ఒకప్పుడు అవసరమైనట్టి, భయ కల్పితమైనట్టి ఆలోచనలే నేడూ మానవుల జీవితానికి ప్రాతిపదికలుగా ఉంటున్నవి. జాతివృష్టి కలగలేదింకా. వ్యక్తి స్వార్థం, కుటుంబ స్వార్థం, గుంపుతత్వం, దేశగర్వం వగైరాలన్నీ యీ ప్రాతిపదికల్లోంచి పుట్టుకొచ్చినవే. ఉన్నది సమగ్ర దృష్టిగాదు. పాక్షిక దృష్టి. పాక్షిక దృష్టిలోంచి సమగ్రదృష్టిలోకి పరిణతి పొందనంతవరకు, వ్యక్తి, సమాజం, జాతి అంతర్యుద్ధాల్లో తగుల్కొనక తప్పదు. ఒకదృష్టియొక్క అవసరం తీరి, మరొకమెట్టు పైకి వెళ్ళే తరుణంలో, ఆ పూర్వ దృష్టినే యింకా అంటిపెట్టుకొని వేళ్లాడటమంటే, పరిణామక్రమాన్ని స్తంభింపజేయటం. ఇంకోవిధంగా చెప్పాలంటే, స్వజాతియొక్క క్రమక్షీణత. జీవశక్తిని దుబారా చేయటం.

సామాన్యంగా నేటి వ్యక్తివృష్టి, సంస్థల వ్యవస్థల రీతి, రాజకీయ ఆర్థిక మతసంకల్పాలు అవసరం తీరిన పూర్వ రీతినే అంటిపెట్టుకొని వున్నవి. అందువల్లనే నేటి అసంఖ్యాక సంస్థలన్నీ, పేరుకు మానవశ్రేయస్సే వాటికి లక్ష్యమైనప్పటికి, పాక్షిక దృష్టితో పాత ఘర్షణలకే, దైన్యాలకే కొత్తవేషాలు తగిలిస్తున్నవి. రాజకీయ పార్టీలన్నీ గుంపుతత్వాన్నే ప్రతిబింబిస్తున్నవి. ఫలానా లోయలకొండ, మైదానం నా గుంపుదన్నా అవాలి, లేదా నీ గుంపుదన్నా అవాలి అనే అనాది బర్బర మనస్తత్వమే నేడు రాజకీయ అధికారంకోసం పడే పార్టీల ఎత్తుగడల్లో, అవస్థల్లో ప్రతిబింబిస్తోంది. ఆనాడు గుంపు నాయకులమధ్య సంఘర్షణల్లో ప్రజలు హతమైనట్టే, నేడూ రాజకీయపు గుంపు నాయకులమధ్య సామాన్యప్రజానీకం హతులవుతున్నారు.

ఈ అనాది భయం ప్రబలంగా ఉన్నంతవరకు, మానవ స్వభావంలో పరిణామ ప్రోత్సాహానికి అనుకూలమైన మార్పులు సిద్ధించవు. స్థిరపడవు. శక్తివంతి మనవు ఆదిలో నైయక్తిక ప్రాథమిక నుంచి వికాసానికి తోడ్పడినప్పటికి, అది సరైన గమనం కాలేదు. స్థాపిత మతాలు ఆయా సమాజాల్లో ఏర్పడి ఒక శాంత వాతావరణాన్ని నిర్మించటానికి ఉపయోగపడినప్పటికి, గుంపు తత్వాన్ని విడనాడలేకపోయినవి. వివిధ దేశాల్లో వివిధ మతాలమధ్య జరిగిన దారుణ యుద్ధాలే ఇందుకు నిదర్శనం. దైవం పేరిట సల్పిన ఈ హత్యాకాండ బర్బరస్థాయిని మించిపోయింది. ఆర్థిక రాజకీయ వ్యవస్థలు ఎంతెంత రక్తపాతాన్ని, ఎన్ని ప్రమాదాలను తెచ్చిపెట్టుతున్నదీ చూస్తూనేవున్నాం.

విశ్వపరిణామగతిలో బుద్ధిప్రాభవానికి విశిష్ట స్థాన మున్నది. ఇతర జాతుల మనుగడ ఇంచుమించు పూర్తిగా ప్రవృత్తుల అనుసరణపైనే, పారంపర్య క్రమానుగతమైన లక్షణాలమీదనే ఆధారపడివుంది. ఆ ఖచ్చితమైన పరిమితులమధ్య ఆయా జాతుల పరిణతి పాశబద్ధమై వుంది. ఆ పరిమితుల్లో కొత్త అంశాలను, రీతులను ఆయా జాతులు అభివ్యక్తంచేయగలగటం అసహజం. కాని మానవజాతి ఆ విధంగా బద్ధమైలేదు.

జన్మానుగతికమైన లక్షణాల ప్రభావము, వారసత్వ ప్రభావము, ప్రవృత్తుల ప్రభావము ప్రచండంగా ఉన్నప్పటికిని, బుద్ధి ప్రాభవంతో వాటి సంకెళ్ల లోంచి తనను తా మనుష్యుడు విడిపించుకొనగలడు. వాటి ప్రేరణకు లొంగక, వాటిని మించిన గమనానికి వాటిని పూన్చగలడు. తోటి వ్యక్తులతో కేవలం విభిన్న ప్రవృత్తుల ద్వారా తికమకపడక, ప్రేమ ద్వారా, సౌజన్యం ద్వారా, సహకారం ద్వారా సాంగత్యాన్ని ఏర్పరచుకొని, స్థిరపరచుకొనగలడు. రానున్న పరిణామదశకు మనుష్యుడు బహుశః ఒక విధంగా వంతెన. ఆ దశను బుద్ధి ద్వారా సాధించ కలగాలి. మొదట అయోమయం...తర్వాత ప్రవృత్తులు...ఆ తర్వాత బుద్ధి...పరంపర ఇలా ఉన్నట్లు తోస్తుంది. ఒకానొకప్పుడు అవసరమై, ఇప్పుడు అవరోధములుగా ఉంటున్న అంశములను బుద్ధి ద్వారా అతిక్రమించుకొని, ముందుకు సాగిపోవాలి. ఈ అవకాశం ఒక్క మానవజాతికే ఉంది. కాబట్టి పరిణామగతికి ఇక బాధ్యత యావత్తూ మనుష్యునికే.

అయితే ఈ పరిణామ దృష్టి సోకిన వ్యక్తులే మానవజాతిని ముందుకు తీసుకుపోతారు. కాని వ్యక్తులు జాతి మెడకు గుదిబండలా వేలాడుతూ ముందడుగు వేయనీయరు. మానవస్వభావం ఈ పరిణామదృష్టిననుసరించి మారినప్పుడే, ఫలితం సంపూర్ణంగా ఉంటుంది. కేవలం శాంతంగా ఉండటంకోసం, ఒకరికొకరు అపకారం చేసుకొనకుండా ఉండేట్టు చేయటంకోసం స్థాపిత మతాలు, శాసనాలు, నైతికవాదులు, కొంతమంది సత్పురుషులు ఎంతైనా ప్రయత్నించవచ్చు. కాని కేవల శాంత వాతావరణం మాత్రమే చాలదు. అందుకనే ఇలా ప్రేరితమైన వాతావరణాలు త్వరలోనే విసుగును, అసంతృప్తిని కలిగించి, దుష్ఫలితాలకు దారితీస్తవి. పరిణామంలో శాంతి ఒక అంశం. అదే సంపూర్ణం కాదు.

ఏదో ఒక అదృశ్య దైవశక్తితోనో, లేక కేవలం బాహ్యవాతావరణంతోనో మానవ స్వభావాన్ని మార్చాలని అనేక ప్రయత్నాలు అనాదినుంచి జరుగుతున్నవి. కాని అవి వాస్తవానికి, పరిణామగతికి సంబంధించినవి కావు కాబట్టి, నిరంతరం విఫలమవుతూనే వస్తున్నవి. విగ్రహాలవలన, ఇనప్పెట్టెలవలన మానవ స్వభావం సరిగ్గా ఏమీ మార్పు చెందలేదు. ఆ రెంటిని కూడా మనుష్యుడు ఏదో ఒక భయంలోంచే సృష్టించుకుంటున్నాడు. ఐహికాముష్మికాలు రెంటిని దాటితేనే, మనుష్యుడికి తన మార్గం తనకు దొరుకుతుంది.

ఈ పరిణామదృష్టి మానవుల పరస్పర సంబంధాల్లో ప్రతిబింబించాలి. మార్పులను సాధించటానికి ఒకవిధంగా ఇల్లు పెద్ద పరిశోధనాలయం. ఇంట్లో వుండే వాతావరణం ఇంతవఱకూ ఎక్కువ సాపిశ మతాల విచిత్ర విశ్వాసాలకు, ఆర్జన తత్వానికి లోనై వుంది. అలాగే పాఠశాలల్లోనూ. ఈ అపసవ్యదృష్టి తొలగి, పరిణామదృష్టి ప్రసరిస్తే, ఇల్లు, బడి కూడా తదుపరి సమగ్ర జీవితానికి తోడ్పడుతవి. ఇంట్లో బడిలో ఆటవిక ప్రకృతికి స్వస్తి చెప్పితే, నూతన మనుష్యుడికి సుస్వాగతమిచ్చినవారం అవుతాం. అనుభవాలను పరిశీలించుకుని, నిజానిజాలను తేల్చుకొని, వాస్తవాన్ని విద్యార్థిముందు పెట్టటమే విద్య. విద్యకు చాలా ప్రాముఖ్యముంది. బుద్ధి అనే పరిణామ గర్భితమైన అంశపు ఫలితమే విద్య. కాని మనకు విద్య కేవలం ఆటవికయుగంలోని విల్లమ్ములకు, రాతి పనిముట్లకు, అంటే ఆహారసంహారసాధనాలకు ప్రత్యామ్నాయంగా మటుకే ఉపకరిస్తోంది. శారీరక పోషణ, మానసిక నిశ్చయత్వం వీటికొఱకే వినియోగించబడుతోంది. అంతకుమించిన దానికి విద్య పూనుకొననంతవఱకు మానవస్వభావంలో మార్పులకు అవకాశాలు తగినంతగా లభించవు. విచిత్రం ఏమంటే, విద్యాధికుల్లోకూడా చాలా మందికి పరిణామదృష్టి వుండదు. సాహిత్య శిల్ప రంగాల్లో మరీ లోపించి వుంటుంది. కాబట్టే సాహిత్యం, తదితర శిల్పరంగాలు కాలక్షేపానికిమాత్రమే అనే ఉద్దేశ్యం రచయితల్లోనూ, ప్రజల్లోనూ వ్యాపించింది. ఈ సాహిత్య శిల్పాల్లో మనిషికి తన అయోమయాన్ని తొలగించేదేదీ కనబడదు. వినోదానికి, ఒక రకమైన ఉపశాంతికి వీలు కనబడుతుంది. సాహిత్యం, శిల్పం రచించేవారికే పరిణామదృష్టి అంటే, ఈ విశాలవిశ్వంలో మనుష్యుడికున్న స్థానం ఏమిటి అనే దృక్పథం లోపించినప్పుడు, వారి రచనలుమటుకు అందుకు భిన్నంగా ఎలా ఉండగలవు? కాబట్టి చాలామంది రచయితలకు (కొంతమంది తెలుగు రచయితలకు ఇది ఉగ్గుబాలతో వచ్చిన విద్య), చేతనైనదలా బాగా ఉద్రేకపరచటం

పూనక మెక్కించటం లేకపోతే నిస్పృహ చెందించి, నిరాశతో కుంగదీయించటం, అసలే తోట్రుపడుతున్నవారిని అణగార్చివేయటం. కాకపోతే తిట్టు శక్తి బాగా అబ్బింది.

నేటి ముఖ్యసమస్య ఇదే: మానవస్వభావం ఎలా మారుతుంది అని. మారనిదే మానవజాతికి భవితవ్యం లేదు. ఈ మార్పు మానవుని పూర్వపు ఉనికిని, నేటి ఉనికిని, మిగతా విశ్వరీతిని అర్థంచేసుకొన్నప్పుడే సిద్ధించటానికి వీలుకలుగవచ్చు మిగతా కుతూహలాలన్నీ వాస్తవదృష్టిని కప్పివేస్తవి. మన సంబంధాల్లో, ఇళ్ళలో, పాఠశాలల్లో, సంస్థల్లో ఆటవిక వారసత్వాన్నే అనుసరిస్తూ, స్థిరపరచుకుంటూ, మానవస్వభావం మటుకు దానంతట అది మారిపోవాలి, ఉత్తమ మనుష్యుడు ఉదయించాలి, మానవుడు దివ్యాంశ సంపూర్ణుడవాలి అంటే ప్రయోజన మేమిటి?

తమదైవంకోసం, ఆస్తులకోసం, అధికారంకోసం జీవించాలని మతాలు, ఆర్థికవ్యవస్థలు, కుటుంబం, రాజకీయసంస్థలు, ప్రభుత్వాలు మనుష్యుల కుపదేశించి ఆదేశించుతూ ఉన్నంతవరకు మానవజాతి పరిణామ పథంలో వెనకబడే వుంటుంది—ఎన్ని కొత్త దేవుళ్లను, ప్రకృతి రహస్యాలను, చిద్విలాసాలను, లాభాలను కనిపెట్టినప్పటికిని, ఈ పరిణామదృష్టి కొంతవరకు నేడు విజ్ఞానరంగంలో ప్రతిబింబిస్తోంది. ఇతర రంగాల్లోకూడా ప్రతిబింబించినప్పుడే, విజ్ఞానము ఉత్తమునికోసానికి దోహదపడుతుంది. లేకపోతే వైజ్ఞానిక వైభవం, పురోగమనం కూడా మత ఆర్థిక రాజకీయ కళ్మలంచే కలుషితమై వ్యర్థమవుతుంది. నిజానికి నేడు విఫలమైంది విజ్ఞానపురంగం కాదు—ముఖ్యముగా గొప్పగా చెప్పుకొనే మత నైతిక రాజకీయ సాహిత్యరంగాలు.

మార్పులనియు, నేటి భౌతికశాస్త్రము మనకు బోధించుచున్నది. న్యూట్రానుకు ప్రోటానుతో భారసామ్యముండినను ప్రోటానుకున్న విద్యుదావేశము న్యూట్రానుకు లేదు. అదిగాక న్యూట్రాను అనుకూల పరిస్థితులలో ప్రోటానుగా మారగలదు. ఈ వినిమయము కొన్ని కారణము లుపస్థితిమైనప్పుడు పరమాణుకేంద్రకమందు జరుగును. ఎలెక్ట్రానులు పరమాణు కేంద్రకమందుండవు. పరమాణు శరీరమందలి కేంద్రకము చుట్టు ప్రాకారరూపమున నివి వర్తించును. ఈ విషయముల పరిచయము ముందు రాబోవు సృష్టి మీమాంసాప్రస్తరమున కావశ్యకము.

విశ్వముపుట్టి నేటికి 350 కోట్ల సంవత్సరముల కాలము గడచినదని, వేరువేరు రకముల గణితముల ననుసరించి ఖగోళవేత్త లంచనా వేసియున్నారు. ఈ కాలవ్యవధికి పూర్వము, నేడు విశ్వాంతరాళమున వ్రేలుచున్న నక్షత్రములు, నక్షత్రవీథులు, నెబ్యులాలు, పరమాణువులు, పరమాణుకేంద్రకములు, వీటియందున్న ద్రవ్యరాశియంతయు ఒకచోట కలిసి ముద్దగా నుండెను. ద్రవ్యమును వివిధపరిణామములకు ప్రేరించు శక్తి ద్రవ్యమునకు పురోవర్తిగా నుండకపోయినను సమానకాలవర్తిగానైన నుండవలెనుగదా! ఈరాశియందు ద్రవ్యము శక్తియను ఈ మహాపదార్థములు రెండును ఒకదానితో నొకటి పెనగొని, దానియందున్న యేభాగమునైనగాని ఇది ద్రవ్యము ఇది శక్తియని నిర్ధరించుటకు వీలులేని యనిర్వచనీయ స్థితిలో నుండెను. ఈ రాశియొక్క ఉష్ణోగ్రత అత్యధికముగా 100 కోట్ల డిగ్రీలశ్రేణిలో నుండెను. దీని సాంద్రతకూడ అత్యంతము. ఈ యుదగ్ర ఉష్ణోగ్రత మూలముగా నారాశికి ప్రకాశముండుటయేగాక దానియందున్న ద్రవ్యమంతయు దాని చరమాంశలగు ప్రోటానులు, న్యూట్రానులు ఎలక్ట్రానులక్రింద విడిపోయియుండినట్లూహించవలెను. ఈ యత్యంత ఉష్ణోగ్రతాస్థితిలో ఆ రాశియందున్న కణములు అచ్చటి కఠోరతాపముచే అత్యుదగ్రక్రమరహిత చలనములను స్వీకరించును. కటిమూలముగా కణములు పరస్పరము కలిసికొని కూటములుగా నేర్పడుటకు వీలులేక యుండెను.

ముద్దగానున్న ఈ ద్రవ్యరాశి క్రమముగా వ్యాకోచించుటకు ప్రారంభించినది. వ్యాకోచనమూలముగా ఉష్ణోగ్రత కొంత తగ్గి ఆ రాశిలో రెండు భిన్న ప్రక్రియలు ఒకేసారి ప్రారంభించినవి. అందు మొదటిది: న్యూట్రానుల క్షయము — న్యూట్రానులు, ప్రోటానులు, ఎలక్ట్రానులుగా మారుటవలన న్యూట్రానుల సంఖ్య తగ్గి, వీటినుండి ఇంకను క్లిష్టతరరచనగల పరమాణువులు యేర్పడుటకు వీలులేకపోయినది. రెండవది. శేషించిన న్యూట్రానులు, ప్రోటానులు పరస్పరము సంయోగించి నేడు ద్రవ్యశరీరమందు మనకు దొరసిల్లు, క్లిష్ట, క్లిష్టతర, క్లిష్టతమ పరమాణుకేంద్రక కూటము లేర్పడినవి. ఒకేసారి జరుగుచున్న ఈ రెండు ప్రక్రియలలో తాత్కాలికముగా నేదిది మీద చేయియో దానినిబట్టి నేడు మనకు ప్రకృతిలో సంఘటిల్లు వివిధపరమాణువుల బాహుళ్యములయందు వ్యత్యాసము లేర్పడినవి. ప్రాథమికద్రవ్యరాశి వ్యాకోచించుటకు మొదలుపెట్టినంతకాలము అందున్న న్యూట్రానులు మార్పునొందుట కవకాశము లేదు. వ్యాకోచన మొదలిడి ఉష్ణోగ్రత కొంత తగ్గసరికి న్యూట్రానులు వాటియంతటవి క్షయించుటకు మొదలుపెట్టుటచే ప్రాథమిక ద్రవ్యకణములగు న్యూట్రాను ప్రోటాను ఎలక్ట్రానులనుండి తక్కిన పరమాణుజాతు లన్నియు జనించుటకు ఒక యరగంట కన్న యెక్కువ కాలము పట్టలేదు. ఏలయన తొలిని న్యూట్రానులు సంయోగకార్యమందు పాలు తీసికొనుటకు అనువైనపరిస్థితులు కల్పితమైన కాలము నుండి న్యూట్రాను జీవితావధి యొక యరగంటకన్న నెక్కువ యుండదు. అందువలన జరుగవలసిన మార్పంతయు నా యరగంటకాలవ్యవధిలోనే జరిగి యుండవలయును.

వివిధపరమాణు జాతుల భిన్న ధర్మములు, వాటి రచనకు కారణము న్యూట్రాను, ప్రోటానుల సంఖ్యనుబట్టి యేర్పడినవి.

350 కోట్ల సంవత్సరములకు పూర్వము ప్రారంభించి యొక యరగంట కాలవ్యవధిలో జరిగిపోయిన ప్రక్రియయొక్క ఫలము లిప్పటివరకును స్థిరముగా నెలకొని యున్నవని చెప్పుట వెర్రివాని మాటలవలె దోచవచ్చును. కాని యొక యరగంట కాలము 350 కోట్ల సంవత్సరముల కాలరాశిలో ఎన్నవవంతుండునో, మైక్రో సెకండు (సెకండులో పది లక్షవ వంతు) పది సంవత్సరముల కాలఖండములో అంతే

వంతుండునని త్రైరాశిక గణిత విధానమున సులభముగా చూపించవచ్చును. సరిగా మైక్రో సెకండు కాల వ్యవధిలో హిరోషిమాపై ప్రేలిన ఆటంబాంబు శకలములనుండి యుద్గతమైన ప్రాణి హింసాప్రవణమగు రశ్మి ప్రసారముయొక్క దారుణమారక ఫలితము లీరోజు వరకును బాంబుపడిన చోటను దాని చుట్టు పట్లను పొడచూపుచునే యున్నది.

వ్యాకోచము ప్రారంభించిన యుత్తరక్షణము నందే న్యూట్రానులక్షయముకూడ మొదలిడినను, న్యూట్రాను ప్రోటాను సంమేళనమువలన క్లిష్టపరమాణు కేంద్రకము లేర్పడుట, మరి యైదునిమిషముల తరువాత సంఘటిల్లినదియని చూపవచ్చును. ఏలయన వ్యాకోచన ప్రారంభించిన అయిదు నిమిషములకు గాని ఉష్ణోగ్రత 10 కోట్ల డిగ్రీలకు తగ్గి పరమాణు రచన కనుకూలములగు పరిస్థితులు తటస్థించలేదు. అరగంట తరువాత పరమాణు సృష్టికార్య మంతయు ముగిసి రాశిలో తోలినున్న న్యూట్రానులన్నియు క్షయమును పొందినవి. అందు తరువాత మిగిలియున్నవి హైడ్రోజని, హీలియము పరమాణువులే. ఇవి యీ రాశి యందు సమాన సంఖ్యలో నుండెను.

ఒక ప్రోటాను ఒక న్యూట్రాను సంయోగము వలన నిర్మితమైన డోయిటేరియం అను పేరుగల పరమాణువు ఆ రాశిలో నూటికి మూడునాల్గుపాళ్లుండెనని లెక్కలవల్ల తేలినది. ఏలయన పరమాణు రచనా ప్రక్రియ సోపాన క్రమములో జరుగుటలో యంతకు ముందు జనించిన డోయిటేరియ మంతయు క్లిష్టతర మూలద్రవ్యముల యుత్పత్తికి వ్యయమైపోయినది. నేడు విశ్వమందున్న మొత్తపు ద్రవ్యములో నూటికి 50 పాళ్లుకన్న కొంచె మధికము హైడ్రోజని, దీని కన్న కొంచెము తక్కువ హీలియము, నూటికొకపాలు తక్కిన క్లిష్టతర మూలద్రవ్యము లున్నవని పరమాణు శాస్త్రజ్ఞులు వేసినమదుపుతో పైన వివరించిన రాశి ఘటికముల విషయమైన లెక్క సరిపోవుచున్నది. అందుచే పైనిప్రతిపాదితమైన పరమాణూత్పత్తి సిద్ధాంతము కొంత సమంజసమైనదియే యని తోచుచున్నది. కాని ఈసిద్ధాంతము ప్రత్యవేక్షణవలన లభ్యములైన భూతార్థముల నన్నిటిని సమగ్రముగా వివరించలేకున్నది. అందు ముఖ్యముగా నీ క్రిందివిషయము సిద్ధాంతముతో సంవదించలేదు. క్లిష్టపరమాణుకేంద్రకము లన్నియు, వీటి ఘటికములగు న్యూట్రాను ప్రోటానులు వివిధసంఖ్యలలో సంయోగించుటచే కలిగినవియనిగదా చెప్పియుంటిమి. ఈప్రోటాను న్యూట్రాను సంఖ్య ప్రతి పరమాణువుయొక్క భారమును నిర్ణయించును. పరమాణు భారక్రమములో ఒకటి మొదలుకొని గరిష్టభారమువరకును మధ్యనున్న సంఖ్యలలో, ఏనిర్దిష్ట సంఖ్యయైనను యొకనిర్దిష్ట పరమాణు భారమును గుర్తించును. ఇట్లే మధ్యనున్న సంఖ్యలన్నిటికిని యనుగుణముగ పరమాణుభారములుండు ననుటకు ఎంతేనియు సంభావనకలదు. కాని పైని వివరించిన పరమాణు నిర్మాణప్రక్రియ అయిదు అను సంఖ్యను దాటివేసినది. అనగా 5 పరమాణు భారము గల స్థిరమైన పరమాణుకేంద్రక మేదియును ప్రకృతిలో గానరాదు.

వేరువేరు రకముల పరమాణుకేంద్రకములు మొదటి యరగంటలో నేర్పడినతరువాత, నూతన కల్పితమైన ఈ ద్రవ్యసముదాయము మనల నేకరూపముగా చిరకాలము వ్యాకోచించుచునే యున్నది. ఆరాశియందు శక్తికూడ అంతర్లీనమై యున్నదంటిమి. ఆశక్తి, వేడి, వెలుతురు యను రెండు ప్రధానరూపముల దాల్చియున్నది. ఈ రెండిటికిని సామాన్యనామము వికిరణము. ఆరాశియందున్న వికిరణశక్తి అందున్న ద్రవ్యముకన్న చాల కార్యకారియు బలవత్తరమును అయి యుండుట ఆ కాలఖండముయొక్క విశిష్టలక్షణము. వికిరణశక్తి కొకవిధమైన భారమున్నదను విషయము ఐన్‌స్టైయిన్ తన సాపేక్షతావాదమునందు వెల్లడించెను. శక్తికి భారమున్నదను విషయమును $E=mc^2$ అను సమీకరణమువలన ఐన్‌స్టయిన్ సూత్రీకరించెను. ఇందు $E$ అనునది శక్తి, $m$ అనునది భారము, $c^2$ అనునది కాంతివేగముయొక్క వర్గము. ఈ సమీకరణమందు ఒక ప్రక్కనున్న శక్తి ($E$) మరి యొక ప్రక్కనున్న ద్రవ్యసంచయము ($m$)తో సమతులితముగా జేయబడినది. ధర్మసామ్యముండినగాని రెండురాసుల సమీకరణము సార్థకము కాదను విషయము గణితశాస్త్రసిద్ధము పై సమీకరణమువలన నొకనిర్దిష్టశక్తి రాశియొక్క భారమును, ఆశక్తిరాశిని వెలుతురుయొక్క వేగవర్గము($c^2$)చే భాగించిన లబ్ధమగునని తెలియుచున్నది. కాని ఈ నియమము ననుసరించి మన నివాసగృహములయందు విశాలమైన యొకగదిలో

వ్యాపించియున్న వెలుతురు మెట్రికు గాములో (గ్రాముమునకు పది లక్షలవవంతు) పదిలక్షవవంతు భారముండునని లెక్కగట్టి చూపవచ్చును. ఆగదిలోనున్న గాలియొక్క భారముతో అందున్న వెలుతురు భారమును త్రాసుపై వేసి చూచినచో వెలుతురుభారము గణనలోనికి రానంత స్వల్పాతి స్వల్పముగా నుండును. నేటి పరిస్థితులలో ద్రవ్య భారమునకును వెలుతురుభారమునకును నెంత యంతర మున్నదో పరికించితిరా?

వ్యాకోచన ప్రథమదశలో విశ్వమందున్న వికిరణశక్తి, ద్రవ్యరాసుల భారముల నిట్లే లెక్కగట్టినచో ఫలము చాల విపరీతముగా గన్పట్టును. వ్యాకోచన మయిదు నిమిషములు సాగిన తరువాత, ఉష్ణోగ్రత నూరుకోట్ల డిగ్రీలకు తక్కువగా దిగిపోయినదని యనుకొనినయెడల, వికిరణ శక్తియొక్క భారసాంద్రత (భారము-ఘనపరిమాణము) ప్రతి ఘన సెంటిమీటరు ఆయతనమునకు 10 గ్రాముము లని లెక్క తేలును. అనగా నాటి వికిరణ సాంద్రత నేటి ఇనుము సాంద్రతతో సమముగా నున్నది. ఆ కాలమందే ద్రవ్యముయొక్క సాంద్రత నేటి సామాన్య వాయువుయొక్క సాంద్రతలో పదియవవంతు అగును. అందువలన నాకాలమున వికిరణ శక్తిదే పైచేయి యనియు విశ్వపరిణామ వ్యాపారమందు దానిదే యాధిపత్యమనియు నూహించవలెను. నాటి ద్రవ్యము లాఘవముపాలైనది. ఆ సంకుల వికిరణ సాగరమందు తేలియాడుచున్న ద్రవ్యకణములు బెండుముక్కలవలె నవశేషముగా నిటునటు నెట్టబడుచుండెను.

వ్యాకోచము జరుగుకొద్ది సన్నివేశము ద్రవ్యసామ్రాజ్యమున కనుకూలముగా మారుచుండెను ఏలయన పరమాణువుల మొత్తపు సంఖ్యలో మార్పేమియు రాలేదు. పైగా వ్యాకోచన కార్యమందు వికిరణశక్తి వ్యయమగుచుండెను. వ్యాకోచనము ప్రారంభించి మూడుకోట్ల సంవత్సరము లైనతరువాత ఉష్ణోగ్రత 300 డిగ్రీలకు దిగిపోయినది. ఇట్టి స్థితిలో వికిరణశక్తి, ద్రవ్యము ఈ రెండిటియొక్క సాంద్రతలును సమానముగా నుండెను.

విశ్వచరిత్రయం దీ సమయమున విశ్వపరిణామ వ్యాపార పురస్సరణమందు ద్రవ్యమునకే ప్రాధాన్యము చేకూరినది. ఈ ద్రవ్యసామ్రాజ్యము స్థాపితమైన వెంటనే నొక యద్భుత సంఘటన జరిగినది. ఇదివరకు ఏకరీతిగా వ్యాకోచించుచున్న ద్రవ్యరాశియందు, ద్రవ్యకణములమధ్య నుండు గురుత్వాకర్షణ ప్రభావముచే, ద్రవ్యరాశి శరీరములం దచ్చటచ్చట స్థానికముగా ద్రవసంచయములు కుదించుకొనిపోయి, మధ్య మధ్య నంతరాళములు పొడమి, ఇదివరకు ఖండితముగానున్న ద్రవ్యరాశి వేరు వేరు ఖండములుగా నేర్పడినది. జీన్సు పండితునిచే సహేతుకముగ నిరూపించబడినట్లు, నిరవధిక ప్రదేశమందు సమానముగా వ్యాప్తమై గురుత్వాకర్షణప్రభావమున చలనమును స్వీకరించిన వాయురాశి వాస్తవికముగా స్థిరముగా సముదాయస్థితిలో నుండ నేరదు. ఆ రాశి క్రమముగా ఖండశః విచ్ఛిన్నమై మధ్యమధ్య అవకాశములతో వేరువేరు వాయుగోళములుగా ఏర్పడును. ఇట్లు గురుత్వాకర్షణబలకారణమున వేరుపడిన ఖండగోళముల పరిమాణములను నియమించు పరిస్థితి యొకటి కలదు. ఏదేని ప్రత్యేకరాశియు దాని పరిమాణమును బట్టి పృష్ఠతలమునుండి ప్రదేశములోనికి తప్పించుకొనిపోవుచున్న వాయుకణముల వేగము, దానియందు తాపకారణమున వాయుకణముల కబ్బు వేగముకన్న భిన్నముగా నుండును. ఏ పరిమాణమునకు వాయుకణముల తప్పించుకొనిపోవు వేగముకన్న వాటి తాపచలనవేగము చాల రెట్లు ఎక్కువగానుండునో ఆ పరిమాణము స్థిరముగా నిలచియుండును. ఈ విషయము గతిశాస్త్రప్రమాణసిద్ధము. వేరుపడని కాలమందలి పుంజీభూత ద్రవ్యరాశియొక్క యుష్ణోగ్రతను, సాంద్రతను ఉపయోగించి వ్యాకోచించుచున్న వాయురాశియొక్క ఉష్ణోగ్రతాక్షయము, దాని వయస్సును దెల్పుచేయు కాలఖండముయొక్క వర్గమూలముతో విలోమముగా మారునని లెక్కగట్టి చూపవచ్చును. ఈ లెక్క ననుసరించి వ్యాకోచించుచున్న వాయురాశినుండి వేరువేరు కాలములలో వేరుపడిన ఖండముల ఘనపరిమాణములను భారములను లెక్క గట్టవచ్చును. ఈ లెక్కలలో నొక విచిత్ర విషయము బయలుపడినది. తొలిని పుంజీభూత ద్రవ్యరాశినుండి వేరువేరు కాలములందు వేరుపడిన ప్రత్యేక రాసుల ద్రవ్యసంచయములు సమానముగా నుండును. వేరుపడిన ప్రతి ఖండముయొక్క ద్రవ్యసంచయమును 10 కోట్ల సూర్యుల మొత్తపు ద్రవ్య

సంచయమునకు సమానముగా నుండునని లెక్కలవలన తేలినది. ఈ ఖండములే తరువాత నక్షత్ర వీధులుగా నేర్పడినవి. ఈ ద్రవ్యఖండము పరిమాణములో కొంచెము తక్కువ యనిపించినను, ప్రస్తుతము విశ్వములో మన కగపడు పాలపుంతల సగటు ద్రవ్యసంచయముతో సరిపోవుచున్నది. విడివడిన ఖండముల పరిమాణమును గురించిన ఈ నిష్కర్ష, ప్రత్యక్ష పర్యవేక్షణ ఫలితములతో కూడ సంవదించుచున్నది. ఏలయన గణితలభ్యమైన ప్రత్యేక నక్షత్ర వీధుల ద్రవ్యసాంద్రత, నక్షత్రవీధులు ప్రాథమిక పుంజీభూత ద్రవ్యరాశినుండి వేరుపడుచున్న కాలమందా పుంజరాశి యొక్క సగటు ద్రవ్యసాంద్రతతో సరిపోవుచున్నది.

తొలిని విశ్వాకాశమంతటను వ్యాపించి ఏకరూపముగా వ్యాకోచించుచున్న వాయురాశి, ప్రత్యేక నక్షత్ర వీధులుగా వేరుపడుటకు కారణములుగా నాచరించుచున్న ప్రక్రియలను సూక్ష్మ శాస్త్రీయ పరిశీలనకు గురిచేసిన ఖగోళ శాస్త్రజ్ఞులు ఒక ముఖ్యవిషయమును కనుగొనిరి. అదియేమన మొదటి వాయురాశిలో ఇది ద్రవ్యమని గాని, శక్తి యని గాని నిర్వచించుటకు వీలులేని ప్రాథమికావస్థలోనున్న పదార్థము, పెద్ద వెల్లువలో గోదావరి నదియందూ అత్యంత సంరంభముతో ప్రవహించు నీరువలె ప్రచండకల్లోలచలన సంక్షోభములో నుండవలయును. గోదావరీతోయ రాశియందువలె, ఆ వాయు రాశియందుకూడ చిన్నవి, పెద్దవి బత్తిడిసుళ్లు, సంకులచలన కారణముగా జనించవచ్చును. పైని జెప్పిన గురుత్వాకర్షణ కారణముగా నుద్భవించిన యస్థైర్యమువలన, కల్లోలచలనము దేర్పడిన ఒత్తిడి సుళ్లు వాటిలోనున్న కణములగురుత్వాకర్షణ బలప్రభావముచే సమూహములుగా నేర్పడి నేటిపాలపుంతలు ఉదయించినవి.

తొలిని ఏకరూపముగా విశ్వమంతటను వ్యాపించియుండిన వాయురాశి, మూడుకోట్ల సంవత్సరముల క్రిందట వేరు వేరు ఖండములక్రింద విడిపోయిన సమయమునందు, విశ్వాంతరాళ మంతయు గాఢతిమిరమయమై యుండెను. ప్రాథమిక వాయురాశికుండిన యుష్ణోగ్రత కారణముగా, అందలి ద్రవ్యమునకు ప్రకాశగుణముండెడిది. రానురాను వాయురాశి వ్యాకోచించి ఉష్ణోగ్రత తగ్గసరికి ప్రకాశ మంతరించినది. నేడు గగనతలమందు ప్రకాశించుచున్న నక్షత్రము లేవియు అప్పటికి ప్రాదుర్భవించలేదు. విశ్వాంతరాళమంతయు క్రమవ్యాకోచనఫలితముగా ఒకదానినుండి మరియొకటి దూరదూరముగా పోవుచున్న బ్రహ్మాండపరిమాణములుగల ద్రవ్యమేఘములచే నిండియుండెను. తొలి వాయురాశినుండి వీటికి సంక్రమించిన సంకులచలన కారణముగా బొంగరమువలె గిరగిరతిరుగునట్టి గుణమీ మేఘముల కబ్బినది. ఈ భ్రమణ చలనము మూలమున కోలవాటుతొంప్రబెత్తు ఆకారమువంటి గుణాకారమీ ద్రవ్యమేఘములకు సంక్రమించినది. ఈ కారణముచేతనే మనపాలపుంత కావలనున్న కొన్ని ద్రవ్యమేఘములకు నాటి సాంద్రశరీరముల చుట్టుముట్టుకొని యున్న సర్పిలాకారపుదీర్ఘ బాహువు లుద్భవించినవి. వీటికి స్పైరల్ (సర్పిల) నెబ్యులాలని పేరు. ఇవియే నక్షత్రవీధుల జన్మస్థానము. పైని చెప్పినట్లు ఇట్టి నక్షత్రవీధి జనకమగు మేఘమొకటి మనకు ఆంద్రోమీడా (ఉత్తరాభాద్ర) నక్షత్రరాశి నుండు వట్టికంటికి సైత మగుపించుచున్నది.

# జనతా ఎక్స్‌ప్రెస్

శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ

'రామకుమారీ మీ యిల్లు ఉందా
రత్నకుమారీ మీ యిల్లు ఉందా
పేరుపేరులతల్లి మీ యిళ్ళ ఉందా
పెద్దప్ప దొరసాని మీ యిల్లు ఉందా'

అంటూ ఇంటింటా తొంగిచూస్తూ ఇల్లాళ్ళను అడగ సాగింది నరసమ్మ.

"మా యిళ్ళ లేదమ్మ మా యిళ్ళలేదు" అన్నారు ఇల్లాళ్ళంతా ఆలనాటి ప్రకారం.

"ఇల్లిల్లు తిరిగేటి పిల్లల్లకోడి
అల్లదిగో చూడవే, తెల్లవారేను
మేలుకో మేలుకో ఓసుందరమ్మా!
మేలుకోవే ఇంక బంగారు బొమ్మ.

అన్నాడు అప్పుడే నిద్రమేలుకుంటున్న చక్రవర్తి.

చక్రవర్తి కవిత్వం చెబుతాడంటే సుందరమ్మకి చాలా భయం. చటుక్కున నిద్రలేచి, శ్రీరామ చుట్టుకుని, కుంపటి రాజేసి, కాఫీ పొడికోసం పొరుగింటికి అప్పుకి బయలుదేరింది. పొరుగింటి పిన్నిగారు ఎదురింటి జానకమ్మదగ్గిర వాళ్ళ 'నాగపూరు కప్పుతో నాగపూరు కప్పుడు' పంచదార అప్పుపట్టుకొచ్చింది. జానకమ్మ పంతులమ్మ - సుందరమ్మభర్త పనిచేసే బడిలోనే ఉద్యోగం. అందుకని సుందరమ్మ సాధారణంగా అక్కడ అప్పడగదు. ఆ మాటకొస్తే సుందరమ్మ పక్కింటి పిన్నిగారినితప్ప ఇంకెవరినీ అప్పు అడగదు. ఇద్దరివీ ఖరీదైన కోరికలు కాబట్టి నెయ్యానికి కయ్యానికి అనువైనదే తగును.

తాత్కాలికంగావచ్చిన కొన్ని ఇబ్బందులవల్లా, ఇంతకన్న పెద్ద ఇల్లు దొరకకా తనూ, పక్కింటి పిన్నిగారూ ఈ మధ్యతరగతివాళ్ళ కాలనీలో వనవాసం చేస్తున్నారు.

తనకి సరికొత్త జాగ్వారు కారు కొనాలని అభిలాష. పిన్నిగారికి, ఒక మేడ; ప్రస్తుతాని కొక్క నాలని ఉంది. తాపీగా ఒకటి కట్టించుకోవాలని సంకల్పం. అందులో టెలిఫోను, రేడియో, బొచ్చుకుక్క— అవీ ఉంటాయి. అప్పుడే ఆవిడ టెలిఫోను, రేడియోలు పెట్టే బల్లలమీద వేసే గుడ్డలు కొనేసి, వాటికి చక్కగా ఎంబ్రాయిడరీ వేసింది. కొనబోయే బొచ్చుకుక్కకి ముచ్చటైన పటకా, గొలుసు కొని అట్టే పెట్టుకుంది. సుందరమ్మ పెద్దపెద్ద కార్లల్లో వెళ్ళినప్పుడు ఎలా ప్రవర్తించాలో చూచి, చదివి తెలుసుకుంది. డ్రైవరువచ్చి తలుపు తీసేదాకా దిగకుండా ఉండడం, దిగినపుడు ముందర ఓకాలు వయ్యారంగా నేలమీద మోపడం, మోపినప్పుడు కాలి అడుజోడు పూర్తిగా తొడుక్కుని ఉండకుండా, బొటనవేలికి సుతారంగా తగిలించి అరికాలుకీ, జోడు ఉపరితలానికీ మధ్య కనీసం 60 డిగ్రీల కోణం ఉండేటట్లు చూసుకోవడం, దిగి తలుపు వేసినపుడు చీరచెంగు ఆ సందులో పడేటట్లు వదలి, ఆపైన, ముద్దుగా ముచ్చటగా సన్నంగా చక్కగా, 'ఓ' అని ఇంగ్లీషులో ఆశ్చర్యపడి, నాజూకైన బేజారు నటించడం మొదలైన కార్యకలాపాలన్నీ సినిమాలకు వెళ్ళినప్పుడు టాక్సీలలో ఎక్కి దిగి నేర్చుకుంది అందమైన సుందరమ్మ.

"పిన్నిగారూ నిన్న ఎంత చక్కటి కారు చూశాననుకున్నారు. పెద్ద కారు. నల్లటి కారు. నా హైదరాబాద్ చీరంత నల్లటిది" అంది సుందరమ్మ.

"ఏదీ! నువ్వు చెప్పేది రోజూ పదిన్నరకి మన వీధిమీదుగా వెళ్ళేదేనా?...మా ఆఫీసరుగారి మేడ దగ్గర చూశాను. అన్నట్టు నువ్వు వాళ్ళ కొత్తమేడ చూశావా. అచ్చు, నేను అనుకుంటున్న మేడే అనుకో. నాప్లాను కాపీకొట్టారా అనిపించింది. ఎటొచ్చి ప్రహారీగోడ బాగా పొట్టిదనుకో..." అంది పిన్నిగారు.

తెరకవతల పడుకున్న చక్రవర్తి వింటున్నాడు కబుర్లన్నీ. ఈ పురాణకాలక్షేపం ప్రారంభం అయితే భోజనం వేళకి కాఫీ, నిద్రవేళకి భోజనం తెములుతాయని తెలుసు. "సుందరీ" అని కేక వేశాడు మొండిగా.

"అన్నట్టు పిన్నిగారు, కాఫీపొడుం నిండుకుంది కాని..."

"అట్టే లేదనుకుంటానమ్మా" అంది పిన్నిగారు మొహం ముడుచుకోడానికి ఉపక్రమిస్తూ.

సుందరమ్మ నాలిక కరచుకుంది చేసిన పొరపాటుకి.

"ఎంతో వద్దు—ఈపూటకే, మీ నాగపూరు కప్పుతో నాగపూరు కప్పుడు చాలు" అంది.

మేడ కొనేసినంత పనయింది పిన్నిగారి ప్రాణానికి. "దానికేం భాగ్యం. మహారాజులా పట్టికెళ్లు" అంది ఆదరంతో.

సుందరమ్మ వెళ్ళగానే నరసమ్మగారు వచ్చి పిన్నిగారిని పలకరించింది. "మా చిన్నపిల్ల గిన్నా మీ యింటో ఆడుకుంటోందా వదినా?" అంది ఆప్యాయంగా. "లేదండీ" అంది పిన్నిగారు ముభావంగా.

"ఏమోనమ్మా. అస్తమానూ అత్తయ్య అత్తయ్యంటూ ఊహూ ఇదౌతూ ఉంటుంది. మీ యిల్లు కాస్త విశాలంకదూ. దానిప్రాణానికి హాయిగా ఉంటుంది" అంది నరసమ్మగారు.

"ఏమిల్లు లెస్తురూ వదినా. మాకు మహా ఇరకాటంగా ఉంది. పెద్దకొంపకోసం దేవుళ్లాడుతున్న కొద్దీ దూరం అయిపోతోంది."

"జా గాని వదినా, మీయింట ఒక అర్ధశేరు బియ్యం ఉంటే ఇద్దురూ, ఆనక పంపించేస్తాను... ఉంటేనే సుమండీ" అంది నరసమ్మగారు కాస్త గొంతుక మార్చి.

"అదేమిటమ్మా! లేకపోతే ఇచ్చేదేముంది. అయినా మాయింట ఇటువంటివాటికి లోటుండదమ్మా...'

"మరేం లే దొదినా. ఈ తోటలో ఇప్పటికి ఎనిమిది ఇళ్ళలో అడిగాను. అందరిళ్ళలోనూ బియ్యం నిండుకున్నాయట...ఆప్తులు కాబట్టి మీతో చెబుతున్నాను సుమండీ" అంది నరసమ్మ.

"పోన్లే ఎవరిపాపం వాళ్ళనే. అర్ధశేరు కాదు; ఇంకో పావుశేరు కూడా పట్టుకెళ్లు.....చేట తెచ్చావా చెంగులో పొయ్యనా?"

"మీ కలకత్తా చెంబ గిన్నిలో పోసివ్వండి" అంది నరసమ్మ.

బియ్యంతో పాటు కాసిని వంకాయలు, ఓ గుమ్మడికాయబద్ద కూడా ఇచ్చి పంపింది పిన్నిగారు.

నరసమ్మగారు ఇంటికెళ్లి తలుపు గొళ్లెం తీసేవరకు, ఇంట్లోని నలుగురు పిల్లలూ బిలబిల లాడుతూ బయటకొచ్చారు. అమ్మా అన్నమే అప్పచ్చే, కానీయే వోణీయే అంటూ.

నరసమ్మగారు అలవాటు ప్రకారం నలుగురికీ వీపులమీద నాలుగ్రెండ్లు ఎనిమిదీ వడ్డించి, అవతలకి పొమ్మంది.

ఐదు నిముషాలలో ఆ తోటలోని పదకొండు ఇళ్ళలో ఉన్న యావన్మందీ, నరసమ్మగారి పిల్లల గోల విని తెల్లవారిందని తెలుసుకుని లేచారు......

కొన్ని వేల సంవత్సరాల క్రితం ఆ తోటలో జనాన్ని ఇప్పటి మల్లె నరసమ్మగారి పిల్లలు కాక, కాకులు, కోళ్లు ముచ్చటగా మేలుకొలిపేవి.

అప్పట్లో, కణ్వుడూ, విశ్వామిత్రుడూ, వశిష్ఠుడు మొదలైన ఋషులకోవకి చెందిన గొప్ప ఋషి కూతురు ఒకసారి బొమ్మల పెళ్లిళ్లు చేసింది. ఆశ్రమ సీమలోని ఋషులు, వారి శిష్యులూ యావన్మందీ ఆ పెళ్లి వైభవంగా జరపడంకోసం నిజంగానే విడిది కట్టారు. తోట మధ్యన ఒక పెద్ద కుటీరం నిర్మించారు పెళ్ళికి. దానికి ఎడా పెడా నాలుగేసి పర్ణశాలలు, వెనక వైపు రెండు శాలలూ కట్టారు. విడిదికోసం. కొంత కాలానికి క్రీస్తుశకం, దరిమిలా ఇరవయ్యో శతాబ్దం వచ్చేశాయి.

నాగరికత పెరిగాక, అక్కడి ఊరు వెలిసింది. ఆ శాలలు కొన్న యజమాని, వాటి ఆకులు తీయించి, పాత పెంకులు, రేకు ముక్కలూ వేయించాడు. పై కప్పూ స్తంభాలూ తడకలు తీసి, ఇటికలూ మట్టీ వేసి గోడలు లేపాడు. మధ్యపాక పీకి డాబా వేయించాడు. పైన గది వేసాడు.

ఆ పర్ణశాలావళి యజమానులు మారినా శాస్త్రులు మారలేదు. చుట్టూవున్న గదిన్నర వాటాలలో పదేసి

రూపాయల అద్దెయిచ్చే చిన్నకుటుంబాలున్నాయి. మధ్య ఇల్లు రెండుభాగాలు. ఒక వాటాలో 'పెద్ద మనిషిగారూ' ఆయన కుటుంబం ఉన్నారు.

రెండోదాంట్లో 'సుబ్బారావుగారి మామ గారు' కూతురూ, కూతురుమొగుడు సుబ్బారావూ ఉంటున్నారు చుట్టూవున్న గదిన్నర వాటాలలో చక్రవర్తి సుందరమ్మలవంటి చిలకా గోరువంకల దగ్గ ర్నించి, చక్రవర్తి కవిత్వానికి గురి అయిన "పిల్లల కోడి" నరసమ్మగారి వరకూ రకరకాల కుటుంబాలు ఉన్నాయి.

వీటిలో ఏతరగతి క్రిందకూ రానిది, మిడిల్ స్కూలులో ఐదో తరగతి వరకూ పాఠాలు చెప్పే పంతులమ్మ జానకమ్మ,—పెళ్ళిచేసుకోని బంగారు బొమ్మ.

ఇంటియజమాని వీర్రాజు, మధ్యయింటి మేడ గదిలో ఉంటాడు ఒంటరిగా. వీర్రాజుకి శరత్‌బాబు కథలో హీరో లక్షణాలు కొన్ని ఉన్నాయి. ముందూ వెనకా ఎవరూ లేరు. ఉన్నవాళ్లెవరో చాలా దూరాన ఉన్నారు. వీర్రాజు ఆస్తి అనతగిన ఈవాడ, వాళ్ళంతా తన్నే పట్టుకు దేవుళ్లాడేటట్లు చేయగలిగినంత బలమైన నూదంటురాయి కాదు.

పదిమంది మధ్య ఉండాలని వీర్రాజుకి ఉబలాటం లేదు. ఇరుగు పొరుగుల గోల పట్టించుకునే వాడు కాడు కాని, ఇరుగువారి చరిత్ర పొరుగువారు, వారి కథ వీరూ వంతులువేసుకుని చెప్పి చక్కా పోతూఉండడంతో, అతనిలో కుతూహలం రేగింది. మేడమీద గదిలో కూర్చుని ఒడిలో కష్టానుల్లా, చుట్టూ గదిన్నర వాటాలవారు పడే అవస్థలూ, కీచులాటలు, దోబూచులాటలు పావకాశంగా చూస్తూ ఉండేవాడు. అతడు జాలిపడేవాడనడానికి నిదర్శనం అద్దెల బకాయిలు.

ఒక్కొక్కసారి చిరాకేసేది—చేతిలో డబ్బు బొత్తిగా ఇదైపోయినపుడు, తనకు బాకీఉన్నవాళ్లు కులాసాగా సినిమాకి వెళ్తున్నపుడు ఒళ్లు మండి పోయేది.

ఒక ఆదివారం సాయంత్రం, క్రింద వాటాలో సుబ్బారావు షికారుకు వెళ్తుంటే పిలిచాడు.

"ఏటండి...మరోలా అనుకోకండి. ఈ నెలయినా కాస్త అద్దె యిచ్చేస్తే..." అన్నాడు మెల్లిగా.

సుబ్బారావు తెల్లబోయాడు "మొన్న ఒకటో తారీఖునే ఇచ్చేశాంగదండీ...పైగా ఈ నెలయినా అంటా రేమిటి? నేను బకాయిలు పెట్టలేదే!"

"ఐదు నెల లయిందండి మీవాటా అద్దె నాకు అంది" అన్నాడు వీర్రాజు.

"మీరు పొరపాటు పడుతున్నారు. జీతంవచ్చిన మర్నాడే మీకు అద్దె పంపిస్తున్నాను."

"నాకుమాత్రం అందటం లేదండి."

వీర్రాజు లెక్కజవాబు విని, సుబ్బారావు మండిపడ్డాడు. 'ఉండండి. అదేదో ఇపుడే తేల్చేస్తా' అన్నట్లు చర చర ఇంట్లో కెళ్లాడు.

భార్యని గదమాయించి అడిగాడు.

"ఇవ్వకేం ఏ నెల కానెల నిక్షేపంలా యిస్తున్నాం. అదేం పొయ్యేకాలం" అందామె.

"ఆ ముక్క అతనితో చెప్పు" అన్నాడు సుబ్బారావు.

"బావుందండీ చెట్టంత మొగాడి ఎదట పడి పోట్లాడమంటారా? మీమాట నమ్మకపోతే కాస్త ఆగమనండి మా నాన్న వచ్చాక కనుక్కుందాం. ఆయనే యిస్తున్నారు అద్దెపట్టిగల్లి" అంది.

సుబ్బారావుగారి మామగారు షైరువెళ్లాడు. బాగా చీకటిపడ్డాక ఆయన రాచకార్యాలు చక్క బెట్టుకుని వస్తాడు. అద్దె ఇస్తున్నది మామగారు అని వినగానే సుబ్బారావు ధీమా సడలింది. కోపం చల్లారింది.

వీర్రాజు దగ్గరకెళ్ళి, ఏం చెప్పాలో తోచలేదు. మొహం దిగాలుపడింది. రానురాను అనుమానం ఎక్కువైంది.

కిటికీలోంచి బయటకు చూచాడు. ఎదటి నాలుగు వాటాలలో మూడు వాటాల వాళ్లు వసారాలో బారులుతీరి చూస్తూ వింటూ నిలుచున్నారు గారడీవాడి ప్రేక్షకులమల్లే. జానకిమాత్రం లోపల వంటచేసుకుంటూ కూర్చుంది.

చీదరించుకుంటూ వీర్రాజు దగ్గర కెళ్ళాడు. 'అయ్యా! రాత్రి మాట్లాడదాం' అనేసి విసవిస నడచి వెళ్ళిపోయాడు.

* * *

రాత్రి ఎనిమిదయింది. సుబ్బారావు ఇంట్లో కూర్చుని పేపరు చదువుకున్నాడు.

"ఏమోయ్! పెంద్రాళే వచ్చేశావ్!" అంటూ హుషారుగా పలకరించాడు సుబ్బారావు మావగారు.

"ముందు చొక్కా విప్పండి. భోంచేద్దాం" అన్నాడు సుబ్బారావు.

మావగారు చొక్కా ఊడతీసే కార్యక్రమం సగం అమలుజరుపనిచ్చి, ఆయన తలకాయ చొక్కా ముసుగులో మునిగిఉన్న తరుణాన, 'వీర్రాజు అద్దె బకాయి పడ్డామంటున్నాడు' అన్నాడు సుబ్బారావు.

మావగారు చొక్కా విప్పలేదు, దింపలేదు. తలకాయ అలా చాటునే ఉంచుకుని "ఏ అద్దె?" అన్నాడు.

"ఏ అద్దేమిటండీ. నా తలకాయ అద్దె. మన ఇంటద్దె" అన్నాడు వీర్రాజు.

మావగారు చొక్కా కిందకిదింపి, ఇవతలకి తొంగిచూచాడు.

"అవునుగాని సుబ్బారావ్, ఈ డొక్కు ఇంటికి అద్దె బకాయి పెట్టడంకూడా వల్లకాదంటే, మనకి ఈ ఇంట్లో ఉండేటంత ఖర్మం ఏంకాలిందీ అంట" అన్నాడు.

"ఒకటి కాదు రెండు కాదు ఐదు నెలలు ఐదు ముప్ఫైలు నూటయాభై, బకాయి పెట్టారు మీరు" అన్నాడు సుబ్బారావు.

మావగారు అమాంతం చొక్కా విప్పుకోడానికి మొదలుపెట్టి తల ఆ షేరాలో దాచుకున్నాడు. "ఎవరు చెప్పారునీకు. ఐదు నెలలు కాదే. ఏమూణ్ణెల్లో నాలుగు నెలలో" అన్నాడు.

"ఎందుకండీ మావగారు ఇలా చేస్తారు. నన్నిలా బాధపెట్టడం భావ్యమేనా?" అన్నాడు సుబ్బారావు చిరాగ్గా.

మావగారు చొక్కా విప్పలేదు., మానలేదు.

సుబ్బారావుని 'హలో' అనే మిత్రుడొకడు హఠాత్తుగా వచ్చేసి హలో! అనేశాడు. అప్పుకావాలన్నాడు. ఇదివరకు అతను బాకీవున్న ఐదూ ఐదూ పదీ, పదీ రెండూ పన్నెండూ, నాలుగు రోజుల్లో సుబ్బారావుకి ఇచ్చివేయ దలచుకున్నట్లు ప్రకటించాడు.

'ఏంగిరాకీ' అన్నాడు సుబ్బారావు కోపంలో కొంత హేళన స్ఫురింపచేస్తూ.

"మని టూర్డగాస్తుంది"

"ఇంకేం అనేదో వచ్చాకా, సరాసరి ఇచ్చెయ్యొచ్చుగా. ఇప్పుడీ ప్రకటనలెందుకు?"

"ఏంలేదు ఇంకో ఎనిమిది రూపాయలు అప్పుగా యిస్తే మొత్తం ఇరవై ఇచ్చేస్తానని"

"ఊహుంచికే. నాదగ్గిర డబ్బులేదు. ఉన్నా యివ్వను" అన్నాడు సుబ్బారావు విసుగ్గా.

మావగారు చొక్కా విప్పుకోవడం మానేసి, మామూలుగా కిందకిదించి, ఆలకిస్తున్నాడు.

"పోనీ మూడు ఇవ్వండి. మొత్తం పదిహేను ఇచ్చేస్తా" అన్నాడు మిత్రుడు ఆశగా.

సుబ్బారావు మందహాసం చేసి, కూర్చొమన్నాడు.

"అబ్బాయ్. నా ఎరికన సెంట్రల్ గవర్నమెంటులో రెండు ఉద్యోగాలున్నాయి. చూసుకోరాదు" అన్నాడు.

"అబ్బే. నేను గవర్నమెంటుకింద ఉద్యోగం చెయ్యదలచుకోలేదు."

"అయితే, మావంటి వాళ్ళ ప్రాణాలు తీస్తూ ఉండదలచుకున్నావా?" అన్నాడు సుబ్బారావు.

"అసలు చెప్పండి. చూద్దాం"

"ఈ ఉద్యోగాలు స్వతంత్రమైనవిలే. నెల జీతం కాదు. ఏరోజు కారోజే. రొక్కాడ్డీ సంపాదన."

"చెప్పండి ఎక్కడో."

"ఒకటి తంతి తపాలాశాఖ పని సులభం. చిన్న చిన్న పోస్టాఫీసులుంటాయి చూడు. ఓ కలం సిరాబుడ్డి పట్టుకువెళ్ళడం. ఎవడేనా ఉత్తరం రాసుకోడానికి వస్తే కలం సిరాబుడ్డీ వాడి చేతికిచ్చి, నువ్వు ముందుకు వంగి, వీపుమీద ఉత్తరం రాసుకో

నియ్యడం. అదయిపోయాక తపాలా బిళ్ళలు అంటించాలిగా. మిషిన్ పద్ధతిలో నాలిక బయటికి జాచడం. ఆయన స్టాంపు తడిచేసుకోగానే, నాలికని ఉపసంహరించుకోవడం, స్టాంపు అంటించడానికి మళ్ళా ఒక్కసారి వీపు ఎరువియ్యడం ఈ సహాయానికి, ఉత్తరం ఒక్కంటికి అర్థణా పుచ్చుకోవచ్చు. ఈ లెక్కన రోజుకు నీ ఆర్జన ఎంతో చూసుకో" అన్నాడు సుబ్బారావు గబగబా హుషారుగా.

ఎదటి మిత్రుడికి నోటమాట రాలేదు. సుబ్బారావు మావగారు మళ్ళీ చొక్కా విప్పబోయి, మధ్యలో ఆపేసి, తల దాచుకున్నాడు.

ఇదేం చూడనట్టుగానే సుబ్బారావు చెప్పుకు పోయాడు.

"ఇది నచ్చకపోతే ఇంకోటుంది. ఒక హరికేన్ లాంతరు చేత బట్టుకొని, కలకత్తా మెయిలుకి అర మైలు దూరాన పరిగెడుతూ ఉండాలి. లైను సరిగ్గా లేనప్పుడు వెనకాల వచ్చే రైలుని ఆపి, ఆ సంగతి చెప్పాలి. పూర్తిగా నైట్ డ్యూటీ అనుకో."

'ఛఫ్' అన్నాడు సుబ్బారావు మావగారు.

సుబ్బారావు స్నేహితుడు చీదరించుకొని వెళ్ళిపోయాడు.

"ఏమిటండి సెలవిచ్చారు" అన్నాడు సుబ్బారావు.

"ఆ వెధవ నవ్వు పెట్టుకొని, నన్ను అడ్డమైన మాటలూ అంటావూ?...ఇష్టం లేకపోతే పొమ్మన రాదూ?" అన్నాడాయన చొక్కాలోంచి.

"మిమ్మల్ని ఇల్లరికం ఉండమని పిలిచానా?... పెద్దలుకదా, తండ్రి వంటివారు కదా అని గౌరవిస్తే మీరు మీ చిత్తం వచ్చినట్లు నన్ను ఉద్ధరిస్తున్నారు. పల్లెత్తు మాటన్నానా?...మీరు అద్దెలకి కూడా ఎసరు పెడితే ఎలా చావమంటారండీ" అన్నాడు సుబ్బారావు.

'నాన్నా నువ్వు లోపలికిరా ఆయనతో వాదించకు' అంది సుబ్బారావు భార్య.

"ఉండవే దినంతేమిటో కనుక్కుంటాను" అన్నాడు మావగారు ముసుగులోంచి.

"దేండి.? ఆ చొక్కాదా?" అన్నాడు సుబ్బారావు.

మావగారికి బాగా కోపం వచ్చేసింది.

ఆరి వెధవా అంత హేళనా! అంటూ, భావాలని అభినయించబోయాడు...ఆ ఉధృతానికి, పిగులుతున్న చొక్కా ఎడా పెడా ఛర్రున చిరిగి చేతులు రెండూ చెరో చిల్లిలోంచీ ఇవతలకి వచ్చాయి. తల ముసుకులో ఉండి పోయింది.

ఈ గావుకేక విని వీర్రాజు మేడదిగి మూడడుగులు వేసి కొయ్యబారిపోయాడు.

సుబ్బారావు వాటాకి, ఇవతల వాటాకీ మధ్య ఒక తలుపే అడ్డం. ఆ తలుపుదగ్గర అతి మనోహరమైన దృశ్యం కనబడింది కిటికీలోంచి చూసిన వీర్రాజుకు. ఆ వాటాలోని 'పెద్దమనిషి' ఒక కుర్చీలో కూర్చున్నాడు. పక్కనే ఆయన సతి మరొక కుర్చీ వేసుకుంది. కూతుళ్ళూ కొడుకులూ, మనుమలూ ఎడా పెడా నుంచున్నారు. కొందరు పెద్దవాళ్ళ కాళ్ళదగ్గర మఠం వేసుకు కూర్చున్నారు. ఈ బృందం అంతా సుబ్బారావు వాటా తలుపుకి ఎదురుగా, కాస్త దగ్గరగా ఈవిధంగా ఉపవిష్టులై, పొరుగింటివారి పోట్లాటను తిలకించక పోయినా ఆలకించి, తన్మయానందం అనుభవిస్తున్నారు. గ్రూపు ఫోటో తీయించుకుంటున్నట్టు కూర్చున్న ఆ గుంపును చూడగానే, వీర్రాజు 'ఛీ' అనుకున్నాడు. ఆ పైన జాలిపడ్డాడు, ట్యూషన్ చెప్పి ఇంటికొస్తున్న జానకికూడా నుచ్ఛైన యీ దృశ్యం చూచి ఏవగించుకుంది. వీర్రాజు కూడా తనతో ఏకీభవించినందుకు తృప్తిగా నవ్వి వెళ్ళిపోయింది.

మావా అల్లుళ్ళ వాదం కొనసాగుతూ వుండగా కెనెడియన్ రైలింజన్ కొండమీదనించి దొర్లించిన చప్పుడైంది. ఒక్క క్షణం ఆగారు. 1904 వ సంవత్సరపు జలవ హేతు శకటం ఒకటి టక టక మంటూ ధన ధన మంటూ ఇంకా నానా విధాలా చప్పుడుచేస్తూ, తోటలోకి వచ్చి సరాసరి సుబ్బారావు ఇంటి ఎదుట ఒక క్షణం ఆగింది.

'కారు కొన్నాం, కారు కొన్నాం' అంది కారులో కూర్చొన్న సుందరమ్మ హుషారుగా. టాపు తీసిన కారులో సుందరమ్మ ఆరిందాలా చేరబడి కూర్చుంది.

పోట్లాటమధ్యలో ఉన్నందువల్ల ఎవరూ సుందరమ్మ కారు జోలికి రాలేదు. నరసమ్మగారి పిల్లలు కూడా భయపడ్డారు.

ఉత్సాహం చల్లారిపోయిన సుందరమ్మ రైట్ రైట్ అంది డ్రైవర్ వంక తిరిగి. కారు ముందుకుసాగి ఎడమకు తిరిగి, మళ్ళా ఎడమకు తిరిగి సుందరమ్మ వాటా వైపు వచ్చింది. హార్న్ బ్లాన్ అని కేక పెట్టింది సుందరమ్మ తన యిల్లు రా గా నే.

చక్రవర్తి వసారాలో కూర్చున్నవాడల్లా తుళ్ళి పడి లేచాడు. ఏమిటిది అన్నాడు. సుందరమ్మ డ్రైవరుకు వందనా లర్పించి, ఓ రూపాయి యిచ్చి వెళ్ళిపొమ్మంది.

"మనసే. ఎలా ఉందండీ. నాలుగంటే నాలుగు వందలండీ" అంది సుందరమ్మ.

"నీకేమైనా మతిపోయిందా? కొరుక్కొన్నావా? నీకసలు నాలుగువంద లెక్కడివి?... నేను బడిపంతులు నని జ్ఞాపకం ఉందా. మన యింటిఅద్దె యెంతో తెలుసా?" అన్నాడు చక్రవర్తి.

"ఒక్కక్షణం ఉండండి చెబుతా. కాసిని మంచినీళ్లు తాగాలి."

ఈలోగా మధ్యయింట్లో సుబ్బారావు, ఆయన మామగార్ల వాదాలు తారస్థాయి నందుకున్నాయి.

"మీరు సొదరుకర్ప్రులికి వేరేఇవ్వడం కాదుండా, విచ్చాలన్నీ మీచేత నే కొనిపిస్తున్నాను కదా" అన్న మాటలు పైస్థాయిలో వినబడ్డాయి.

సుబ్బారావు ఇంత దారుణమైన మాట అంటా డని, అనగలడని, ఆతోటలో ఎవరూ అనుకోలేదు. అందుకని ఆ మాటలు విన్నవాళ్ళంతా విస్తుబోయారు. సుబ్బారావు మావగారు కల్లోకూడా అనుకోలేదు. ఆయన కొయ్యబారిపోయాడు. పెదవులు వణికాయి కళ్లెర్రబడ్డాయి. మాటలు చాలా అనాలని లోపల ఉబలాటం ఉందికాని బయటికి రావటంలేదు. 'ఉండు' అని ఉరుములాంటిమాట మాత్రం అన్నాడు.

ఇంట్లోంచి బయటికొచ్చేశాడు. తరవాత ఆయ నకి ఏంచెయ్యాలో బోధపడలేదు. ఆగి వెనక్కి చూశాడు. సుబ్బారావు లోపలికి వెళ్తున్నాడు. ఇంకోక్షణం ఆగి ఆలోచించి, సరాసరి జానకమ్మ వాటాలోకి వెళ్ళాడు సుబ్బారావు మావగారు.

"అమ్మా! వింటున్నావుగా. ఇవి చేతులు కావు కాళ్లనుకో. పెద్దముండావాణ్ణి. ఇన్నాళ్ళ కీగతి పట్టింది. ఒక్క నూటయాభై ఉంటే యిప్పు తల్లీ రేపు సాయంత్రానికి తల తాకట్టు పెట్టి నీది నీకిస్తాను... ఈతోటలో ఇస్తే నువ్వే ఇవ్వాలి" అన్నాడు.

జానకిమనసు కరిగిపోయింది. కాని అంత డబ్బు లేదు. పైగా ఆమెబుర్ర ఎక్కడో ఉన్నందువల్ల, ఈ కథసంగతి పూర్తిగా తెలియదు.

"మీరు అలా సోడాకొట్టుకెళ్ళి ఐదు నిమి షాలలో తిరిగిరండి ఇస్తాను" అంది.

సుబ్బారావు మామగారు వెళ్లి పోయాడు. ఆవెనక, జానకి బయలుదేరి సరాసరి మేడ ఎక్కింది.

వీర్రాజు విచారిస్తున్నాడు తనవల్ల అంత గొడవ జరిగినందుకు. అంతలో జానకి పిలిచి, హఠాత్తుగా ఓ 50 రూపాయలు కావాలంది. తనతో అరుదుగా మాట్లాడే జానకి ఇంత హఠాత్తుగా, నిస్సంకోచంగా డబ్బు అడిగెయ్యడంతో, వీర్రాజు అసలు సంగతి పసికట్టేశాడు.

"మీరు చాలా మంచివారు" అన్నాడు ఐదు కొత్తనోట్లు జానకి చేతి కందిస్తూ.

జానకి నవ్వింది. బళ్లోకూడా చాలమంది మేస్టర్లు, హెడ్మాస్టరు, సెక్రటరీ తనని అవపా తడపా మెచ్చుకుంటూనే వుంటారు. కాస్త తల నొప్పివస్తే ఆయుర్వేదం, అలోపతీ, హోమియోపతీ, మొదలైన వైద్యశాస్త్రాలలో చెప్పిన మందులన్నీ ఏకరువు పెడతారు అదేపనిగా సానుభూతి ఒలకబో స్తారు.

వీర్రాజు ఆమె నవ్వులో ఈ ధోరణిని పసి గట్టాడు.

"ముఖస్తుతి అనుకు నేరు కొంపతీసి" అన్నాడు నవ్వుతూ.

"మీరు నా మంచితనాన్ని మెచ్చుకున్నారు గాని, ముఖాన్ని కాదుగా" అంది జానకి వెనక్కి తిరుగుతూ.

"అదాంతే. అలాంటి ముఖస్తుతి అయితే అనర్గ ళంగా మెచ్చుకోగలను. అమోఘమైన కాంపొజిషన్ వ్రాసి, మీచేతే పదికి పది మార్కులు వేయించుకో గలను" అన్నాడు వీర్రాజు.

"మీరు బలేవారే" అంటూ జానకి గబగబ మేడ దిగిపోయింది.

సుబ్బారావు మావగారికి నూటయాభై ఇచ్చింది జానకి. ఆయన బోలెడు దుఃఖపడి జానకి ఋణం తీర్చుకోలేనని పదేపదే చెప్పి, ఇంట్లోకివెళ్ళి సుబ్బారావు ఎదట పడేశాడు. సుబ్బారావు మారుమాటాడకుండా భార్యకిచ్చాడు. భార్య మళ్ళా ఆ డబ్బుని తండ్రికే ఇచ్చింది.

“నువ్వే వెళ్ళి ఇచ్చెయ్యి నాన్నా” అంది.

ఆయన సుబ్బారావుకి మహోపకారం చేస్తున్న వాడిలా, ముడిగట్టుకున్నట్లు మునివేళ్ళతో ఆ డబ్బుని తీసి, వీర్రాజు దగ్గరకి వెళ్ళాడు.

తోటలో సద్దుమణిగింది. అవతల పెడలో సుందరమ్మ వాటాలోంచి మాత్రం మాటలు వినబడుతున్నాయి. అన్ని వాటాలవాళ్ళూ దీపాలార్పి పడుకొని, చల్లటిగాలి వీచినట్టుగా, ఆ మొగుడూ పెళ్లాల వాదప్రతివాదాలు విని ఆనందిస్తున్నారు. ఇంచుమించు అప్పటివరకూ సుబ్బారావు ఇంట్లో మావా అల్లుళ్ళ సంవాదం విన్నవాళ్లంతా, ఒక్క రోజులో రెండు కయ్యాలూ జరిగినందుకు మురిసిపోతూ, అయిపోయిన మొదటికయ్యం చెణుకులూ మెరుపులూ నెమరువేస్తూ, కొనసాగుతున్న రెండోకయ్యం విసుర్లని లొట్టలు వేస్తూ నోరూరగ చవులుబుట్టి వింటూ సంతోషం పట్టలేక గింజుకుపోతున్నారు.

“నీకేమేనా మతిపోయిందా” అంటున్నాడు చక్రవర్తి.

“ఎందుకలా కేకలు వేస్తారు?” అంది సుందరమ్మ.

ఇంకో రెండు నిముషాలకల్లా వాదప్రతివాదాలు ఉచ్ఛస్థాయి నందుకున్నాయి సుందరమ్మ వాక్యాలకి ఒక్కరవ్వ ఏడుపు రంగువేసింది.

చక్రవర్తిమాటలు కంచుగంటల్లా నిర్దాక్షిణ్యంగా కంగున మోగుతున్నాయి. చింతనిప్పు కణకణమంటున్నాయి.

“అసలు నీకు నాలుగువంద లెక్కడివంటా...”

“నేను అడపా దడపా వెనుకేసుకున్నది, గొలుసు వెండిచెంబు అమ్మగా వచ్చింది మూడువందలయింది. నా ముచ్చటచూసి జాలిపడి సుబ్బారావుగారి మావగారు ఓ వంద అప్పిచ్చారు. అదీ నేనే తీర్చుకుంటానండి” అంది సుందరమ్మ విసురుగా...

ఈ మాటలు, తోటలో ప్రతి వాటాకీ వెళ్ళి తలుపుతట్టి చెప్పినట్టు వినబడ్డాయి అందరికీ.

సుబ్బారావుకి కూడా వినబడ్డాయి. “అదా కథ” అనుకున్నాడు.

మావగారు అద్దెకట్టేసి ఇంట్లోకొచ్చేసరికి దీపం తగ్గించి ఉంది.

“ఆయన భోంచెయ్యరట. నువ్వేతింటేరా నాన్నా వడ్డిస్తాను” అంది సుబ్బారావు భార్య.

“అక్కర్లేదు” అంటూ ఆయన పక్కమీద మేనువాల్చి, గుడ్డిదీపంలోని దీపకళికను చూస్తూ పడుకున్నాడు.

“అదన్నమాట కథ” అన్నాడు సుబ్బారావు.

“ఇంకేం కథ. డబ్బు వాడి ఎదాన పారేశానుగా?” అన్నాడు మావగారు గోడవైపు తిరిగి పడుకుంటూ.

“సుందరమ్మగారి కొడు కథకేంది. కొడు బావుంది. మీరు పాపం జాలి పడ్డారటగా...వడ్డీకయితేనేం వంద రూపాయలు అప్పిచ్చారటగా...” అన్నాడు సుబ్బారావు మెల్లిగా.

మావగారు బదులు చెప్పలేదు.

ఓ పావుగంట గడిచింది. భార్యకి నిద్ర పట్టిందని గమనించి, సుబ్బారావు మళ్ళీ అందుకున్నాడు. “ఎందుకండీ. మీకీ బుద్ధులు. పెద్దలు కదా.” అన్నాడు.

కాలిపోయిన ఇల్లు శిథిలాలలోంచి పొగలాగ, చీకటిలో మొహంచాటు చేసుకున్న మావగారి హృదయంలోంచి నాలుగైదు వాక్యాలు వచ్చాయి.

చాలా తాపీగా, నిర్వికార స్వరంతో చెప్పాడాయన. ఆయన భార్య ఉండగా ఏ లోటూ రానివ్వలేదు. తను సంపాదించినా మానినా ఇంత వండి పడేసేది. ఈనాడు తను ఒంటరి పక్షి అయిపోయి ఈ అల్లుడినీడన బతుకుతున్నాడు. మళ్ళీ తన ఇల్లు అని ఒకటి ఏర్పాటు చేసుకోవాలని ఆశ అంకురించింది.

“అప్పుడప్పుడు నాకే సిగ్గేస్తుంది. నా మీద నాకే అసహ్యం కలుగుతుంది. అయినా, అంకురించిన ఆశ చావటం లేదు. ఇకనైనా నా కాళ్లమీద నిలబడి,

ఇల్లు నిలబెట్టుకుందామన్న ఊహతోనే, డబ్బు కక్కుర్తికి పాల్పడుతున్నాను. బాబూ నీ ఋణం ఎలాగైనా తీర్చుకుంటా" అన్నాడు.

మావగారు ఇంత మథన పడుతున్నాడని సుబ్బారావుకి తెలియదు. అతనికి జాలి వేసింది. చీకటి ఆసరా చూసుకుని ఇటువంటి సంగతులు తనకి చెప్పినందుకు కొంత రోత కలిగింది. మాట్లాడకుండా అటు తిరిగి పడుకున్నాడు. ఒక నిమిషం ఆగి 'జరిగింది మర్చిపోండి మావగారూ' అన్నాడు—మెల్లగా.

* * *

తెల్లవారేసరికి నరసమ్మగారూ పిల్లలూ లేచి, ముచ్చటగా అలంకరించుకొన్నారు. నరసమ్మగారు పిన్నిగారింటికి వెళ్ళింది కాని అప్పడగలేదు. అవతల వీధిలో పెళ్లి జరుగుతోంది. భోజనాలకి పిలిచారు. పిన్నిగారుకూడా వస్తుందా అని అడగబోయింది. పిన్నిగారు రానంది.

నరసమ్మ బనారసు పట్టుచీర రెపరెప లాడేట్లు తిప్పుకుంటూ వెళ్లింది.

పిన్నిగారు, వరండా ఊడుస్తున్న సుందరమ్మని చూచి నవ్వింది. నరసమ్మకి ఉన్న పట్టుచీర ఒక్కటే అని పిన్నిగారు ఏనాడో పసిగట్టింది. అదే పెళ్ళిళ్ళకీ పేరంటాలకీ కట్టుకు వెళ్తుందని చాలాసార్లు సుందరమ్మకు చెప్పిందావిడ లోగడ.

తన నవ్వుచూసి సుందరమ్మ గ్రహించి ఏకీభవిస్తుందని ఆశించింది కాని, సుందరమ్మ నవ్వలేదు. కాఫీనీళ్లు పడేసింది.

పిన్నిగారికి మనస్సు చివుక్కుమంది. ఆవిడకి క్రితం రాత్రి 9 గంటలనించి మనసు చివుక్కుమంటూనే ఉంది.

ఈ తోట అంతటికీ చాలా ఖరీదైన కోరికలు తమ ఇద్దరివే. తనదే ఒక్కరవ్వ ఎక్కువ.

అయితే తను మేడకొనేలోగా సుందరమ్మ కారు కొనెయ్యడంతో కారుగల సుందరమ్మతో సరసాలాడడం అనేది హఠాత్తుగా ఆవిడ జీవిత పరమావధి అయి ఊరుకుంది.

"ఏం సుందరమ్మా, కాఫీపొడుం కావాలా?" అంది లాలనగా.

నిజంగా కావలసినా కాస్త బెట్టు చూపించింది. సుందరమ్మ: "అబ్బే వద్దండీ. కారుందిగా. కారులో అలాపోయి ఏ హోటల్లోనో కాఫీతాగేసి ఆ చేత్తో కూరలు కొనుక్కు వచ్చేస్తాం" అంది.

కోపంగావున్న చక్రవర్తికి ఒళ్లు మండింది.

'అబ్బే ఎందుకూ కారుంది కాబట్టి, అందులో పెట్రోలుతీసుకుని చెరికాస్తా తాగేద్దాం ఈ పూటకి. ఆనక ఏ టైరో వండుకుతినేద్దాం' అన్నాడు మెల్లిగా.

మొత్తానికి పిన్నిగారు మళ్ళీ 'నాగపూరు కప్పులో నాగపూరు కప్పుడు' కాఫీపొడుం ఇచ్చింది.

* * *

కాఫీతాగి చింతకుపడుతూనే మార్కెట్టుకి బయలుదేరాడు చక్రవర్తి. అతనికి తోటలో తలెత్తుకు తిరగడం సిగ్గుగావుంది తన గదిన్నర వాటా ఎదట కారు ఉంచుకున్నందుకు. చక్రవర్తి గేద్దెక్కే సరికి సుబ్బారావు కనబడ్డాడు.

రాత్రి తమతమ స్వర్గసీమలలో జరిగిన రభసలు రట్టు అయిన సంగతి ఇద్దరికీ తెలుసు. సూటిగా చూసుకుందికి ముందు సిగ్గుపడ్డారు. హఠాత్తుగా ఇద్దరూ ఒకేక్షణాన తెగించి మొహామొహాలు చూసుకున్నారు. ఒకరిమీద ఒకరికి సానుభూతి, స్వంతానికి జాలీకూడా ఆ చూపుల్లో స్ఫురించాయి. తక్షణం ఆగి, ఫక్కున నవ్వారిద్దరూ.

"నాకు మావగారు మీకు కారు" అంది. సుబ్బారావు నవ్వు.

"మరే, నాకు కారు మీకు మావగారు" అంది చక్రవర్తి నవ్వు.

"వస్తానండి"

"మంచిది"

ఇటు అల్లుడు, అటు చక్రవర్తికూడా ఒకే సమయాన బయటకు వెళ్ళడంతో 'సుబ్బారావు మావగారి' బుర్ర చురుకుగా పనిచేసింది.

సుందరమ్మ దగ్గరకెళ్లి తను అప్పిచ్చిన వందా కాక ఇంకో యేభై అర్జెంటుగా కావాలన్నాడు.

సుందరమ్మ లాకేత్వం ఇచ్చింది.

ఆయన యింటికొచ్చి ఆలోచనలోపడి కొన్ని గోళ్లు కొరుక్కునేలోగా సుబ్బారావు తిరిగివచ్చాడు.

"మామగారూ మీరు రాత్రి కోపంలో డబ్బు అప్పుతెచ్చినట్లున్నారు. జరిగిందేదో జరిగిందిగాని, ఈ డబ్బు తీసికెళ్ళి ఆఅప్పు తీర్చెయ్యండి" అన్నాడు బ్యాంకునుండి తెచ్చిన నూటయాభై చేతికిస్తూ.

మావగారు విస్తుపోయి మాటలాడేలోగా సుబ్బారావు స్నానానికి వెళ్ళిపోయినందువల్ల ఆయన ఆ ప్రయత్నం మానుకొని, తను సంకల్పించిన కార్యాచరణకు ఉపక్రమించాడు.

నాందిగా పాతికరూపాయలు వేరేతీసి జేబులో దోపుకున్నాడు. నూటపాతిక పట్టుకొని జానకి వాటాలోకి వెళ్ళాడు.

రాత్రి ఆమె చేసిన సహాయం జన్మజన్మాలకు మర్చిపోనన్నాడు. నూట పాతిక చేతిలోపెట్టి ఇంక పాతిక బాకీ అని గుర్తుంచుకోవలసిందిగా హెచ్చరించాడు. మళ్ళా కృతజ్ఞత ప్రకటించి ఆమె ఋణం తీర్చుకోలేనని చెప్పాడు. అయినా ఆ ఋణం తీర్చుకునేవరకూ నిద్రపోయేదిలేదని ఉద్ఘాటించాడు.

"అబ్బే దానికోసం నిద్ర పాడు వేసుకోవడం ఎందుకండీ" అంది జానకి వినయంగా.

"అలా వల్లకాదు. నేను నీకు ఉపకారంచేసి తీరుతాను. చూడమ్మా...ఇవాళ శుక్రవారం కదూ నీకు బడిఉన్నట్టుంది...నిక్షేపంలా వెళ్ళి ఈ పూటకి పాఠాలు చెప్పు ...మధ్యాహ్నం మాత్రం సెలవుపెట్టి ఇంటికొచ్చెయి...అబ్బే కాదనకు.. నే తరవాత చెబుతానుగా. తప్పకుండా రావాలి సుమీ" అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడాయన. ఆ తరవాత, భోజనంకూడా చెయ్యకుండా సరాసరి అవతల వీధికెళ్ళాడు. ఏ పెళ్లివారి తాలూకో తెలియకుండా సందడిగా తిరుగుతున్న నరసమ్మని పిలిచాడు.

"తప్పకుండా రావాలి సుమండీ! నామీద ఒట్టే. పిల్లల్నక్కడే ఉండనివ్వండి. సరిగ్గా ఒంటిగంటకల్లా వచ్చెయ్యాలి" అని చెప్పాడు.

"అలాగే" అంది నరసమ్మ.

ఇంటికొచ్చి భోజనం చేశాడు. సుబ్బారావు ఆఫీసుకు వెళ్లిపోగానే, కూతుర్ని స్థిమితంగా కూర్చోబెట్టి సంగతి సందర్భాలు బోధపరిచాడు. కూతురు ఆశ్చర్యపడింది. గట్టిగా నచ్చచెప్పాడు.

ఫలహారాలు చెయ్యమని పురమాయించి, కండువా వేసుకు రాచకార్యాలు చక్కబెట్టుకోడానికి బయలుదేరాడు.

ఒంటిగంటన్నరకి ఇంటికి వచ్చిన జానకి 'సుబ్బారావు మావగారి'ని చూసి ముక్కుమీద వేలు వేసుకుంది. పూలరంగడల్లె పెళ్లికొడుకల్లె ముస్తాబై పోయాడాయన.

"వచ్చావా...సెలవిచ్చారన్నమాట. పది నిముషాలు కూర్చో తొందరలేదులే" అన్నాడు.

"తొందర దేనికి?" అంది జానకి

"మరే. తొందర దేనికి...తొందరేం లేదు చూడమ్మా ... కాస్త మొహం రుద్దుకుని తల దువ్వుకో...ఏం ఇష్టంలేదా...పోనీ వద్దులే. అలాగే బాగున్నావు. మహాలక్ష్మిలాగ." అన్నాడు.

జానకికేం అంతు పట్టలేదు.

"జానకమ్మా...ఇలా రామ్మా" అంది నరసమ్మ గారు సరికొత్త పట్టుచీర రెపరెపలాడేటు నడుస్తు.

జానకి జవాబిచ్చేలోగానే వచ్చి రెక్కపుచ్చుకొని సుబ్బారావు ఇంట్లోకి తీసుకువెళ్లి పోయిందావిడ.

లోపల చిన్న జంబుఖానాపరచిఉంది; మూడు కుర్చీలు వేసిఉన్నాయి.

జానకిని కూర్చోపెట్టి సుబ్బారావు భార్య మంచిచెడ్డా మాట్లాడింది.

సుందరమ్మగారి కారు చూశారా అంది. చక్రవర్తిగారిని బళ్లో హేళనచేస్తున్నారా అని అడిగింది. జానకి జాలితో నవ్వి 'మరేనండి' అంది.

"అప్పుడే బళ్లో అందరికీ తెలిసిపోయింది. కారులో రాలేదేం అనీ కారుకొన్నారా అనీ అంతా హేళనగా అడుగుతున్నారు; పాపం ఆయన చాలా చిరాకుపడిపోతున్నారండి ... వెధవమనుషులు ఎవరి దారిన వాళ్ళని బతకనియ్యరు. అయినా కారుకొంటే వీళ్లకెందుకో" అని చిరాకుపడింది.

'మరేమరే' అన్నాడు సుబ్బారావు మావగారు. అదుగోవచ్చారు!' అన్నాడు ఒకక్షణం ఆగి.

ఒకనిమిషం తరవాత 35 ఏళ్ళ రామారావుగారొకరు, 30 ఏళ్ళ లక్ష్మీకాంతమ్మ ఒకామెవచ్చారు.

రామారావుగారు 'సుబ్బారావు మావగారి'కి ఏడాదినుండి ఆప్తమిత్రుడు, కుడిభుజం, పంచ ప్రాణాలూ మొదలైనవిగా ఉంటున్నాడు. ఆయన చెల్లెలు ఈయనకి దేవతా, ప్రపంచం, జీవితం, జీవిత పరమావధి, మొదలైనవిగా ఉంటోంది. జీవిత భాగస్వామినిగా ఉండాలని ఈయనప్రగాఢవాంఛ. ఆవిడ పెట్టే బట్టలకొట్టుని సవ్యంగా లాభసాటిగా నడపడానికి ఈయన ఒప్పుకుంటే ఆవిడా ఒప్పుకుంటుందట. అయితే మడత పేచీ ఒక్కటుంది. ఆవిడ సోదరుడైన రామారావుకూడా కొంతకాలంగా అవివాహితుడే ఈ కొంతకాలంలోను ఆయన జానకిని చూసి ముమ్మరంగా ప్రేమిస్తున్నాడు. ఆవిడను వివాహం చేసుకోవాలని అహోరాత్రాలు తపస్సు చేస్తున్నాడు. ఐదారుసార్లు ఒంటిపూట భోజనం చేశాడు. సుబ్బారావుగారి మావగారు అదెంతపని అన్నాడు. "అదేదో సాధిస్తే మీ పెళ్లి ఖాయం. ఇద్దరం, ఇల సాటిలేని జంటలా ఉండవచ్చును" అన్నాడు రామారావు.

ప్రధానానికి ముహూర్తం పెట్టుకోడానికే వాళ్లు వచ్చారు. జానకికి ఈ బృహత్కథ తెలియదు. ఎవరో వచ్చారని లేచిపోబోయింది.

ముగ్గురు మనుషులు ముక్తకంఠంతో ఆమెను వారించి కూర్చోపెట్టారు.

సుబ్బారావుభార్య ఫలహారాలూ కాఫీ పట్టుకొచ్చి అందరికీ ఇచ్చింది. అదీ ఇదీ, మంచీ చెడ్డా మాట్లాడుకుంటూ తింటున్నారు. జానకి మాట్లాడనూ లేదు తిననూ లేదు.

నరసమ్మగారు ఇది గమనించింది. 'తినమ్మా సిగ్గెందుకు?' అని లాలించింది. ఆ క్షణాన ఆమె జానకికి దొడ్డమ్మ భూమిక నిర్వహిస్తోంది. సుబ్బారావు మావగారు అంతకుముందు చెప్పిన ప్లాను ప్రకారం ఆవిడ జానకిని చనువుగా మందలించి తిను ఫరవాలేదు ఆవటా అంది. ఆ లాలనలో ఆవిడ చేతి కాఫీ గ్లాసు కాస్త కదలాడి ఓ గుక్కెడు కాఫీ, ఆమె కట్టుకున్న నీలం పట్టుచీర మీద పడింది.

"అయ్యో, అయ్యో!" అంది నరసమ్మగారు.

అంతా తుళ్ళిపడి చూశారు.

"నేనేం చేతునమ్మా, పొరపాటున పడింది. వెంటనే కాసిని నీళ్ళుపోసి కడిగేస్తే డాగుపోతుందమ్మా" అంది సుబ్బారావు భార్యవంక భయంతో చూస్తూ.

"మరేం ఫరవాలేదండి. ఆనక కడిగెయ్యొచ్చు" అంది సుబ్బారావుభార్య నిర్లక్ష్యంగా.

"ఏమోనమ్మా నీ ఇష్టం. నేను చెప్పవలసింది చెప్పాను. మధ్య నాకెందుకు. పాడయ్యేది నీచీరేగా" అంది నరసమ్మగారు.

ఒక్కసారిగా అంతా ఫెళ్లున నవ్వడంచూసి విస్తుపోయిందావిడ.

సుబ్బారావుగారి మావగారు గొంతు సవరించుకున్నాడు, అసలు వ్యవహారం పరిష్కరించడానికి.

"ఏమోయ్. రామారావు నీకు నచ్చినట్టేగా. మా పిల్ల ముద్దబంగారం అనుకో. ముల్లోకాలూ గాలించినా ఇంతటి సాత్వికురాలు నీకు దొరకదు" అన్నాడు.

"నిజమేనండి. మాలక్ష్మి కళ ఉట్టిపడుతోంది" అంది లక్ష్మీకాంతమ్మ.

జానకి తెల్లబోయి చూచింది.

"జానికమ్మా! వీడు నా తమ్ముడువంటి వాడనుకో. బహుయోగ్యుడు. నీకు అత్తమామలబెడద, పిల్లలబెడదా ఉండదు. ఆడబడుచు ఉందికాని, ఆ పిల్లకీ నేడో రేపో పెళ్ళయి అత్తారింటి కెళ్తుం దనుకో..." అన్నాడు 'సుబ్బారావు మావగారు'

"మరే. అదెంతసేపు. దానికోసంబంధం స్థిరపడిపోయినట్టే. పెళ్ళికొడుకు సిద్ధంగా వున్నాడు" అన్నాడు రామారావు వికవికనవ్వుతూ.

సుబ్బారావు మావగారు సిగ్గుపడిపోతూ, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ తలవంచుకున్నాడు.

"అరె. లేచిపోతున్నావేం?" అంది నరసమ్మగారు—అంతా తుళ్లిపడి చూశారు.

జానకి లేచి నిలబడింది.

"ఏమిటండీ ఈ గోలంతాను? పనుంది రమ్మన్న దిందుకా? నాకెవ్వరూ పెళ్లిసంబంధాలు చూడక్కరలేదు. నా ఏడుపు నేను ఏడుస్తాను" అని చరచర వెళ్లిపోయింది. వెళ్లి తనగదిలోపడుకుని ఏడవసాగింది.

కొంతసేపు ఏడ్చాక మనసు తేలికపడింది. ఆలోచనలనేవి ఒక్కొక్కటి అతి నెమ్మదిగా, నిశ్శ

బ్దంగా జంకుతున్నట్టు రావడం మొదలు పెట్టాయి. "నా అన్నవాళ్లు, లేకగదా నాకీ అవస్థ" అనుకుంది. పలకరించిన ప్రతి మొగాడూ పెళ్లి చేస్తాననడమో, చేసుకుంటాననడమో తప్ప మరోరకంగా మాట్లాడడు. ఉడతల్ని పట్టేవాడిలా చూస్తాడు ప్రతివాడూ... జానకికి భయం వేసింది. ఆలోచిస్తూవుండగా లీలగా నిద్రవచ్చింది.

సాయంత్రం ఐదింటికి మెలకువవచ్చి, లేచి వరండాలోకి వచ్చింది జానకి.

తోటంతా శ్మశానవాటికలా నిర్జీవంగా కనబడింది. ఈ పెడవాళ్లంతా షికార్లకి వెళ్ళినట్టున్నారు...బుర్ మని కారుశబ్దం వినబడింది.

టాపులేని పాత ఆస్టిన్ డొక్కులో శిక్కు మొహం పెట్టుకున్న చక్రవర్తి, టెక్కు వొలకబోస్తూన్న సుందరమ్మ షికారుకి వెళ్తున్నారు. సుందరమ్మ ఎర్రటిచీర కట్టింది. దానికి జోడుగా మహా వికృతమైన నల్లరంగు రవికను వేసుకుంది. పూలు ముడిచింది. పైగా పెదపెద నల్లద్దాలున్న కళ్ళజోడు తగిలించుకుంది.

జానికి సానుభూతితో నవ్వింది. కారుని భయపడుతూ నడుపుతున్న చక్రవర్తిని చూసి 'పాపం' అనుకుంది. అంతలో ఆమెదృష్టి ఎదట మేడమీదికి పోయింది. పైన వీర్రాజు కిటికీ దగ్గర విచారంగా నుంచుని సిగరెట్టు కాలుస్తూ కారులో జంటవంక చూస్తున్నాడు.

'పాపం' అని మళ్లీ అనుకుంది జానకి. చక్రవర్తి దురవస్థ తనకి పట్టలేదే అని వీర్రాజు బెంగపెట్టుకున్నాడనిపించింది. అంతలో, క్రితం రాత్రి అప్పుతెచ్చిన డబ్బుసంగతి జ్ఞాపకంవచ్చి, లోపలికెళ్ళి డబ్బు తీసుకొని మేడ ఎక్కింది.

వీర్రాజు కొంచెం కంగారుపడ్డాడు ముందు - ఆపైన ముగ్ధుడైపోయాడు.

జానకి ఇచ్చిన డబ్బుని పరాకుగా అందుకున్నాడు.

"ఏమండి వంట్లో బాగులేదా?" అంది జానకి.

"వంట్లో బాగానే ఉందండి...మనసే బాగులేనిది" అన్నాడు వీర్రాజు కిటికీవంక చూస్తూ.

అతని మనసు ఎందుకు బాగులేదో తెలుసుకోవాలని జానకికి కుతూహలం లేదు. తను యథాలాపంగా కుశలం అడిగితే అతను అలా జవాబివ్వడం జానకికి నచ్చలేదు. క్రిందకు వెళ్లిపోబోయింది.

"ఇప్పుడే ఓ పెద్ద కుట్రలోంచి బయటపడ్డానండి." అన్నాడు వీర్రాజు ఆమెవంక చూడకుండానే.

జానకి వెళ్లిపోలేదు. ఏం కుట్ర? అని అడగనూ లేదు.

"నాకీ నాలుగిళ్లు ఉండడం, నా అన్నవాళ్లు దగ్గర్లో లేకపోవడం చూసి, అడ్డమైనవాళ్ళూ నాకూ పెళ్ళిచేసెయ్యాలని కంకణం కట్టుకున్నారండి.... మధ్యాహ్నం ఒక పరిచితుడు పనుందని వాళ్ళింటికి తీసుకెళ్ళి ఓ రాక్షసి పిల్లని చూపించి నచ్చిందా అని అడిగాడండి. ఆడా మగా ఇరవైమంది నావంక శ్రద్ధగా చూస్తూన్నారు. చిరాకుపడి లేచివచ్చేశానండి." అన్నాడు వీర్రాజు.

జానకికి ఒక్కసారి గుండె కొట్టుకుంది. సరిగ్గా ఆ వేళకే తనమీదా ఇక్కడ కుట్ర జరిగిందని చెప్పబోయి, తమాయించుకుంది.

"ఈ ప్రపంచంలో ఒక్కళ్లం ఉండడం మహా కష్టమండి. ఎవరి దారిని వాళ్లు బతకరు. ఇంకోళ్లని బతకనివ్వరు. ఒకొక్కసారి భయమేస్తుంది" అన్నాడు వీర్రాజు.

జానకికి గుండె కొట్టుకుంది. తన భావాలని పైకి చదివేస్తున్నాడు. ఆ ముక్క చెప్పాలని అనుకుంది. క్షణంలో సగంసేపు వీర్రాజు ముఖంలోకి పరీక్షగా చూచింది. అతను హేళన చేయటంలేదు. సూటిగా తనవంక చూశాడు.

"నిజమేనండి...వస్తా" అని క్రిందకి బయలుదేరింది జానకి.

"జానకీ" అని పిలిచాడు వీర్రాజు.

కంఠస్వరం మారింది. భయపడుతూనే, జానకి వెనక్కి తిరిగింది.

"నా ఆత్మకథ సరదాగా చెప్పలేదండీ. నాకు మీమీద గౌరవం, నమ్మకం గురి ఉన్నాయి. అందుకని మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటే, నేను సుఖపడతా

ననీ, మిమ్మల్ని సుఖపెట్టగలననీ అనుకుంటున్నాను." అన్నాడు వీర్రాజు.

అంత హఠాత్తుగా ఇటువంటి సంగతి చెప్పడంతో జానకి ఎగిరి గంతెయ్యాలో, ఏడ్చి మొత్తుకోవాలో, ఛీత్కరించుకోవాలో చటుక్కున నిర్ధారణ చేసుకోలేకపోయింది. ఒక్క క్షణం తరువాత ఆమెకి కోపం వచ్చింది. బళ్ళో హెడ్మాస్టరు, సెక్రటరీ, కొందరు టీచర్లు, ఇక్కడ సుబ్బారావు మావగారూ అందరూ తనని ఈ సంగతి ఎత్తి వేధించారు. ఇప్పుడు ఇతనూ అదే చేశాడనిపించింది.

"మీరూ ఇంతేనా" అని గొణుక్కుంటూ చరచర మేడదిగిపోయింది.

వీర్రాజు కుర్చీలో కూలబడి ఏకబిగిని పది సిగరెట్లు కాల్చి, బాధపడ్డాడు.

తెలివైనదాన్ననీ తూచి మాట్లాడుతానననీ అనుకునే జానకి తొలిసారిగా తప్పుచేసినట్లు మథన పడింది......

చక్రవర్తి రథం తిరిగి తిరిగి తొమ్మిదిగంటలకి కొంపచేరేసరికి తోటలో నిద్రబోతున్న కొద్దిమందికి మెలకువ వచ్చింది.

చక్రవర్తి ఇంట్లోంచి నవ్వులు స్పష్టంగా వినబడ్డాయందరికీ.

సుందరమ్మ అమాయకత్వం చూసినకొద్దీ చక్రవర్తికి ఒకవంక కోపం తగ్గిపోయి, మరొకవంక ప్రేమ ఇనుమడిస్తోంది.

ఆ సాయంత్రం దుకాణానికివెళ్ళి పెద్ద పెద్ద చీరెలన్నీ బేరమాడి ఒక జేబురుమాలు రూపాయపెట్టి కొంది. ఇంకోచోట ఏవో నాలుగు సామానులుకొని కారులో పడెయ్యమంది షాపువాణ్ణి.

"ఏ కారులోనండి" అని అడిగాడు అతడు.

పెద్ద పెద్ద కారులమధ్య, కాంతులీనే కారుల మధ్యఉన్న తన చిన్న పాతకారును చూసి సిగ్గువేసింది సుందరమ్మకి.

"అదుగో ఆ డొక్కు కారులేదూ....చిన్నది, అందులో" అంది. మళ్ళా ఏం తోచిందో..."ఆ కారు మా డ్రైవరుదిలెండి. మాది రిపేరుకెళ్ళింది" అనేసింది.

పక్కనేఉన్న చక్రవర్తి బలవంతాన నవ్వు ఆపుకున్నాడు. ఇంటికి వస్తూండగా, చక్రవర్తి ఎత్తి పొడిచాడు.

"కారు డ్రైవరుదన్నావు. రేపొద్దున, ఈ పట్టుచీర నీ దాసీదానిదంటావు...మరి నేనో?" అన్నాడు నవ్వుతూ.

అరచేత్తో చక్రవర్తి నోరుమూసి 'ఛ ఏం మాటలండీ!' అంది సుందరమ్మ......

కొంచెంసేపు తరువాత, చక్రవర్తి కారుని కుడివేపుకు తిప్పాలనుకున్నాడు అలవాటు ప్రకారం. దైవం అన్యథా సంకల్పించాడు. స్వతంత్రభావాలు గల కారు, 'మురారేః తృతీయః పంథాః' అనుకుంది. అది ఎడంపు అయినందువల్ల చక్రవర్తి బ్రేకు వేసేలోగా ఒక చెట్టుదగ్గరకు వెళ్ళి దాన్ని కూలద్రొయ్యబోయి గట్టి ప్రయత్నం చేయకుండానే ఆగిపోయింది.

పది రూపాయలు ఖర్చుపెట్టాక, చక్రవర్తి, సుందరమ్మగారుని ఇంటికి తీసుకొచ్చారు......

"...అందుకని, అందమైన ఓ సుందరమ్మా— ఈ కారు లేకపోతేనే మనం ఆనందంగా ఉంటాం. కొత్తదెబ్బ కూడదెబ్బకున్నాక మంచికారు కొందాం. అందాకా దీన్నే ఉంచుకుందామంటే మన ఆర్జన అంతా దీనికే అర్పించి, కష్టాల్లో కాస్త ముసుగు పడుకోవాలి. బోధపడిందా?" అన్నాడు చక్రవర్తి లాలనగా.

అప్పటికి ఏడుపు పర్యంతం అయిన సుందరమ్మ. సరేఅంది.

"దీన్ని అయినకాడికి అమ్మేద్దాం...బహుశా మనింటాయన వీర్రాజు కొనమ్మను" అన్నాడు చక్రవర్తి......

పీడకలలతో మధురస్వప్నాలతో అనుమానాలతో భయాలతో గడచింది శనివారంరాత్రి.

అందంగా ఆనందంగా వికారంగా, విచారకరంగా నలుగురికీ నానారకాలుగా ఆదివారం ఆతోటలో ఉదయించింది.

కొద్దిసేపటిలోనే, సుబ్బారావు మావగారు నరసమ్మ ఇంట్లోకి వెళ్లాడు.

"నిన్న మధ్యాహ్నం పెళ్లిచూపుల విషయం మూడో ప్రాణికి చెప్పవద్దు. చెప్పకుండా ఉంటే నిన్న మా అమ్మాయి ఎరువు ఇచ్చిన పట్టుచీర అచ్చంగా మీకే ఇస్తాను." అన్నాడు.

అలాగే నని తలూపింది నరసమ్మ. ఊపిం దే కానీ తను బ్రహ్మాండమైన రహస్యం కాపాడుతున్న దన్న ఆలోచనతో ఉక్కిరి బిక్కిరైపోయింది. కాలు నిలవటంలేదు.

ఇంకో అరగంటలో ఇంకో కొత్తసంగతి వింది. వీర్రాజు ఊరికెళ్ళిపోతున్నాడు. ఐదారునెలలవరకు రాడట. అదైదబ్బు క్రిందవాటాలోఉన్న "పెద్దమనిషి" గారికి ఇవ్వవలసిందని, ఆయన తనకు బట్వాడా చేయిసాడనీ అందరికీ చెప్పేశాడు. వీర్రాజు జానకి ఇంటికి వెళ్లి లేదని నరసమ్మ పసిగట్టింది.

"పిల్లాపిల్లా వీర్రాజు దేశాంతరం వెళ్తున్నాడు తెలుసా?" అంది గబగబవెళ్లి—జానకి ఆశ్చర్యపడింది. అలాగా అని, మళ్ళా తలవంచుకుని పని చూసుకో సాగింది.

నరసమ్మగారికి ఉత్సాహం చల్లారిపోయింది. "అమ్మడూ ఓరూపాయి అప్పిస్తావూ?" అంది. జానకి జవాబివ్వకుండా లేచి రూపాయిచ్చింది. ఇలా సులువుగా రావటం నరసమ్మకి మరీ నిరుత్సాహం కలిగించింది.

సరాసరి తోటలో నాలుగైదిళ్లకు వెళ్ళి బియ్యం అప్పడిగింది. అంతా లేదన్నారు. ఇలాంటి రాక్షసులకు నేను రహస్యం ఎందుకు చెప్పాలి అనుకుంది. ఆఖరుసారిగా సుందరమ్మయింటికి వెళ్ళి అడిగింది.

సుందరమ్మ ఏకళనుందో ముందర బియ్యం ఇచ్చింది. వెంటనే నరసమ్మకి పరమ ఆప్తురాలై పోయింది.

"ఆఖరికి మాపొరుగింటిపిన్నిగారికి కూడా చెప్పకేం" అని మరీమరీ హెచ్చరించి, జానకమ్మ పెళ్ళిచూపుల ముచ్చట చెప్పేసింది. పిన్నిగారు తడిక అవతల చలనంలేకుండా కూర్చుని వింది.

నరసమ్మ వెళ్ళిపోగానే సుందరమ్మ దగ్గరకివచ్చి తడికవతలనుండి తను విన్న సంగతి తనకి చిన్నప్పటి నుండీ తెలిసినట్లుగా చెప్పి, జానకిమీద జాలిపడ బోసింది.

"జానకి వీర్రాజుని చేసుకుంటే బాగుండును." అనేసింది చటుక్కున. అంతలోనే నాలిక్కరుచుకుంది. వీర్రాజు ఊరెళ్లిపోతున్నట్టు తెలిసిన మరుక్షణంలో అతనున్న వాటా తన కివ్వమని అడిగి, మాట తీసుకుంది. మేడ కట్టకపోయినా, కనీసం కొనక పోయినా, ఈనాటికి మేడింట్లో అద్దెకైనా దిగేఅదృష్టం పట్టిందిగదా అని మురిసిపోయింది. అందులోను నిన్న కాక మొన్న కాపురంకొన్న సుందరమ్మ కళ్లఎదుట తను మేడలోకి మారడం అంటే మజాకా కాదు. ఆవిడ మాటకి భర్త ఎన్నడూ కాదనలేడు. సుబ్బారావు మావగారిని పేరు లేకుండా సుబ్బారావుగారి మావగారని చెప్పుకున్నట్టే, పిన్నిగారిభర్తని పిన్నిగారిభర్తే అని చెప్పుకోవడం పరిపాటి.

ఇప్పుడు వీర్రాజుకీ జానకికీ పెళ్ళయితే మేడమీద వాటా ఖాళీ అవదు. అందుకని పిన్నిగారు 'తూనా బొడ్డు' అనుకుని వెళ్ళిపోయింది.

సుందరమ్మకిమాత్రం పిన్నిగారి సూచన ఆలోచనలు రేపింది. జానకీ వీ రాజూ పెళిచేసుకుంటే తనకాపురం వాళ్లకే అమ్మేయ్యవచ్చు. అప్పుడది తన కళ్ళఎదుట పడివుంటుంది. అపుపా త తీసుకుంటూ ఉండనూవచ్చు...అదీకాక, జానకి చూపుల ఉదంతం విన్నతరువాత, ఆవిడకి జానకిమీద ఒకవిధమైన వాత్సల్యం కలిగింది...

ఆదివారం కాబట్టి ఆరోజు మధ్యాహ్నం సుందరమ్మ చక్రవర్తికి ఇష్టమైన ఫలహారం చేసింది. మీగడ తరకలు పడకుండా బహు జాగ్రతగా కాఫీ చేసియిచ్చింది. సిగరెట్టు అందిచ్చింది. అగ్గిపుల్ల వెలిగించింది.

'ఏవండీ, కాపురంవుండే ఆఖరి ఆదివారం యిదే. మళ్ళా ఆదివారంనాటికి కారెలాగా అమ్మేస్తాం. అందుకని సినిమా కెళదాం' అంది.

భార్య పూర్తిగా దారికి వచ్చినందుకు ఆనందిస్తున్న చక్రవర్తి సరేనన్నాడు.

తనకి రహస్యం చెప్పి, ఆప్తురాలైన నరసమ్మనీ, ఖరీదైన కోరికలుగల పొరుగింటి పిన్నిగారినీ, బ్రతిమాలి బామాలి జానకమ్మనీ వెంటబెట్టుకుని ఐదున్నరకల్లా కారులో కూర్చుంది సుందరమ్మ. వీర్రాజు వెళ్ళే వేళకి అక్కడేవుండి బాధపడడంకన్నా ఇంకెక్కడికి పోయినా నయమేనని ఒప్పుకుంది జానకమ్మ.

కారు బయలు దేరుతూ ఉండగా సుబ్బారావు గారి మావగారు ఎదురొచ్చాడు. జానకిని ఎవరేనా ఎక్కడికేనా తీసుకెళ్తున్నారంటే ఆయనకి భయం. నేడు కాపోతే రేపైనా తన మాటకి ఒప్పించవచ్చునని గట్టి నమ్మకం ఉంది. అందుకని జానకిని వదలడం ఇష్టం లేదు.

"షికారుకా?" అన్నాడు.

"కాదండి సినిమాకి" అన్నాడు చక్రవర్తి—

"దేనికి?"

చక్రవర్తి చెప్పాడు.

"నేనూ వస్తా. చూడాలనుకుంటున్నా" అన్నాడు సుబ్బారావు మావగారు.

తప్పనిసరిగా ఆయన్ని ఎక్కించుకున్నారు కారులో.

* * * *

సినిమా మొదలు కావడానికి కొంచెం సేపుండగా సుందరమ్మ జానకిని ఒక ప్రక్కకి తీసుకెళ్ళింది.

"జానకమ్మా, నీ అక్కవంటిదాన్ని నేను. ఒక్క సంగతి అడుగుతాను. మర్మం లేకుండా చెప్పు. వీర్రాజుని చేసుకోవడం నీ కిష్టమేనా?" అంది.

జానకి నోట మాట రాలేదు.

"చెప్పు ఫరవాలేదు. నిన్న పెళ్ళిచూపుల ముచ్చట విన్నానులే..అన్యాయే. ఒంటరిగా ఉన్నంత కాలం మనుషులకి తుంటరి ఊహలు వస్తూనే ఉంటాయి. నా మాటవిని, నీకు అతను నచ్చితే చేసుకో..." అంది సుందరమ్మ.

"ఆయన మిమ్మల్ని కూడా అడగమన్నారా?" అంది జానకి తలవంచుకొని.

"ఇదివర కోసారి అడిగాడా ఏమిటి? నువ్వేమన్నావు? ఒద్దన్నావా!...అయ్యో పిచ్చిపిల్లా... ఎంత వెర్రిపని....అందుకే నన్నుమాట అతను ఊర్లో పోతున్నాడు...ఇప్పుడు చప్పున చెప్పు జానకీ. వేళ మించిపోతోంది" అంది సుందరమ్మ తొందరపడుతూ.

"ఔనక్కయ్యా" అంది జానకి చెంగుతో కన్నీళ్లు తుడుచుకుంటూ.

"ఇక్కడ ఏడిస్తే నవ్వుతారు. ఏడవకు. వెంటనే ఇంటికెళ్లిపోదాం ఉండు" అంటూ సుందరమ్మ హాలులోకివెళ్లి చక్రవర్తినిపిలిచి సంగతి చెప్పింది.

"మంచిపని చేస్తున్నారండిమీరు. అతను యోగ్యుడు. మీరు సుఖపడతారు" అన్నాడు చక్రవర్తి.

నాలుగు నిముషాలలో అంతా సినిమా మానుకుని కారులో ఎక్కారు. సుబ్బారావుగారి మావగారు జానకికోసం వచ్చాడు కాబట్టి, ఆయనకి సినిమాపట్టింపు లేదు. నరసమ్మకి సుందరమ్మమాట ప్రస్తుతం వేదం. పిన్నిగారు ఒక్కర్తీ ఎలా ఉంటుంది—అందుకని అంతా బయలుదేరారు.

"జానకి వీర్రాజుని పెళ్లి చేసుకుంటోంది" అనేసింది సుందరమ్మ పట్టలేక.

ఆశ్చర్యం సంతోషం కోపం మొదలైన రసాలతో నిండిన మాటలు ఒక్కసారి చెలరేగాయి.

సుబ్బారావు మావగారికి ఇదేం సయించలేదు. పిన్నిగారికి నచ్చలేదు మేడమీద వాటా ఖాళీకావన్న ఆలోచనవల్ల.

ఇరుకుగావున్న ఆ కారులో కూర్చున్న అందరి ఆలోచనలు,ఆశలూ వారి నిశ్వాసాల్లో నిండి బయటకు వచ్చి కలగాపులగంగా కలిసిపోతున్నాయి. హోరున కురుస్తున్న వానలో కారు కంగారుగా పరిగెడుతూంది రైలుకి బయలుదేరేలోగా వీర్రాజుని అందుకోవాలని.

కారు నడపడంలో అలవాటు చాకచక్యం లేని చక్రవర్తి ఒక మలుపులో బ్రేకునొక్కి, సకాలంలో క్లచ్ వెయ్యలేకపోవడంతో ఇంజన్ ఆగింది. వరిమిలా కారు ఆగింది.

'తొయ్యాలి' అన్నాడు చక్రవర్తి.

ఎవరు తోసేది? నలుగురాడవాళ్లు, ఇద్దరు మొగాళ్లు. బయటచూస్తే కుండపోతగా వర్షం. హోరు గాలి. జల్లు లోపలికి కొడుతూంది.

"నాకసలే నీరసం. పైగా జ్వరం. కష్టపడ లేను" అన్నాడు; కారుకదిలి వీర్రాజు వుండగా ఇల్లు చేరడం ఇష్టంలేని 'సుబ్బారావు మావగారు'.

ఎవరూ మాట్లాడలేదు. పెద్దపెద్ద కారులు, ఖరీదైన కారులు తళతళ తారు రోడ్డుమీద హంసల్లా, జారిపోతున్నట్టు ప్రవహిస్తున్నాయి.

కారులోఉన్న ఆరుగురూ ఆలోచనలోపడ్డారు. అందరిలోను కోరికలు చెలరేగాయి.

సుబ్బారావు మావగారికి సుతరామూ ఇష్టం లేదు కారు కదలడం. వీర్రాజు వెళ్ళిపోతే జానకిని ఎలాగేనా ఒప్పించవచ్చు. జానకిని ఒప్పిస్తే, రామారావు చెల్లెలు కాంతను తన కులకాంత చేసుకుని, ఇల్లు నిలబెట్టుకోవచ్చు. ఇదంతా జరిగితీరాలి అని ఘోషించింది ఆయన హృదయం.

కారు చప్పున కదలాలని జానకిశరీరంలో ప్రత్యణువు ప్రతి రక్తబిందువు ప్రగాఢంగా ఆకాంక్షిస్తున్నాయి. వీర్రాజుని చేసుకుంటే అతనినీడలో తను ఎంత నిశ్చింతగా ఉండవచ్చో ఆమె ఊహించింది. ఊహలు సాగినకొద్దీ ఆకాంక్ష ప్రబలమవుతోంది. ఆశలు చెలరేగినకొద్దీ భయం ఆవరిస్తోంది.

కారు తొందరగా వెళ్ళాలనీ, ఒక ఇల్లు నిలబెట్టే అదృష్టం పట్టాలనీ సుందరమ్మమనసు తొందర పడుతూంది. అప్పుడే కారు వాళ్ళకి అమ్మవచ్చు. అది తన కళ్ళెదటే ఉంటుంది. తను కొనుక్కోలేక పోయినా పరవాలేదు.

భార్యబుద్ధి మళ్ళా అడ్డదారి పట్టేలోగా కారును వదిలించుకోవాలని చక్రవర్తి మనసు మహా ఆరాటపడుతూంది.

కారు కదిలి, వీర్రాజు బయలుదేరేలోగా ఇల్లు చేరితే జానకి పెళ్ళి ఖాయం. అప్పుడు తనకి మేడమీద వాటా అద్దె కివ్వరు. వాళ్ళే ఉంటారు. తన కోరిక తీరదు. అందుకే కారు కదలకూడదు దైవమా అని పిన్నిగారు పరిపరివిధాల దేవుణ్ణి బతిమాలుతూంది.

కారులో కూర్చున్న నరసమ్మ పట్టుచీర జల్లుకి తడిసిపోతోంది. 'ఈ కారు కదిలి, త్వరగా ఇంటికి పోతే బాగుండును భగవంతుడా' అని ఆవిడ శతవిధాల పరమాత్ముడినే కోరుకుంటోంది.

ఆకాశంలో మెరుపు మెరిసింది. చక్రవర్తి మనసులో ఆలోచన మెరిసింది. బ్రేకు వదిలిపెట్టాడు గాలి హోరున వీచింది.

కోరికలతో కిటకిటలాడుతున్న మనుష్యులతో కిటకిటలాడుతున్న జనతా ఎక్స్‌ప్రెస్ కదిలింది.

# కలగూరగంప



## అపసవ్య వస్తురాశి

ఉదజని పరమాణువులో ఒక ప్రొటాన్ (proton) చుట్టూ ఒక ఎలెక్ట్రాన్ (electron) తిరుగుతూ ఉంటుందనీ, ఈ ప్రొటాన్ ధన విద్యుద్భరితమై ఉంటుందనీ (positively charged), ఎలెక్ట్రాన్ ఋణ విద్యుద్భరితమై (negatively charged) ఉంటుందనీ. ఒక ప్రొటాన్ ఒక ఎలెక్ట్రాన్ కన్న షుమారు 1837 రెట్లు వస్తు రాశి (mass) కలిగి యుంటుందనీ అందరకూ తెలిసిన విషయమే.

1932 లో ఆండర్‌సన్ (C. D. Anderson) కాస్మిక్ కిరణముల (cosmic rays) పరిశోధనలలో ఎలెక్ట్రాన్ యొక్క వస్తు రాశిని కలిగి ప్రొటాన్ వలె ధన విద్యుద్భరితమయిన 'పాసిట్రాన్' (Positron) అను దానిని కని పెట్టెను. ఈ పాసిట్రాన్ అస్తిత్వాన్ని బట్టి, ధన విద్యుద్భరితమైన ఎలెక్ట్రాన్ వంటిది ఉన్నది గనుక ఋణ విద్యుద్భరితమైన ప్రోటానును పోలినది కూడ ఉండవచ్చునని ఊహింపబడినది. దీనిని 'ఏంటీ ప్రోటాన్' (anti-proton) అనవచ్చును. కాని ఈ ఏంటీ ప్రోటాన్‌లు ప్రోటాన్లకు తగిలితే పరస్పరం ఒండొంటిని నశింపజేసుకొంటాయని సిద్ధాంతీకరింపబడినది. ఏంటీ ప్రోటానులు సంపూర్ణమైన శూన్యము (absolute Vacuum) లో మాత్రం ఉండవచ్చును.

పోయిన నెలలో కేలిఫోర్నియా విశ్వ విద్యాలయ శాస్త్ర విజ్ఞాన పరిశోధన శాఖలో సెగ్రె, ఛేంబర్లేన్, వీగాంట్, యిప్సిలాంటిస్‌లు ఏంటీ ప్రొటాన్లున్నవని తొలిసారిగా నిరూపించారు. ఒకో ప్రొటానుకు బివేట్రాన్ (Bevatron) యంత్రంలో 620 కోట్ల ఎలెక్ట్రాన్ వోల్టు శక్తి కలిగేటట్లు చేసి ఇంకొక ప్రొటానును ఢీకొనేటట్లు చేసినట్లయితే ఒక ఏంటీ ప్రోటాన్ ఏర్పడవచ్చునని వారు ఊహించారు. ఆ విధంగానే బివెట్రాన్‌లో అంత శక్తివంతముగా చేయబడిన ప్రొటాన్లను ఒక రాగి లక్ష్యాన్ని (copper target) ఢీకొనేటట్లు చేసి అందు మూలంగా కలిగిన ప్రసారములను (secondary variations) ఒక విద్యుదయస్కాంత (electro-magnetic) క్షేత్రం (Field) లో నించి పోనిచ్చారు. ఈ క్షేత్రం ఏంటీ ప్రోటానులు తప్ప మిగిలిన వాటినన్నిటిని వడపోసేటట్లు నిర్మించబడినది. ఆ విధంగా చేయగా ఈ క్షేత్రమును దాటి కొన్ని కణములు మిగిలినవి. ఇవి క్షేత్రమును వదలి (సంపూర్ణమైన శూన్యము లేనందున, పరమాణువులు మొదలగునవి ఉండటము చేత) ప్రోటాన్లు తగులుట చేత వెంటనే నశించిపోయినవి.

ప్రో అస్తిత్వం ఋజువు అయినందున, కేంద్రమునందు, ఏంటీ ప్రోటాను, దాని చుట్టూ తిరుగుచున్న పాసిట్రాన్ 'ఏంటీ హైడ్రోజన్' (anti hydrogen) పరమాణువు యొక్క అస్తిత్వము నంగీకరించవచ్చును. అదే విధముగా తక్కిన మూల పదార్థము (elements) లన్నిటి పరమాణువులు కూడా ఉండవచ్చును. అనగా, అపసవ్య వస్తు రాశి (anti-matter) కూడా కలదని ఊహించవచ్చును. సాధారణ పరమాణువులలో వస్తు రాశికి మాత్రం కారణమైన న్యూట్రాన్లు (neutrons) ఏంటీ ప్రోటాన్లతో కలిసి ఉండలేవు. కాబట్టి అపసవ్య వస్తు రాశి పరమాణువులలోని 'న్యూట్రాన్లు' విపర్యస్తములైన (reversed) అయస్కాంత గుణములు (magnetic properties) కలిగి ఉండవలెను. అపసవ్య వస్తు రాశి ఏ విధముగా ఉంటుందో ఎవరూ ఊహించలేకుండా ఉన్నారు.

సిద్ధాంతరీత్యా ఈ విధమైన అపసవ్య వస్తు రాశి ఉండు ఆస్కారము కనుపించుచున్నూ అట్టిది విశ్వమునందు లేదనియే ప్రసిద్ధ విజ్ఞాన వేత్తలు నమ్ముచున్నారు. కాని దూరదూరాంతరములయందున్న నక్షత్రముల యొక్క అయస్కాంత గుణాలను తెలిసినంత

సునిశితముగా పరిశోధింపగల యంత్ర నిర్మాణము జరిగిన గాని దీని అస్తిత్వమును స్థాపించుటకు వీలు లేదని సెగ్రె వాదించుచున్నారు. విశ్వమునందట్టి వాటి అస్తిత్వమున్ననూ లేకున్ననూ, వాటి అస్తిత్వమునకు కావలసిన పరిస్థితులను పరిశోధన కేంద్రములలోనే కృత్రిమముగా కల్పించి అట్టి అపసవ్య వస్తు రాశి పరమాణువులను సృష్టింప ప్రయత్నించబోవుచున్నారు.

# భారత సంస్కృతిపట్ల రష్యా ప్రజల ఆసక్తి

శ్రీ రావెళ్ల హనుమంతరావు

ఒక దేశాన్ని మరొక దేశం స్నేహభావంతోనూ, సౌహార్దపు టుద్దేశ్యంతోనూ చూస్తున్న దనడానికి ప్రబల నిదర్శనం, ఆ దేశంయొక్క సాహిత్యాన్ని, సంస్కృతిని-కళల్ని ఆదరాభిమానాలతో గౌరవించడమే.

సోవియట్ రష్యాప్రజలు మన రామాయణ, భారతాది ప్రాచీన గ్రంథాలు మొదలు అధునాతన గ్రంథాలవరకు తమభాషలోకిఅనువదించుకొని ఎంతో ఆసక్తితో చదువుతూన్నారు. భారతదేశ నాగరికతను, సత్ సంప్రదాయాలను ఎంతో అభిమానంతో తెలుసుకొంటూన్నారు.

సోవియట్ దేశపు విదేశాల నిఘంటువులకు - దేశీయ నిఘంటువులకు సంబంధించిన ప్రభుత్వ ప్రచురణాలయం ఉంది. ఇది సోవియట్ దేశానికిజెందిన భారతీయ విద్యాధ్యయన వేత్తయగు "వి. బెస్కోని" తయారుజేసిన ఒక పెద్ద హిందీ—రష్యన్ భాషల నిఘంటువును ముద్రణకు సిద్ధంజేసింది. తదితర భారతీయ భాషలకు సంబంధించిన నిఘంటువులనుగూడా అది ప్రచురణకు సిద్ధంజేస్తోంది.

ప్రాచీనకాలంలోనే అజంతా-ఎల్లోరాలవంటి ఉత్తమ కళాఖండాలను, రామాయణం-మహాభారతం లాంటి కావ్యసంపదలను సృష్టించగల్గిన భారతదేశ ప్రజల స్వతస్సిద్ధమైన, బహుముఖమైన సంస్కృతి పట్ల సోవియట్ ప్రజాసామాన్యంలో దినదినాభివృద్ధి గాంచుతూన్న ఆసక్తియే ఈ క్రొత్త నిఘంటువుల ప్రచురణకు పురికొల్పింది.

భారతసంస్కృతినీ, సాంప్రదాయాల్నీ, కళాచాతుర్యాన్నీ అవగాహన చేసుకోవాలనెడి ఆకాంక్ష సోవియట్ ప్రజాసామాన్యంలో దినదినాభివృద్ధి గాంచుతోంది. దీని కనుగుణంగా తగు ప్రయత్నాలను జేస్తూన్నది సోవియట్ ప్రభుత్వం. దీని ఫలితమే హిందీ - రష్యన్ భాషలలో నిఘంటువును తయారుచేయడం. ఇతర భాషలలో కూడా నిఘంటువులను తయారుచేయడానికి తగు ప్రయత్నాల సాగించడం. భారతదేశ సాహిత్యానికి-శిల్పకళకు సంబంధించిన ప్రదర్శన లనేకంగా రష్యాదేశంలో ప్రదర్శించడానికి తగు ఏర్పాట్లు చేయడం.

సోవియట్ దేశంలో గల పురాతన విద్యాసంస్థలైన మాస్కో, లెనిన్గ్రాడు విశ్వవిద్యాలయాలలోను, తాష్కెంటు విశ్వవిద్యాలయంలోను, సోవియట్ దేశ విజ్ఞానశాస్త్రపరిషత్తుకు సంబంధించిన ప్రాచ్యవిద్యాసంస్థలలోను, తదితర ఉన్నత విద్యాసంస్థలలోను భారతసారస్వతంలో గల అత్యుత్తమ గ్రంథాల మాతృకలను చదవడానికిగాను ఆధునిక భారతీయభాషలను సోవియట్ యువకులు కూలంకషంగా అధ్యయనం జేస్తూన్నారు.

భారతదేశచరిత్రను సోవియట్ ప్రజలకు పరిచయంచేసే గ్రంథాలు అనేకానేకంగా ముద్రింపబడుతూన్నాయి. ప్రాచీన, మధ్యయుగభారత సారస్వతంలోని నమూనాలు, అనేకమంది అధునాతన భారతీయకవులు రచించిన గ్రంథాలు వీటిలోన్నాయి.

భారతీయమహాకవి తులసీదాసు కృతమయిన రామాయణమూ, ప్రాచీన పురాణకావ్యమైన మహాభారతమూ రష్యన్ భాషలో ప్రచురింపబడ్డాయి.

రష్యన్భాషలోనికి భారతదేశానికి సంబంధించినగ్రంథాలు ఇంకనూ చాలా అనువదింపబడ్డాయి. అశ్వఘోషుడు వ్రాసిన బుద్ధచరిత్ర — కాళిదాసు రచించిన శాకుంతలము— మేఘసందేశము—ప్రాచీన భారతీయ కథలకుజెందిన పంచతంత్రము — లల్లుజీ

లాల్ రచించిన కృష్ణలీలలు — మున్నగు పుస్తకాలెన్నో రష్యన్ భాషలో కనువదింపబడినాయి.

రవీంద్రనాథ ఠాగూర్ — ప్రేమచంద్ — కిషన్‌చందర్ — ముల్కరాజ్ ఆనంద్ — వల్లథోల్ హరీంద్రనాథఛటోపాధ్యాయ — అహ్మద్ అబ్బాస్ — నవతేజ్ తదితర రచయితల రచన లెంతగానో సోవియట్ పాఠకుల హృదయాలను చూరగొంటూన్నాయి.

భారతీయ మహాకవి రవీంద్రనాథఠాగూర్ రచనలు సోవియట్ దేశంలో మొత్తం 2,50.000 ప్రతులలో ప్రచురింపబడ్డాయి.

ముల్కరాజ్ ఆనంద్ వ్రాసిన "కూలీ" — భవానీ భట్టాచార్య వ్రాసిన "ఎంతోమంది క్షుధార్తులు" అనెడి నవలలు. హరీంద్రనాథఛటోపాధ్యాయ వ్రాసిన "భారతదేశవాణి" అనెడి పద్యసంపుటం గూడా పెద్ద సంపుటాలుగా వేలసంఖ్యలలో ప్రచురించడం జరిగింది.

భారతీయ రచయితలు — కవులు రచించిన నవలలు — గాథలు — కథలు — పద్యాలు ఎంతగానో సోవియట్ పాఠకులనుంచి గౌరవ మర్యాదలను పొందుతూన్నాయి. సోవియట్ కార్మికులు — సమిష్టి రైతులు — విజ్ఞానశాస్త్రజ్ఞులు — విద్యార్థులు వాటిని విస్తారంగా చదువుతూన్నారు. వాటినిగురించి సాహితీ సమావేశాలలో చర్చించుచుతూన్నారు.

ఆధునిక భారతీయ సాహిత్యాన్ని, కళలను, సోవియట్ దేశంలో ప్రచారంచేయడంలో సోవియట్ పత్రికలు చాలా గొప్ప పాత్రను నిర్వహించుతూన్నాయి.

కిషన్‌చందర్ — నవతేజ్ — అహమ్మద్ అబ్బాస్ — ముల్కరాజ్ ఆనంద్ మున్నగు భారతీయ గ్రంథకర్తల రచనలను సోవియట్ సచిత్ర వారపత్రికయగు "ఒగాన్యోక్" వరుసగా ప్రచురించింది. ఒగాన్యోక్ గ్రంథమండలి ప్రత్యేక సంపుటాలుగా ఈ క్రిందిపుస్తకాలను ప్రచురించింది.

కిషన్‌చందర్ రచించిన "పాలాలు మేలు కున్నపుడు — జ్వాల — కుసుమములు.

ప్రేమచంద్ — ముల్కరాజ్ ఆనంద్ — నవతేజ్ — కిషన్‌చందర్ — మానిక్ బెనర్జీ — ఇబ్రహీం మున్నగువారిచే రచింపబడిన "భారతీయ కథలు"

ఇవన్నీ ఒకొక్క సంపుటి లక్షా ఏభైవేల ప్రతులలో ప్రచురించడం జరిగింది.

చాలామంది సోవియట్ రచయితలు భారతదేశానికి సంబంధించిన కథలను తమకు తామే స్వంతంగా రచించుచుతూన్నారు.

"ఒక ప్రమాదకరమైన పలాయితుడు" అనెడి పేరుతో సోవియట్ కవి "వ్యగోరస్కాయా" రచించిన గాథ యిందుకొక ఉదాహరణ. భారతప్రజలు తమను పీడించుతూన్న విదేశసామ్రాజ్యవాదులపై తిరుగబడిన 1857 సిపాయిల తిరుగుబాటును ఇందులో చిత్రించడం జరిగింది.

సోవియట్‌దేశప్రజానటుడు యన్. చెర్కాసోవ్ చే వ్రాయబడిన గ్రంథం "భారతదేశంలో" అనేది సోవియట్ రష్యాలో విస్తారంగా విక్రయింపబడింది. సోవియట్ గ్రంథాలయాలు యీ పుస్తకాన్ని ఎక్కువగా కొన్నాయి. ఒకొక్క గ్రంథాలయంలో డజనుపుస్తకాలున్నప్పటికీ ప్రతిరోజూ అనేకమంది

పాఠకు లీ పుస్తకాలు లభించక నిరుత్సాహంతో తిరిగి పోతూన్నారు. ఈ గ్రంథంలో యస్. ఛెర్కాస్సోవ్ తన భారతదేశయాత్రానుభవాలను విశేషంగా వర్ణించారు. భారతసంస్కృతీసహజస్వభావాన్ని—ప్రభావాన్ని బాగా కొనియాడారు.

భారత సంస్కృత మహాకవియగు కాళిదాస కృతమైన "శాకుంతలం" రష్యనుభాషలోకి అనువదింపబడింది. "వి. కోర్నియేవ్" అనెడి రష్యా రచయిత దీన్నిగురించి వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ఉదహరించడం అవసరమనుకొంటాను.

"మాస్కోలోని ప్రభుత్వ కథా - కవితా సాహిత్యాల ప్రచురణాలయం ఇటీవల 30 వేల ప్రతులలో అందంగా ప్రచురించిన పుస్తకం ఒకటి నావద్దవుంది ముఖపత్రంపైని అల్లుకొనివున్న కొమ్మలు అంచులంచులుగానూ, ఎంతో అందంగానూ వున్నాయి.

ఆ విధంగానున్న కొమ్మలమధ్యన ఆలోచనానిమగ్నయైన యువతి వుంది. ఆమెకు సమీపంలో హాయిగా పడుకొనివున్న జింకపిల్లవుంది. పైభాగాన తళతళమని మెరుస్తూన్న స్వర్ణాక్షరాలలో 'కాళిదాసుని—శాకుంతలం' అనెడి అక్షరాలున్నాయి."

ఈ నాటి పాఠకునికీ, భారతీయ మహాకవీ—నాటకకర్త అయిన కాళిదాసు జీవించి కృషిజేసిన కాలానికీ మధ్య పదిహేను శతాబ్దాలున్నాయి. "శకుంతల" ఆకర్షణ విశిష్టత ఎందులోవుంది. పాఠకుని భావననూ, ప్రేక్షకుని హృదయాన్నీ పదిహేను వందల సంవత్సరాలుగా అది ఉత్తేజపరుస్తూండడానికి గల కారణమేమిటి? అద్భుతమైన ప్రకృతి పరిసరాలలో వికసించెడి మానవభావాలను చిత్రించడంలోని నైపుణ్యమే పాఠకుల హృదయాలను వశంజేసుకొంటూన్నది. దుష్యంతునియెడల శకుంతల అనురాగం చక్కని నగిషీ పనితనంతోనూ, ఉత్తేజితమైన మనోభావ విజ్ఞానంతోనూ చిత్రింపబడింది."

ఈ విధంగా సోవియట్ ప్రజలు శ్రద్ధ జూపుతూన్నది ఒక్క భారతీయ సాహిత్యానికి మాత్రమే గాదు. భారతీయ శిల్పుల కళాకౌశలాన్ని గూడా వారు ప్రేమించుతూన్నారు. గోర్కీ కేంద్రం పార్కులో ప్రదర్శింపబడిన భారత చేతిపనుల ప్రదర్శనలకు మాస్కో ప్రజ ఎంతగానో విలువ నిచ్చారు.

అదేవిధంగా భారత చిత్రకళా ప్రదర్శనయెడల గూడా సోవియట్ ప్రజ అమితమైన ఆదరణ చూపించారు.

అఖిలభారత లలితకళా సంఘంవారు సోవియట్ దేశంలో ఏర్పాటుజేసిన భారత లలితకళా ప్రదర్శనం సోవియట్ ప్రజాసామాన్యాన్ని బాగా ఆకర్షించింది. లక్షలాది రష్యనుప్రజలు మాస్కో—కీవ్—లెనిన్‌గ్రాడ్ నగరాలలో ప్రదర్శింపబడిన ప్రదర్శనలను దర్శించి సంతుష్టు లయ్యారు.

సోవియట్ రష్యాప్రజలు భారతదేశాన్ని ఎంతగా గౌరవించుతూన్నారో! విదేశాలలో మన దేశ గౌరవం ఏవిధంగా పెరుగుతూన్నదో! దీన్నిబట్టి అర్థం జేసుకోవచ్చును.



సోవియట్ ప్రధాని బుల్గానిన్



సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి కృశ్చేవ

# సోవియెట్

గత మాసం ద్వితీయార్థంలో భారతి ప్రభుత్వాహ్వానంపై సోవియట్ అగ్రనాయకులు ప్రధాని బుల్గానిన్, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి కృశ్చేవులు భారతదేశం వచ్చి ఆసేతుహిమాచలం పర్యటించి భారత ప్రజలపట్ల తమ సుహృద్భావాన్ని వ్యక్తం చేశారు.

విప్లవానంతరం సోవియట్ అగ్రనాయకులు ఇలా పరాయి దేశాలకు వచ్చి ఇంత స్వేచ్ఛగా ప్రజానీకంతో కలసి మెలసి పర్యటించినదిలేదు. ఇదే ప్రప్రథమం. సోవియట్ అగ్రనాయకులు అలా హృదయాలు విచ్చి సుహృద్భావాన్ని వెల్లడించటానికి తగిన వాతావరణాన్ని కల్పించ గలిగినందులకు భారత ప్రజలు తమకుదా గర్వపడవచ్చు. ఈ అతిథుల రాకతో రష్యా భారత దేశాల మైత్రి ఇతోధికంగా పెంపొందటమేగాక, అంతర్జాతీయ రాజకీయ రంగాన్ని ఆవరించిన వున్న చికాకుకూడా చాలవరకు అంతరించిపోగలదని అభిజ్ఞులంటున్నారు.

# సోవియట్ ప్రదర్శనం

గతమాసం ద్వితీయార్థంలో మద్రాసు మ్యూజియం హాలులో సోవియట్ చేతిపనుల ప్రదర్శనం ఒకటి జరిగింది. ఈ ప్రదర్శనానికి మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారు ఆవిష్కరణ మహోత్సవం జరిపారు. చేతిమీద తయారుచేసిన ఆయా వస్తువులపై సోవియట్ కర్మకారులు వ్యక్తీకరించిన కళాచాతుర్యం చూడ ముచ్చటగా వున్నది. ముఖ్యంగా—చిత్తుకాగితాలు ఒకదానిపై ఒకటి అంటించి తయారుచేసిన అలంకరణ పేటిక, దాని పైభాగాన చిత్రించిన తైలవర్ణచిత్రం చూసి పలువురు ప్రశంసించారు. ప్రదర్శనంలోని దంతంబొమ్మలు కొన్ని అత్యంతమైన శిల్పనైపుణిని వ్యక్తం చేస్తున్నయ్. (చిత్రాలు ప్రక్క పేజీలో చూడండి.)



ఉత్తర ధృవవాసుల దుప్పులబండి - దంతపుబొమ్మ



చితు కాగితాలతో తయారుచేసిన ఒక అలంకారపేటికపైగల తైలవర్ణ చిత్రం



ఉత్తర ధృవవాసుల కుక్కలబండి - దంతపుబొమ్మ

# గ్రంథ విమర్శనము



## శర్వరి

జారున్ జాలియు గంపితస్వరములన్
జాలొక్క గమాంబూత తాం
బూరా మేళనతో జతించి గమకం
బుల్ పంచమాకృష్ట గాం
ధారం బంతరుపోథమా నొకవిపా
దస్థాయి నెక్కొల్ప ద
ర్బారీ రాగిణి నాలపించె బులకిం
పన్ తానసేనానిశిన్.

తాన్‌సేన్ ఆలాపన యేమిటో మనం వినకపోయినా శ్రీ ఆకిలి శ్రీరామశర్మగారు ఈ మధురాలాపంతో 'శర్వరి' కావ్యగానానికి ఉపక్రమించటం సమ్మోహనంగా వుంది.

'శర్వరి' అనే యీ కావ్యం శ్రీ ఆకిలి శ్రీరామశర్మగారి రచన.

'తాన్‌సేన్‌కా దర్బారి' అనే ప్రతీతి వినేవుంటారు. తాన్‌సేన్ అక్బరు చక్రవర్తి దర్బారులోని మహా గాయకుడు. సంగీత సంప్రదాయ లోకంలో ఆయననుగురించి కథలు కథలుగా చెప్పుకుంటూ వుంటారు. 'దీపక్' పాడి చనిపోతున్న చక్రవర్తి కుమార్తెను బ్రతికించాడని ఒక కథ, మేఘరంజని పాడి వర్షం కురిపించాడని ఒక కథ, అలా రాగానికి ఒక కథగా తాన్‌సేన్ జీవిత చరిత్రను అలుముకుని వున్నయ్. అవన్నీ—చారిత్రక సిద్ధిగల వాస్తవ సంఘటనలుగా ఎవరూ మన నెత్తిన వేసి రుద్దటానికి ప్రయత్నించకపోతే — లలితావేశశోభితములైన మధురగాథలు; విని ఆనందించవచ్చు. ఈ 'తాన్‌సేన్‌కా దర్బారీ' కూడా అలాంటి వాటిలో ఒకటి.

అక్బరుకు ఒక కూతురుందిట; దాని పేరు శర్వరి. మదమతి; హఠాత్తుగా ఒకనాడు తాన్‌సేన్ దాని కళ్ల బడతాడు. అతని రూపురేఖలు చూచి దాని హృదయం చలించుతుంది.

'అమృతమయమ్మైన మీగా
త్రము నాకిబ్బంగి జేసి, తావకిశిష్య
త్వము నొసగి యేలుకొను మీ
తములమ్ముఁ జేపట్టి జన్మ ధన్యముగాగన్'

అని వ్రాసి అనుమపత్రలో బెట్టి దూతిక చేత సందేశం పంపుతుంది. 'మీ గాత్రంబు నా కిబ్బంగ జేసి' అన్న పదబంధంలోని వ్యంగ్యార్థాన్ని గ్రహించి తాన్‌సేన్ ఆ రాయబారాన్ని తిరస్కరించి, తాంబూలద్వయం వాపసు పంపేస్తాడు.

కాని శర్వరి మనస్సు మాత్రం అతనియందే లగ్నమైపోతుంది. అతనికి యేకలవ్య శిష్యత్వం ప్రారంభించి అతని సంప్రదాయంలో దర్బారీ రాగాన్ని సాధన చేస్తుంది. ఇలా యిరువకేండ్లు తన యౌవనాన్ని తాన్‌సేన్ దర్బారీకి జన్నిగడుతుంది.

ఇలా ఉండగా ఒకనాడు:

'సుడివడ ధూళి రేపి విను
చూలి కలంచె జగంబుకిన్ను, వెన్
మడిగిన పందెరక్కసులు
మబ్బుతెరల్ విడద్రోసి బైటికిన్
వెడలెదరో యనన్ బ్రకృతి
భీకరమై యడరారె నెల్లెడన్
పడమటి దిఙ్ముఖంబు కను
పట్టెను మృత్యువు నావులింతనాన్'

తాన్‌సేన్ జీవనమరణసంధ్యలో పడిపోయాడు.

'కరుణదర్బారి గాయకు చరమఘటిక
లవసరించెడు దుర్వేళయది—తదర్థ,
'మాఖిరు సలామ్ అదాబంది' కచటజేరి
రక్బరును తత్కుమారకు లమితభక్తి.

తనువు టూర్పు లెంచయు దాంచేను 'బనాతు'
నొంటుగుదిండ్ల పట్టుపఱుపుపైని
నొరగిల్ల బంధియుంచె మర్త్యా మర్త్య
ధారుణీ గతాగతములతోడ

'ఇక నాతోడనె దర్బా
రికె వచ్చున్ మృత్యుశిథిలరేఖ, లవలమా
నక మగు సమాధిలో సం
జికసది విన్పించు శీర్ణశీర్ణస్వరమై'

అని 'స్వగాన రహస్యంబులను గ్రహించి
పేరు నిలుపంగగలవాడు స్వీయశిష్యు
లందు నొకడైన దేలమి' సతడు వగచు
స్వాశ్రేయ వియుజ్యమాన కలాభిలాష

గురువులు మహాయాత్రాసమయంలో వున్నారని తెలిసింది. ఆమె హృదయం కరుణావిలమై పోయింది. ఉత్కంఠతో దర్బారీరాగాలాపన సుప్రక్రమించింది.

అవియే మూర్ఛనలున్ వ్యథ
లవియే అయ్యదియె పంచమాపన్నంబై
తవు గాంధారంబు"—
తన ప్రియంబైన దర్బారిననుకరించి
అద్భుతమగు తన బాణిగానాలపింతు
రెవ్వరా? దూరమునుండి యెరుగరాక
అనుచు వెతతోడ జెవి నతడటు మరల్చె

అతనికి అంతా అవగతమైంది. తనకు ఏకాంతం ప్రసాదించవలసిందని అక్బరు చక్రవర్తిని కోరాడు. అతని తుదికోర్కె మన్నించి అక్బరు అతని కుమారులూ వెళ్ళిపోయారు. చేరువలో వున్న ఆంతరంగికుడైన ఒక శిష్యుణ్ణి పంపి ద్వారముఖంలో పురుషవేషంలో నిలచి వున్న పాటగాని నొకని లోపలికి ఆహ్వానించాడు. ఆ వ్యక్తి శర్వరి: 'శర్వరి! క్షమింపు నే భ్రాంతి జడుడనైతి' అని క్షమాపణ చెప్పుకున్నాడు.

'ఓకరుణోద్ధురా! నృపగురూ!
ఇకనైనను నన్ను శిష్యగా
గైకొనవా?'

అని యామె అంగలార్చినది. అతడు పాడు పాడుమని తొందరించినాడు. వారి యిరువురి గాత్రములలోనూ కరుణదర్బారీ ఒక్కసారి ప్రభవించి పంచమస్థాయి నందుకొన్నది.

ఆదిమొదలు బ్రహ్మాండపర్యంత మెనసి
కరుణదర్బారి యెల్లెడ గడలుకొనియె
అఖిలరస లేలిహానమై అవధిగనని
శోకసామ్రాజ్యమున మున్గె లోక మెల్ల.

ఇది నవ్యాంధ్ర సాహిత్యరంగంలో వెలువడిన ఒక హృద్యమైన లలితకావ్యం. ప్రాప్తిస్థానం: ఆకిలి వెంకట సుబ్రహ్మణ్యం, ముత్తుకూరు, నెల్లూరుజిల్లా. వెల: 1-0-0.

## కావ్యవనము

ఖండకావ్యసంపుటి; రచన: శ్రీ గువ్వూరి రామలింగారెడ్డి; మహతీపబ్లికేషన్సు, వాకాడు నెల్లూరు జిల్లా. వెల రు 0-8-0.

ఈ సంపుటిలో 'అనుగమనము' 'దళితకుసుమము' 'రంభ', 'కమలకుమారి' 'క్రీడ'. 'భోగి—యోగి', యశోధర అనే శీర్షికలలో 7 కృతులున్నాయి. వీటిలో 'కమలకుమారి' సుదర్శన్‌గారి 'కమల్ కీ భేటీ' అనే హిందీ కథానికను, 'క్రీడ' అనేది జైనేంద్రకుమార్ గారి 'ఖేల్' అనే హిందీకథను అనుసరించి వ్రాసినవి. మిగతావి స్వతంత్ర రచనలు. ఈ స్వతంత్ర రచనలలో కూడా రచయిత తన విజ్ఞానపరిశోధితములైన స్వతంత్ర భావములను వ్యక్తీకరించటంకన్న ఆయా ప్రముఖ రచయితల భావాలను తిరిగి చెప్పటం కనుపించుతుంది. 'భోగి—యోగి' అనే కావ్యంలో ఓమర్ ఖయ్యాం ప్రత్యక్షమౌతాడు. 'రంభ' రవీంద్రుని ఊర్వశి రూపురేఖలతో ప్రభవించి చివరికి రచయితవద్ద 'ఆంటీనాచ్' సందేశం పుచ్చుకుని హతమారిపోతుంది. రచయితలో రసదృష్టికంటే యేవో అభిప్రాయాలను జనానికి అందజేయాలనే ఉబలాటం జాస్తి. అందుచేత ఏ ఒక్క కృతీ కావ్యముగా సిద్ధిని పొందలేకపోతుంది. రచయితకు భాషాపాండిత్యం పద్యనిర్మాణదక్షతా వున్నాయి. అనుకరణదృష్టి విడిచేసి స్వతంత్ర యోజనాపరుడు కాగలిగితే భవిష్యత్తు వుంటుంది.

## అగ్నిపర్వతం

నవల: రచన: శ్రీ చింతపెంట సత్యనారాయణరావు; ఎవరెస్టు పబ్లికేషన్సు, రేలంగి; వెల 0-8-0.

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: ; S. Sambhu Prasad.



# తలనొప్పి?

అమృతాంజనము వాడండి
వెంటనే తగ్గిపోతుంది !!

బాధను తొలగించి
హాయిని కలిగించును

# అమృతాంజనము

